# భారతి

సాహిత్య మాసపత్రిక





సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



జనవరి 1958

సంపుటము 35 : : సంచిక 1

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1958

# స్వ వి ష య ము

**భారతి** ముప్పదినాల్గు సంవత్సరముల సమ్యక్‌చరిత్రను రూపొందించుకొని, నేడు ముప్పదిఅయిదవయేట అడుగిడుచున్నది. ఏటేటా, జన్మదినోత్సవ సమయమున గత చరిత్ర నించుక సింహావలోకనము చేసుకొని భవిష్యత్తు పైకి దృష్టి సారించుట భారతికి సంప్రదాయమై యున్నది.

సమ్యగ్దర్శనము, సమ్యక్‌జ్ఞానమునకు సాధనమైయున్నది; సమ్యక్‌జ్ఞానము సమ్యక్‌చరిత్రకు ఆధారమైయున్నది. 'సమ్యక్‌దర్శనము', 'సమ్యక్‌జ్ఞానము', 'సమ్యక్‌చరిత్ర'—యివి జైనమత 'రత్నత్రయం'గా చెప్పబడుతున్నా, నిజానికి యివి భారతీయ తాత్త్వికరంగానికీ, తద్వారా భారతజాతీయ పురోగమనానికి ప్రధాన ప్రాతిపదికలై వున్నాయి. ఈ మూటినీ సమగ్రంగా అవగతం చేసుకుంటే, భారత జాతీయ జీవనం లక్ష్యశుద్ధిలేని వెఱ్ఱివాడిచేతిరాయిలా వున్నదనే వాదం పరాస్తమైపోతుంది. అయితే యీ రత్నత్రయాన్ని ఆచరణలో ఎంతవరకు సాధించుతున్నామనేది ఆత్మపరీక్ష చేసుకోవలసిన విషయం.

సమ్యగ్దర్శనము, సమ్యక్‌జ్ఞానము, సమ్యక్‌చరిత్ర—ఇవి స్థూలంగా మూడుగా చెప్పబడుతున్నా నిజానికి యివి ఒకే వ్యవస్థయొక్క మూడుదశలు. సమ్యగ్దర్శనము సమ్యక్‌జ్ఞానమునకు సాధనము; సమ్యక్‌జ్ఞానము సమ్యక్‌చరిత్రకు అధారము. అందుచేత ఇందు సమ్యక్‌దర్శనము అత్యంత ప్రధానమైనదని తేలుతున్నది.

కాగా, సమ్యగ్ దర్శనమన నేమి? మనకు కొన్ని దర్శనశాస్త్రము లున్నవి. అట్లే సర్వజాతులకూ ఉన్నవి. ఈ దర్శన శాస్త్రములపరిచయము లేనివా డెవ్వడూ జ్ఞానవంతుడు కానేరడు. వానికి సమ్యక్ చరిత్ర సిద్ధింపదు. చరిత్రహీను లిట్టివారే. ఈ దర్శనశాస్త్రములు స్థాణువులుకావు; ఇవి పరిణామశీలము కలవి. వీటి పురోగమన మీ శతాబ్దమున మహోజ్వలముగ సాగిపోవుచున్నది. విశ్వవిజ్ఞానము, సమైక్యమై, ఏకముఖమై సాగిపోవుచున్న ఈ దశలో, నిజానికి మనం దాని గమనాన్ని అందుకోలేకుండా వున్నాము; అందుచేతనే, నేడు కేవల చారిత్రక పరిణామాలైన కొన్నిసంఘటనలు హఠాత్పరిణామాలుగా కన్పించి మనలను విభ్రాంతులను చేస్తున్నాయి. నిజానికి యితర పురోగమన జాతులలోకంటె మనలో నేడు సమ్యగ్దర్శనం లోపించి వున్నదంటే, ఇది అక్షరాలా అంగీకరించి తీరవలసిన పరమసత్యం.

ఈ విషయాన్ని భారతి గత జన్మదినోత్సవ సంచికలోనే ఇంచుక హెచ్చరించటం జరిగింది. కాని గత సంవత్సరంలో కూడా ఆశించిన అవధికి ఫలితాన్ని సాధించలేకపోయాం. ఈ లోపాన్ని భర్తీచేసుకోవటానికి ఆ యా భౌతిక సాంఘిక విజ్ఞానశాస్త్రాల్లో నిష్ణాతులైన ప్రాజ్ఞుల సహకారాన్ని ఎంతో వాంఛించుతున్నాం.

విజ్ఞానశాస్త్ర విషయాదికాలను పారిభాషికపదాటంకాలను అధిగమించి వ్యాస రూపంలో ప్రజాబాహుళ్యానికి అందజేయటంలోగల సాధకబాధకాలు మాకు తెలుసు. అయినా ఇది నేడు గాకపోయినా రేపైనా సాధించితీరవలసిన విషయం. ఈ కృషిలో, రచయితలకు, భారతి నిర్వాహకుల హృదయపూర్వకమైన సహకారం తప్పక వుంటుంది.

ఇది సాహిత్యపత్రికగదా, యిందు శాస్త్రవిజ్ఞానప్రసక్తియేల నని కొందరి ఆశంక. శాస్త్రీయవిజ్ఞాన పరిపుష్టిలేని సాహిత్యరంగం మూఢవిశ్వాసాల మురికికూపమై జాతీయ పురోగమనానికిగాక తద్వినాశానికి కారణమౌతుంది. ఈ కారణంచేతనే, భారతి, ఆదినుంచీ, సాహిత్య, సాంఘిక, సాంస్కృతిక రంగముల పరస్పరాశ్రయ స్వభావమును గుర్తించి సర్వతోముఖంగా సేవచేస్తూ వచ్చింది. అందుచేతనే నేడు భారతి మనుగడ చరితార్థమై వున్నది.

గత సంవత్సరం వచ్చిన రచనలను ఇంచుక పరిశీలించితే, నాటకరచనలో కొంత ముందడుగు కనుపించుతున్నది; మహోన్నత స్థాయినందుకొన్న కథాశిల్పం ఎందుచేతనో పతనమైపోతున్నది. కావ్యనిర్మాణంకూడా నిరుత్సాహజనకంగానే వున్నది—విశ్వసాహిత్య రంగంలోనే దీని స్థితి నేడు అలావున్నది; విజ్ఞానప్రచారంలో అత్యంత ప్రధానసాధనమైన వ్యాసరచన సన్నగిలిపోయినది. విమర్శనా విధానానికి తగిన సంప్రదాయం సిద్ధించుటలేదు. ఇది రచయితలను విమర్శించుట కాదు. ఈ విషయములను ఆంధ్రవాఙ్మయ నిర్మాణ బాధ్యతను వహించుతున్న రచయితల దృక్పథమునకు తెచ్చుట ఇందలి ఆశయం.

భారతిలో త్రివర్ణచిత్రాన్ని అందజేయలేకపోతున్నామని కించవున్నది. సరియైన చిత్రాలు లభించకపోవటమే యిందుకు కారణం. అనతికాలంలో ఈ లోపాన్ని భర్తీచేయటానికి సకలశక్తులా ప్రయత్నించగలము.

భారతి నిర్వహణ అసిధారావ్రతంవంటిది. అనేక సాధకబాధకాలు ఎదురౌతూ వుంటవి. కాని దేశోద్ధారకుడు నిల్పిన ఆదర్శం, సుదూరానవుండికూడా, జ్యోతిశ్చక్రంలా విస్పష్టమై కట్టెదుట వెలుగొందుతూ వుండటంచేత ఆ వెలుగుబాటను ముందుకు సాగుతున్నాము. ఇందు స్వల్పక్లేశాలూ, మార్గాయాసాలూ పరిగణించ దగినవికావు.

ఈ మహాయాత్రలో సహపాంథులై, సర్వసహకారాలూ నెరపుతూ, భారతిని ఈ ఉజ్జ్వల స్థాయిలో నిర్వహించటానికి కారణభూతులౌతున్న సమస్తాంధ్ర రచయితలకూ, కళాకారులకూ, పాఠకులకూ ఈ పర్వదినాన కృతజ్ఞతలు తెల్పుతున్నాము.

# దేశోద్ధారక సంస్మృతి

## జ్ఞానానందము

అజ్ఞానాంధముఁ గ్రమ్ముకొన్న సమయంబాంధ్రాన నీ వొంటిమై
తజ్ఞుల్ మెచ్చ తెలుంగు వాఙ్మయపు జ్యోత్స్నల్ నింపి జాతీయపుఁ
విజ్ఞానమ్మున కీవు కారకుడవై వెల్గొందు వేదాంతమ
ర్మజ్ఞా! త్యాగపరాయణా! నిను మదాంధ్రక్షోణి కొండాడెదన్.

ఉత్సాహమ్ము నశించిపోయిన మహాంధ్రోర్వీ ప్రజాపాళికిన్
ఉత్సాహమ్మునఁ గూడ నల్పిన యనన్యోదాత్తమైనట్టి నీ
యుత్సర్గమ్ము ప్రశంసనీయమగు బాబూ! విశ్వదాతా! కళల్
ప్రోత్సాహించిన నీ చరిత్రకు శతంబుల్ తెల్గుపూజాప్లుతుల్

ఆరిపోయిన మహాంధ్రావనీ విజ్ఞాన
చైతన్యదీపాలఁ జమురువోసి
అలసిపోయిన సోదరుల శరీరమ్ముల
జాతీయభావ రసమ్ముఁ బూసి
కునికిపోయిన కళాంగన జీవనముసేయ
మిసిమించురతనాల మేడఁగట్టి
తూలిపోయినక్షుధార్తుల హస్తములనిండఁ
బ్రియమార పసిఁడి గుప్పిలిని విప్పి
తెనుగు వారలకెల్ల దేశభక్తిని నేర్పి
భావినాయకులకు బాటసూపి
స్వార్థచింత లేక బ్రతికినవాడవు
విశ్వవిహిత! మహిత విశ్వదాత!

# ఈవొడ్డు, ఆవొడ్డు

శ్రీ మనోజ బసు

* బెంగాలీ కథకు అనువాదం *

ఇస్మాయిల్ ఇంటి వసారా వగైరాలు పాకిస్తాన్ లోకి, పెరడూ, గదులూ వగైరాలు హిందూస్తాన్ లోకి చీలిపోయాయి. దాంతో వసారాలో వున్న కుండీ, కోలా మరోచోటికి మార్చి, దాన్ని నడవా చేసికొన్నాడు. ఈ మార్పు చేర్పులతో ఇస్మాయిల్ పదారణాలా పాకిస్తానీయుడయ్యాడు. ఐతే మరోకంటికి తెలీకుండా ఓ రాత్రికి రాత్రి పెరటి గదిలో దాచివుంచిన డబ్బు ముంతల్ని తవ్వి తెచ్చి వసారాలో భద్రంగా పాతి పెట్టుకొన్నాడు.

రకరకాల వదంతులు బయలుదేరాయి. పట్నమంతా అల్లకల్లోలమైపోయింది. స్టేషన్నించి కదిలే ఏ రైలుని చూసినా ఈ గందరగోళమే కనిపిస్తుంది. జనం పిచ్చెత్తినట్లు పురుగుల పరుగులు పెడుతున్నారు. ఇస్మాయిల్ కొడుకు రంజాన్ స్కూల్లో చదువుకొనే కుర్రాడు. ఎవరో వాడితల బ్రద్దలు కొట్టేశారు. అందాకా వెళ్ళింది కొండ!

ఇంత బీభత్సంలో కూడా ఓ ఆశ్చర్యకరమైన విషయం జరిగింది.

మంజుల ఇస్మాయిల్ వాకిట్లో నిలబడి,దర్వాజా సందు తొంగిచూసి "ఇంత పొద్దెక్కినా నువ్వింకా నిద్రపోతూనే వున్నావా దాదా? లే, లే! మంజుని, వొచ్చా" అని అన్నది.

మంజుల గొంతువిని ఇస్మాయిల్ వాకిట్లోకి వొచ్చాడు. తనని అదేపనిగా ఎగాదిగా చూస్తూన్న ఇస్మాయిల్ తో "ఏం అలా చూస్తావేం దాదా? గుర్తు రాలేదా? హాఁ, అయిన వాళ్ళంతా నన్నింటోంచి తన్ని తగిలేశారు దాదా?" అన్నది మంజుల.

"ఎప్పుడొచ్చావ్ నువ్?" అనడిగాడు ఇస్మాయిల్. మంజుల తీవ్రంగా "ఎప్పుడొచ్చావని ఎగతాళిగా అడుగుతున్నావా? నీ ఉద్దేశ్యం తెలీకుండా వుంది దాదా!" అన్నది.

ఇస్మాయిల్ మాటాడలేదు. వెనక్కి తిరిగాడు. అతణ్ణి అనుసరించింది మంజుల.

"ఏం దాదా! ఇదివరకటిలాగా 'ఏం మంజులా, ఇన్నాళ్లు ఎక్కడ మాయమై పోయావ్. అతీపతీ లేదు. ఇప్పుడీ వల్లకాటి కెందుకొచ్చావ్?' అనడిగలేదేం దాదా?" అన్నది మంజుల.

ఇస్మాయిల్ వ్యగ్రస్వరంతో "పట్నంలోలాగా మా పేటలో ఒకళ్ళ పీకలు ఒకళ్ళు కోసుకోలేదుగా, వల్లకాడని వాగుతున్నావేఁ?" అని అన్నాడు.

"ఇప్పుడే కాయత్ పాడె నించి వొస్తున్నా దాదా! ఒకళ్ళొకళ్ళు పొడుచుకు చావకపోతే ఒక్క మనిషన్నా కనిపించాడూ? ఏళ్ళంతా ఏమై పోయినట్లు? ఇళ్లూ వాకిళ్లూ ఖావురు మంటున్నాయి." ఇలా చెబుతూంటే మంజుల కళ్లు చెమ్మగిల్లాయి. కళ్ళు తుడుచుకుని "నన్ను కాసేపు కూర్చోనిస్తావా దాదా?" అనడిగింది మంజుల లోగొంతుతో.

మంజుల గొంతువిని కామరాన్ తలుపులు తెరుచుకొని నడవాలోకి వచ్చింది.

"ఇవాళ ఇలా మాటాడుతున్నావేం మంజూ? నువుంటానికి మేడలూ మిద్దెలూ కావాలా? ఇల్లంటూ వుందిగా. ఇది ఆకాశంలో కెగిరిపోలేదుగా..." అన్నది కామరాన్.

"చూడు దీదీ! నే నేదో పరాయదాన్నయినట్టుగా ఇందాకట్నుంచీ అదోరకంగా మాటాడుతున్నాడు దాదా! ఏమిటో మరి!" అన్నది మంజుల వొత్తి చెబుతూ.

"సర్లే, చెప్పులొదిలి లోపలికిరా. నావద్దకూచో. ఆయ నసుకొనేదేదో అనుకోనివ్, ఇష్టమైతే జవాబు చెప్పు. లేదంటే మెదలకుండా కూచో" అన్నది కామరాన్.

అనువాదకులు: శ్రీ అట్లూరి రామారావు

ఈ మాటలు వింటూ మంజుల సంతోషంతో పులకించింది.

"శవాలు దొర్లాడే యీ దేశంలో మనొక్కతవే బ్రతికివున్నావనిపిస్తుంది—దీదీ! కాని, దాదా తీరుతెన్నులు చూస్తూంటే మాత్రం గుండెలు ఝుల్ మంటున్నాయి." అన్నది మంజుల.

పిడికిలి బిగించి ఇస్మాయిల్ "మీ బుర్రలు పగలకొడితే...ఇక అంతటితో పీడ విరగడైపోతుంది." అని అరిచాడు.

దిప్పున మంజుని కామరాన్ లోపలికి లాక్కుపోయింది. "మూసెమ్మా! ఆయన మాటల్ని మరోలా అనుకోకు! రంజాన్ చావుతో ఆయ నలా అయిపోయారు..." అని అన్నది కామరాన్.

కడుపులో చల్ల కదలకుండా కాలక్షేపం సాగిస్తున్న కాపరం ఇస్మాయిల్‌ది. తినడానికి, ఉండడానికి లోటులేదు. ఒక్కగాను ఒక్క కొడుకు రంజాన్. వాణ్ణి చదివించి పెద్దవాణ్ణి చెయ్యాలని తల్లిదండ్రుల ఆశ.

రంజాన్ పినతండ్రి ప్లీడరు. పట్నంలో వుంటున్నాడు. ఆ ఇంట్లో తింటూ చదువుకుంటున్నాడు రంజాన్. మతకలహాలు ప్రారంభమయ్యాక, ఆ కుర్రవాణ్ణి ఓ రోజున ఎవరో లాఠీతో తల బద్దలుకొట్టేశారు. రెండు నెలలు ఆస్పత్రిలో పడివున్నాడు. తర్వాత ఇస్మాయిల్ కొడుకుని తీసికొని ఇంటికి వొచ్చాడు. చురుకైనవాడు కావడంచేత రంజాన్‌కి వెంటనే స్కూల్లోనే ఉద్యోగంకూడా దొరికింది.

కాని, ఇటీవల రంజాన్ స్థితి మరీ అయోమయమైపోయింది. నోటమాట పెగిలేదికాదు. కళ్లు గుంటలు పడ్డాయి. నిర్దయా ప్రపంచాన్ని అర్థంచేసుకోలేక చూస్తున్నాడా అన్నట్టుండేవి రంజాన్ చూపులు.

ఉన్నట్టుండి రంజాన్ "అదిగో! అలా చూడండి...మళ్లా వొస్తున్నారు!...అయ్‌బాబో, వాళ్ళని రానివ్వకండి" అంటూ వెర్రికేకలు పెట్టేవాడు. అలా అరుస్తూ కంగారుగా పరుగెత్తేవాడు. ఓరోజున అలాగే అరిచి పరుగెత్తడంలో డాబామీదనుండి పడిపోయాడు. పాతగాయం మరింత పెద్దగాయం అయింది. రక్తధార కట్టలేదు. స్పృహతప్పింది. విపరీతమైన దాహం పుట్టింది. ఎన్ని గ్లాసులనీరు తాగినా అది కట్టలేదు. ప్రపంచంలో వున్న నదులూ సముద్రాలుకూడా అతని దాహాన్ని తీర్చలేవేమో ననిపించింది.

ఈ భయంకరస్థితి చూశాక తండ్రి ఇస్మాయిల్ మనస్సు క్రమం తప్పింది. నెత్తుటేర్లు పొంగి నెత్తిమీద పొరలుతున్నట్టు భావించాడు.

అదీ కథ!

చాలకాలానికి మంజుల తిరిగి ఈ ఇంటికి ఈ స్థితిలో వొచ్చింది. మంజుల కామరాన్ పరస్పరం కన్నీటితో కౌగిలించుకొని కష్టసుఖాలు చెప్పుకున్నారు. మంచీ చెడ్డా మాటాడుకున్నారు.

చివరికి మంజు, "మా నాన్న ఎక్కడున్నాడో నీకు తెలుసా దీదీ?" అనడిగింది.

కామరాన్‌నోట మాట రాలేదు. కళ్లుమాత్రం నీళ్ళతో నిండిపోయాయి. మంజు ఆదుర్దాగా "ఆయన్ని కూడా చంపేశారా? చెప్పవూ?" అనడిగింది.

కామరాన్ నిట్టూర్చి; "లేదమ్మా, ఎవరూ ఆయన్ని చంపలేదమ్మా! ఆయనే మృత్యువుని వెతుక్కుంటూ తిరుగుతున్నాడు." అని అంది.

మంజుల "తన జన్మభూమిలోనే వుండి నిర్భయంగా బ్రతికే శక్తికూడా లేదా? పిరికితనంతో పారిపోయాడా?" అన్నది.

కామరాన్: "మంజూ! ఎవరూ కన్న వూరినీ, ఆస్తిపాస్తుల్నీ ఊరకే పారేసుకోరు. కాని, వీళ్ళంతా దొంగలలాగానే నడిరాత్రివేళ పారిపోవలసి వచ్చింది మరి" అన్నది.

ఒక నిశ్చయానికి వచ్చినట్టు ధీమాగా మంజు "దీదీ! నేను మాత్రం ఇక్కడే వుండడానికి నిర్ణయించుకున్నాను. కాని, ఎక్కడికి వెళ్ళను? దీదీ! నీ ఇంట్లో ఓ మనిషి తలదాచుకోడానికి చోటు దొరకదంటావా?" అనడిగింది.

సరిగ్గా ఆ సమయంలోనే ఇస్మాయిల్ దర్వాజా గుండా తొంగి చూశాడు. ఇప్పటిదాకా అతను వాళ్ళ మాటల్ని వింటూన్నాడు.

"మంజూ, పో! స్నానంచేసిరా. నీ మట్టుకు నువ్వు కొత్త వేరె వుడకేసుకొని తిను. పాపం! నీకు రాత్రంతా తిండీ తిప్పలుండి వుండవు!" అన్నాడు కరుణార్ద్ర స్వరంతో ఇస్మాయిల్.

మంజు వొళ్లు విరుచుకొని లేస్తూ "నా మట్టుకు నేను వంటచేసుకోనా? నీవు వంటా గింటా చెయ్యవా దీదీ?...మీనించి నన్ను దూరంగా నెట్టేస్తున్నారా?" అనడిగింది కామరాన్ను.

"పిచ్చితల్లీ! నువ్వేనాడో దురదృష్టవంతురాలి వయ్యావు. వితంతువి. మా చేతికూడు తింటే లోకం ఏమనుకుంటుందమ్మా!" అన్నది సందేహస్వరంతో కామరాన్.

మంజా మారు మాటాడకముందే ఇస్మాయిల్ చికాగ్గా "పెద్ద దొరసాని దిగిందని, ఈవిడగారికి వండి వార్చి తినిపించాలి కాబోలు! ఈవిడ తండ్రీ అంతే. నెత్తినెక్కి దిగేవాడు కాదు. ఆ గుణాలే అబ్బాయి అమ్మాయికీన్నీ......ఇదిగో, ఇప్పుడిది పాకిస్తాన్ తెలిసిందా? మునుపటిలాగా ఇక్కడ నీ పప్పులేం వుడకవ్!" ఇలా అరుచుకుంటూ ఇస్మాయిల్ మరి అక్కడ నిలబడలేదు. ఎకాయెకీ రంజాన్ గోరీ దగ్గరికి వెళ్ళిపోయాడు. పదురుకోసలం గోరీమీదికి వొంగి వున్నాడు. ఉన్నట్టుండి రంజాన్ ఏడుస్తున్నట్టు ఇస్మాయిల్‌కి తోచింది. "నాకేం వన్నా వండేరూ? తిండి పెట్టరూ? పోనీ, మంచినీళ్ళయినా ఇవ్వరూ?...నన్ను మరిచిపోయారా?... నేనిలా ఆకలితో మాడిపోవలసిందేనా? నన్నిలా దూరంచేసి వదిలేస్తారా?"

ఆ పగలంతా రంజాన్ ఆక్రందన పదింబదిగా ఇస్మాయిల్ గుండెల్లో మారుమ్రోగుతూనే వుంది. ఆ స్వరం అతన్ని వున్మత్తుణ్ణి చేస్తోంది. వెన్నంటే తిరుగుతోంది. నలువేపులా చీకటి క్రమ్మింది. సముద్ర తీరం గాలి కుమ్మినట్టు రంజాన్ ఆక్రందన స్వరం అతని గుండెల్ని కుమ్ముతోంది. కొంచెం ఎదిగి, చదువుకొనేవాడైనా రంజాన్ సహజంగానే చంటిపిల్లవాడిలా ఏడుస్తాండేవాడు. ఆదేస్వరం ఇప్పుడున్నా.

నడవాలో చాపమీద పడుకున్న ఇస్మాయిల్‌కి నిద్రపట్టక తెగ దొర్లాడు. కాసేపటికి లేచి కూచున్నాడు. ఏదో భయం అతన్ని ఆవరించినట్టయింది. ఒంటరిగా అలా కూచోలేక పోయాడు. కావలసిన డబ్బు పాతర వుంది. "దానికీ నాకూ ఏంవిటి" అని అనుకుంటూనే పాతర పెళ్ళగించాడు. ముంత చేతి కందింది. చీకట్లోనే ముంత నిండుగావున్న నాణాల్ని చేత్తో తడిమి చూశాడు.

ఈ డబ్బుతో ఆ వూళ్ళో ఒక చెరువు త్రవ్వించాలని ఇస్మాయిల్ జీవితాశయం. పంచాయతీ ప్రసిడెంటుతో ఈ విషయం చెప్పాడుకూడా. ఏదో ఒక రోజున తన సంపాదన మొత్తం పంచాయతీకి అప్పచెప్పాలని నిశ్చయించుకున్నాడు. దాంతో బ్రహ్మాండమైన చెరువు ఏర్పడుతుంది. ఇంటిముందు ఇప్పుడు కనిపించే మామిడితోపూ, మిట్ట పల్లాలు, చెట్టూ చేమా, గట్టూ పుట్టా, తోటలూ దొడ్లూ అన్నీ ఏకాండమైపోయి చెరువుగా మారతాయి. నిండుగా కెరటాలు వొడ్డుల్ని వొరిసి తెపకలు కడతాయి. ఈ ఊహ రాగానే ఇస్మాయిల్ తనలోతాను,—

"యాఖుదా! బిడ్డ రంజాన్ పేర ఈ చెరువు తవ్వించగలిగితే నా బ్రతుకు తెల్లవారుతుంది. గోరీలో నిద్రించే నా బిడ్డ దప్పి అయినా తీరుతుంది." అని దీనంగా గొణుక్కునేవాడు.

మంజాలవచ్చి వారం గడిచింది. ఊళ్ళో ఎక్కడ చూసినా, విన్నా, ఇస్మాయిల్ పేరెత్తి "ఛీ, ఛీ! థూథూ!!" అనేవాళ్ళే.

"యుసురాయ్ కూతురు మళ్ళా ఈ వూరెందుకు వచ్చినట్టు?"

"ఇస్మాయిల్ అంటే సర్దార్ బిడ్డకదూ. మచ్చిక చేసుకుని పిల్లని ఇంట్లో అట్టే పెట్టేశాడు. ఏదో వొకపూట 'కల్మా' చదివి, అపని కాస్తా పూర్తి చేసేస్తాడు. ("కల్మా" అంటే మహమ్మదీయుల వివాహతంత్రానికి సంబంధించినతంతు.)

ఈ మాటలు ఊళ్ళోవాళ్లు శాపోటంగానే అంటూ వచ్చారు. పంచాయతీ ప్రసిడెంటు తాలూకు మనుష్యులు "ఆ పిల్లని పెళ్ళాడి ఇంట్లో వుంచుకోడానికి ప్రసిడెంటు అంగీకరించాడు." అని కూడా పుకార్లు లేవదీశారు.

ఎవరెన్ని అన్నా ఇస్మాయిల్ కిమన్నాస్తిగా వూరుకునేవాడు.

మరికొందరు ముఖాన్నే "నీకొడుకు ఎలా చచ్చాడో, మరిచేపోయావా? ఇంకా దనివచ్చి వూరుకుంటావా?" అని రెచ్చగొట్టేవారు.

ఇవేవీ ఇస్మాయిల్‌ని కదిలించేవి కావు. చాలా కాలంక్రితం జరిగిన ఓ దృశ్యం ఇప్పటికీ కళ్లకట్టినట్టుండేదీ.

తల్లిలేని ఓపిల్ల. ఓనాటి మధ్యాహ్నం ఏడుస్తూ కామరాన్ వొళ్ళో వొదిగిపోయింది. కాని ఏడుపు మానలేదు. కామరాన్‌కూడా ఆ ఏడుపుని ఆపలేకపోయింది. ఆపళాన తానే ఆ పిల్లని భుజాలమీదికి ఎక్కించుకొని స్టేషన్ వేపు తిరునాల జరుగుతుంటే అక్కడికి తీసుకుపోయాడు. అక్కడ గిరగిర తిరుగు

తూన్న రంగులరాట్నం చూసేసరికి ఏడ్పుమాని కిలకిల నవ్విందాపిల్ల. ఆపిల్లే ఈ మంజుల! ఆదృశ్యమే ఈనాటికీ ఇస్మాయిల్ కళ్ళల్లో మెదుల్తోంది!

"ముసలి ప్రెసిడెంటుకి ఆ పిల్లని ముడెట్టేసెయ్. పసుముపిల్లని ముసలాడు బాగా సాకుతాడు!" ఇలా అడిగారు ఇస్మాయిల్ ని కొందరు!

కామరాన్ వంటింట్లో కూచుంది. ఇంటిముందు అయిదారుగురు మోతుబర్లుకూచుని ఆకూ వక్కాలూ నములుతూ ఊసులాడుతున్నారు. గుసగుసలు చెప్పుకొంటున్నారు. అటూ ఇటూ చూస్తున్నారు. ఇదంతా ఏదో అపశకునంలా కామరాన్ భావించింది. చటుక్కున లేచి మంజులకోసం వెతికింది. "ఈ పిచ్చిపిల్ల ఎక్కడికిపోయిందో ఏమో?" అంటూ గొణిగింది... "అరె! సామాన్లగదిలోపడి నిద్రపోతోంది! హుఁ! నిశ్చింతగా నిద్రపోతోంది మహారాణీలాగా ..." కామరాన్ కోపంతో కంపించిపోయింది. రాత్రి తెల్లవార్లూ అలా అగిలో గుగ్గిలంలాగా గడిపింది.

నిద్రనించి లేవగానే మంజులతో "ఓపక్క కొంపలంటుకుంటున్నై! నువ్వేమో తింటావ్, పడివుంటావ్. వీల్లేదు. వెళ్ళిపో! ఇప్పుడే వెళ్ళిపో!!" అంది కామరాన్.

కాని, మంజుకి చీమ కుట్టినట్టుకూడా లేదు. ఇదంతా నవ్వుతాల కిందకట్టి పకపక నవ్వింది.

కసురుతూ కామరాన్ "ఏమాటా చెప్పవేం?"

"నావాళ్లని వొదిలిపెట్టి నేనెక్కడికి పోను" అన్నది అలవోకగా మంజు.

కామరాన్ ముఖం చిట్లించింది. నీవాళ్ళెవరు? ఎవళ్ళభయం లేదా నీకు! కాయస్థపాడా అంతా ఖాళీచేసి వెళ్ళిపోయారు. నువ్విక్కడికి మళ్ళీ ఎన్ని గుండెల్తో వొచ్చావ్?" అవడిగింది. కామరాన్.

మంజు మామూలుధోరణిలో "దీదీ! మా అమ్మ చనిపోయినప్పుడు కాయస్థపాడా ప్రజలందరూ లేరా? అప్పుడెన్ని గుండెల్తోవొచ్చానో చెప్పుదీదీ!" అన్నది.

ఈ ప్రశ్నకు కామరాన్ వద్ద జవాబు ఏముంది? లేదు. కాబట్టే మారుమాట లేకుండా కామరాన్ వెళిపోయింది. ఇరుగుపొరుగువాళ్ళతో ఇంతో అంతో ఆమెకు విరుపు మాటలు తప్పలేదు.

"ఇదంతా నా నెత్తిన వొచ్చిపడింది. వీరు నన్నంటారు. ఆ పిల్లని వెళ్లిపొమ్మన్నా పోదాయె. నేనేం చెయ్యనుమరి?" అనేది కామరాన్.

"ఐతేమరి, కలమా చదివించి ఆ కాస్తా పూర్తి చెయ్యరాదూ?" అనేవాళ్లు ఇరుగు పొరుగు.

"దానివల్ల ఏమవుతుందమ్మా! ఈ రోజుల్లో మతం బండరాయిలా తయారయింది. కలమా చదివించినంతమాత్రాన అది కరిగిపోయే రోజులు పోయాయి." అన్నది కామరాన్.

మర్నాటిసాయంత్రం, మంజు ముక్కలు తరిగి స్తోంటే, కామరాన్ వాటిని వేయించుతోంది. మంజు తనఇంట్లో గొడవలన్నీ చెబుతూ, వొదినలూ, ఆడబిడలూ అందరూ తనని ఎలా వేధించి వెళ్లగొట్టిందీ వివరించింది. "దీదీ! ఆ సమయంలో వీరు తప్ప మరోదిక్కు నాకు కనిపించలేదు!" అంది మంజు.

సరిగ్గా ఆ సమయంలోనే వాకిట్లో కలకలం వినిపించింది. కామరాన్ "మళ్లావచ్చి చచ్చారు కాబోలు" అనుకుంటో లేచివెళ్లి తొంగిచూచింది. ఆమె అనుమానమే నిజమైంది. వూర్లో మోతుబర్లు ఇంటిముందున్నారు.

కామరాన్ మంజులమీద మండిపడుతూ "దిక్కు ఇక్కడా లేదు. నీ దారి నువ్వు చూసుకో! వెళ్లక పోయావా చీపురుతో సింగారించి మరీ తగిలేస్తాను!" అన్నది.

మంజుల మధురంగా నవ్వుతూ "దీదీ! నీచేత్తో ఇప్పటిదాకా మిఠాయిమాత్రమే తింటూవచ్చాను. ఆ చీపురుదెబ్బలు ఎలా వుంటాయో రుచిచూస్తాను." అన్నది.

ఇదే సమయంలో ఇస్మాయిల్ చిలుము గొట్టంలో నిప్పువేసుకోడానికి వొచ్చాడు. "చూడు దాదా! దీదీ కత్తిచూపి నన్ను గెంటేస్తోంది" అని మంజు ఇస్మాయిల్ కి ఫిర్యాదుచేసింది.

"అఁ! గెంటి తీరుతాను. మనమతాలు రెండయి పోయాయి. దేశం రెండు ముక్కలయింది. ఇక్కడ నువ్వేమొహం పెట్టుకొని వుంటావ్?" అని గర్జించింది కామరాన్,

మంజులకూడా కష్టంవేసింది. "ఎక్కడికి పొమ్మంటావో నువ్వే చెప్పుదీదీ? నా కెవర్లున్నారు? ఎక్కడుంటాను? ఏం తినమంటావ్? నా గతేంటి?

ఐనా నన్ను వెళ్లగొడతానన్నమాట! సరే...పోదాం పద దాదా! నే నెవర్నీ ఎరగను. నువ్వే నాకేదో దారిచూపించి రావాలిగా..." ఇలా అంటూనే వల వల ఏడ్చింది మంజుల.

ఇక ఆ వేళ భోజనానికైనా ఇంటికిరాలేదు ఇస్మాయిల్. ముసలి ప్రెసిడెంటు ఇంట్లో జరిగిన విందులో ఉన్నాడు.

అన్నంతపని చేసేదాకా నిద్రపోని మనిషి కౌమరాన్. చాటుమాటుగా చక్కులు, కొబ్బరికాయలు అమ్మి పదిరూపాయలు కూడబెట్టింది. అందులోనుంచి నాలుగైదు మంజుల చేతికిచ్చి, చీకటి పడకముందే స్టేషన్కి పంపించేసింది.

ముక్కూ మొగం ఎరగని కలకత్తాకి టికెట్ తీసుకొని మంజుల రైలెక్కింది. బండికదిలింది.

ఇదే సమయంలో ఇస్మాయిల్ పరిగెత్తుకొచ్చి ఓ ముంతని కిటికీలోంచి మంజుల చేతికందించాడు. "మంజూ! దోవలో తినడానికి కొంచెం మిఠాయి తెచ్చానమ్మా!" అన్నాడు.

మంజుల ఏడ్చింది. 'దీన్ని నువ్వే తీసుకుపో దాదా! ఇంట్లోంచి వెళ్ళగొట్టి దిక్కు లేకుండా చేశారు. దిక్కులేనిదానికి మిఠాయి పెడుతున్నారు. ఈ లేనిపోని మమకారం ఎందుకుదాదా?" అన్నది రుద్ధకంఠంతో.

కాని, దాదాకి ఈ మాటలు వినిపించే అవకాశం కలగలేదు. బండి పరుగెత్తుతోంది. మంజు కిటికీలోంచి తొంగిచూస్తోంది. ప్లాట్ఫారంమీద ఇస్మాయిల్ ఒక రాతిబొమ్మలా నిల్చుండి పోయాడు.

మంజు కూర్చున్న పెట్టెలోనే పరిచితవ్యక్తి విపిన్ తాంబూలీకూడా వున్నాడు. "ఇస్మాయిల్ సర్దార్ ఏఁవిటి ఇచ్చి వెళుతున్నాడు మంజూ?" అడిగాడు.

"మిఠాయి" అంది మంజుల.

"ఛ! ఛ! దాన్ని ముట్టుకోకు! జరిగిందేదో జరిగిపోయింది. ఇక మిఠాయి గిఠాయి ముట్టుకోకు! వాళ్ళు అందులో విషంకలిపినా కలుపుతారు! ఆఁ, పారేయ్! ఆ ముంత అపాటు నే పారేయ్!" అన్నాడు విపిన్ బాబు!

"అలాగే...హుఁ! వాళ్ల మనసులే మారిపోయాయి. వేరే విషంకూడా ఎందుకు? తింటే విషమై పోయుంటుంది." ఇలా అంటూనే మంజు ముంత వాసిన విప్పింది...మిఠాయిలేదు. కొంచెం వేపుడు ముక్కలు, నువ్వుల పూర్ణాలు వున్నాయి. వాటినెలా ముట్టుకుంటుంది?

కాని, ముంత బరువుగావుంది? అడుగున గల గల మంటున్నాయి? ఏఁవిటవి?...కాసులు! బంగారు కాసులు!! వాటిని చూస్తూనే మంజుల "దాదా, దారిలో తిండేకాకుండా, పరాయిచోట బ్రతకడానికి బంగారు కాసులిచ్చావు." అని గొణిగింది.

రైలు వెళ్ళిపోయింది. ప్లాట్ఫారంనిండా శూన్యం కమ్మింది. ఇస్మాయిల్ అలాగే, రాతిబొమ్మలాగానే నిలబడిపోయాడు. రైలు మలుపుతిరిగి కనుమరుగై పోయింది. దాంతోపాటే అతని ఏకైక జీవితాశయం కూడా దూరమైపోయింది. తన బంధువు కాదు, మతం కాదు. ఏమీకాని ఓపిల్ల తన సర్వస్వాన్ని తీసికొని వెళ్ళిపోయింది.

ఇక, తను ఊళ్ళో చెరువు తవ్వించలేడు. గోరీలోపలి చీకట్లో, ఎండిన గొంతెత్తి రంజాన్ అలీ అనంతకాలం అలా "దాహం. దాహం!" అని ఆక్రోశిస్తూనే వుంటుంది!

వెదురు పొదలమీదుగా ఓ నక్షత్రం మిల మిల లాడుతోంది. నలువేపులనించి ఫిర్రితిరిగా సంధ్యాకాంతి అలముకుంటోంది. గాలికి ఊగిపోతున్న వెదురు ఆకులమీద నక్షత్రకాంతి "ఝుళుక్ తళుక్" మంటోంది. 'బంగారు నాణాల్ని ఇచ్చేసి ద్రోహినయ్యానా? కాని, కాని, మంజులకుమాత్రం ఎవరున్నారు? ఎలా బ్రతుకుతుంది? పాపం!' ఇలా అనుకుంటూ ఇస్మాయిల్ "యా అల్లా! యా రహిమాన్!! అపరాధిని నన్ను దండించకు. పాపం, ఆ మంజుల స్థితిగతులుకూడా చూడు.'అని వేడుకున్నాడు.

వెదురు పొదలమీది నక్షత్రం మరింత వెలుగుల్ని నింపింది. మైదానం దాటాక ఓ గాలితెర అతన్ని తాకింది. ఇటూ - అటూ రెండువేపులా వెలిగేదా ఒక్క నక్షత్రమే. గాలి, ఆ వేపువున్న అరటి తోటల్లో వీచి, మధురస్వరాల్ని సంతరించుకొని, ఈ వేపున వరిచేలని నిమురుతూ జోల పాడుతోంది!

# నిత్యమల్లి

'మురయా'

'ఇక పిల్లని ఏమంటారా రత్నం అనుకోండి అందచందాల విషయంలో మనం కాదుగదా విరోధం ఉన్నవాళ్ళుకూడా వంక పెట్టలేరనుకోండి. నా పిల్ల విషయం ఇల్లాఅనక మరోలా ఎల్లాఅంటాను అనికాదు. నామట్టుకు నేను ప్రాణంమీదకువచ్చినా అబద్ధమన్నది ఆడను. ఇంతెందుకూ మీరువచ్చి చూడండి. చూచి నేనన్నదాంట్లో ఒక్క అక్షరం పొల్లంటే అప్పుడు అక్కడే నాలుకజాడించి వేయవచ్చు. ఇక అందుకేమీ అభ్యంతరం లేదు.

'అయినా అబద్దాలాడేదాకానూ, హెచ్చులు పోయేదాకానూ నాకేంపని!

'కానైతే మీరు ఓరకంగా అనుమానించవచ్చు. అంతఅందమైన మా అమ్మాయికి అందులో నాలుగు వేలు కట్నం ఇస్తామంటూఉంటే మంచిసంబంధం ఎందుకు రాలేదూఅని. ఆమాటకొస్తే సంబంధాలు రాకపోలేదు. చాలావచ్చాయి. ఎన్నిచోట్లకో వెళ్ళివచ్చాను. కాని అన్నివిధాలా అనువైనది ఒక్కటీ నాకంటపడలేదు. ఆస్తిఉంటే చదువు ఉండదు. కాస్త చదువుంటే సెంటుపొలం ఉండదు. రెండూఉంటే పిల్లవాడు బుద్ధిమంతుడుగా ఉండడు. కాదు ఈమూడూ ఓమోస్తరుగా ఉన్నాయిలే అనుకొని సర్దిచెప్పుకొని వాళ్ళ గుమ్మంముందుకు వెళ్ళితే వాళ్ళు గొంతెమ్మకోరికలు కోరుతూ కొండెక్కి కూర్చుంటారు. అందుకూ సిద్ధపడ్డాను. కాని సంప్రదాయం! కాస్త విచారించేసరికి ఆ సంబంధంకోసం పడ్డశ్రమంతా వృధాఅయిపోయె. చనువుకొన్నవారు మీరు చెప్పండి—కుటుంబ సంప్రదాయం అన్నది బాగుండకపోయాక ఇంక ఆపైని ఎన్నిఉండి ఏంప్రయోజనమూ అంట! ఏమంటారు?'

ఆయన ఒక్కక్షణంఆగి సమాధానంకోసం అతని వంకచూచారు. కాస్త ఆపేక్షగా ఆశగా చూచారు. ఇంతవరదాకా, ఎవరా ఈవ్యక్తి ఇంతచనువుగా మాట్లాడుతున్నాడని ఆశ్చర్యపడుతూ కూర్చున్నాడు మోహన్.

మోహను కాస్త వెనకాముందూ ఆలోచించుకోవడానికే సావకాశం చిక్కలేదు, గత అర్ధగంట నుంచీ. ఆయన మోహనుగదిలోకి ప్రవేశిస్తూనే అతని తల్లిదండ్రుల యోగక్షేమాలను విచారించారు. కుర్చీలో కూర్చుంటూనే "మాదువానయినా నువ్వెరగవుగానీ మీ పెదనాయనగార్నీ వాళ్ళనూ బాగాఎరుగుదును. యోగ్యతఅన్నా సత్సంప్రదాయమన్నా వారిదీ. మీ తాతగారి కాలంనుంచీకూడా అంతే. పేర్లు ఆయన పేరు నిలిపారు. అన్నట్లు మరచాను మీరెంతమంది అన్నదమ్ములూ?" అంటూ పరామర్శ మొదలుపెట్టారు. అతను సమాధానం చెప్పకముందే ఆయనే అందుకొని "అవునవును—మీరు రెండోవారు కదూ. ఏమిటో వయస్సు మళ్ళినకొద్దీ జ్ఞాపకశక్తి తగ్గిపోతున్నది. అదీగాక చూడండీ రాకపోకలు లేకపోతే దగ్గర బంధుత్వాలనే మర్చిపోతాము. అలాంటిది స్నేహాలు ఎన్నాళ్ళుంటాయీ..." ఆయన అలా చెప్పుకుపోతున్నప్పుడు మోహను ఆయనకూ తన కుటుంబానికీ స్నేహముండివుంటుందనీ అది తనకు తెలియదనీ అనుకున్నాడు. అందువల్ల పీధిలోకి వెళ్లదామని ప్రయాణమయినవాడు ఆయనకెదురుగా కుర్చీలో కూర్చుని ఆయన చెప్పేమాటలు తాపీగా వినడానికి సిద్ధమయ్యాడు.

ఆయన కాస్త అవకాశం వినియోగించుకుని అంతసేపూ మాట్లాడాడు. కుశల ప్రశ్నాదికాలయిన తర్వాత నెమ్మదిగా పెండ్లివిషయం ప్రస్తావించాడు. పిల్లవిషయం వివరంగా చెప్పాడు. అంతసేపూ తానే మాట్లాడాడు.

అప్పటికి కాస్త అలుపు వచ్చింది. అందుకే అన్నట్లు సంప్రదాయాన్ని గురించి ప్రశ్న వేశాడు.

"కాదుటండీ మరి! అందులో మనదేశంలో!" అన్నాడు మోహన్—ఆ ప్రశ్న తన్ను ఉద్దేశించిందేనని నిర్ధారణకు వచ్చాక. ఓ క్షణం ఆలస్యంగా అన్నా అతనామాట కాస్త హుందాగా స్పష్టంగా అనడంచేత

ఆయన సంతోషించి మరింత ఉత్సాహంతో మళ్ళీ అందుకొన్నాడు. "మంచిమాట అన్నారు. ఈ నాడు జనం మరీ ఇలా విరగబడి పోతున్నారుగానీ పూర్వం ఎంత ఆచారం పాటించేవారు. మంచి సంప్రదాయాన్ని ఎంతగా గౌరవించేవారూ! ఇంకా ఆ పాతకాలపు కుటుంబాలు ఒకటి రెండైనా ఉన్నాయి. గనుకనే మాలాటివాళ్ళం కొంతలో కొంత సంతృప్తి చెందగల్గుతున్నాం. ఇంతకూ చెప్పవచ్చిందేమంటే మంచి సంప్రదాయం గల కుటుంబంలోని పిల్లవాడు దొరక్కనే గత మూడేళ్ళనుంచీ తిరుగుతున్నాను. సరే ఇంతకూ...అని కాసేపు నీళ్ళు నమిలి అసలు విషయంలోకి వస్తూ "ఇంతకూ మీరా విషయమై ఏమీ అననేలేదు" అన్నాడు.

"నేను చెప్పేదేముంది పెద్దవాళ్ళున్నారు గదా" అని మోహన్ అనీ అనకముందే ఆయన అందుకొని, "సరిగ్గా అనవలసిన మాట అన్నావు. అలా అంటావని నాకు తెలుసు. అయితే చూడావూ—కొంతమంది అంతా విని ఇప్పట్లో పెళ్ళి చేసుకోవాలని లేదండీ అంటారు. అదీ విన్నాను. అతనామాట అన్నాక ఇంక ఇంటికి వెళ్ళినా లాభం ఉండదు. ముందుగా వాళ్ళ యింటికి వెళ్ళితే "అబ్బాయి ఉద్దేశ్యం ఎల్లా ఉన్నదో కనుక్కో లేదండీ అంటాడా పెద్దమనిషి. సరే ఏమైనా కొంత కాలాన్ని బట్టి పోవాలిగదా! మిగతా విషయాలు మేం పెద్దవాళ్ళం చూచుకుంటాం. ముందుమీరు పిల్లను చూడండి. పిల్లను పిల్లవాడూ, పిల్లది పిల్లవాణ్ణి చూచుకోవడం ఒక రివాజు అయిందిగా ఈరోజుల్లో."

"మంచిదే. అలానే చేయండి" అన్నాడాయన.

"అబ్బే—అందుకయినా ముందు మా వాళ్ళతో మాట్లాడిరండి." అన్నాడు మోహను.

"మాంచి శ్రేష్ఠమైన మాట లన్నావయ్యా. జరగవలసిన పనే అది. అందరూ కలిసివస్తే ఒక్కమాటే అందరూ పిల్లను చూసినట్లవుతుంది. ఆ తరువాతి విషయాలు అక్కడే మాట్లాడేసుకో వచ్చును. ఇరువురికీ సుఖమైన పని. అవునదే బాగుంటుంది. లేకపోతే ముందు కుర్రవాడు వచ్చి చూడడం, చూచాక, ఏమయ్యా అంటే మావాళ్ళు చూడాలండీ అనడం వాళ్ళు ఒక్కొక్కళ్ళే రావడం వెళ్ళడం. ఇదంతా కాలయాపనన్నా, అనవసర మనన్నా. అయితే చూడు నాయనా ఇక్కడేదైనా బావి అది ఉన్నదీ?

"బావి లేకపోవడమేమండీ ఉన్నది. ఏం ఎందుకండీ స్నానం చేస్తారా?" అని అడిగాడు మోహను కొంత ఆశ్చర్యపడుతూ.

"అవును మరి చెయ్యద్దూ? సంధ్యవేళ కావస్తుందే?" అన్నా రాయన ఏదో మరచిపోయిన విషయాన్ని అతనికి జ్ఞాపకం చేస్తున్నట్టు.

"అయితే అల్లాగే చేద్దురుగాని రేవండి" అని మోహన్ తువ్వాళ్ళు అందించాడు. ఆయన వాటిని అందుకొని చరచరా మెట్లవైపుకు వెళుతూ మధ్యలో ఓసారి వెనక్కు తిరిగి "చూడు నాయనా ఇవ్వాళ ఇక్కడే సంధ్య వార్చుకొంటాను" అన్నాడు.

మోహనుకు వెంటనే అర్థం స్ఫురించలేదు. అతను ఆయనవెంట కొంతదూరం వెళ్ళి "అల్లాగేనండీ దానికేం భాగ్యం వార్చుకోండి" అని బావికి దారి చూపించి గదిలోకి వచ్చాడు. నవ్వుకొంటూ కుర్చీలో కూర్చుని" అవును వార్చుకోనీ ఇందులో నాకేం అభ్యంతరం ఉంటుందీ. ఓ మూలకూర్చుని సంధ్య వార్చుకొని వెళ్ళడానికి నాకు చెప్పడం దేనికీ? ఒట్టి చాదస్తుడిలా ఉన్నాడీయన" అనుకొన్నాడు మోహన్. అనుకొని నవ్వుకొన్నాడు. అంతలో విషయం స్ఫురణకు వచ్చింది. "అబ్బే ఆయనేం ఛాందసుడు కాడు. అనుకొని మొత్తంమీద చిక్కు తెచ్చిపెట్టాడే! ఏం చెయ్యటం ఇప్పుడు?" అని వితర్కించుకొంటూ క్రిందకు వెళ్ళాడు.

"ఈయన్ని కనుక హోటలుకు తీసుకొని వెళ్లితే మిత్రులంతా చూస్తారు. మడికట్టుకొని విడిగా కూర్చుని భోజనం చేస్తానంటాడు. ఎవర్రా ఈ ఛాందసుడని నలుగురూ ప్రశ్నించక మానరు. అసలు వాళ్ళు అడక్కముందే విషయమంతా అందరితో చెప్పేసేలాగున్నాడు" ఇల్లా అనుకొంటూ అతను క్రింద మెట్టుదగ్గరకు వచ్చాడు. అక్కడో క్షణం ఆగి "ఈ గొడవంతా ఎందుకూ పిన్నిగారితో బంధువని చెప్పేస్తే సరిపోతుంది" అనుకొంటూ మెట్లుఉన్న సందులోనుంచి వెనకవైపుకువెళ్ళి "ఏమండీ పిన్నిగారూ" అనిపిలిచాడు నెమ్మదిగా, ఆయనకు భోజనం ఏర్పాటు చూడమని చెప్పాడు. ఎవరాయన అని ఆవిడ అడిగిన ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పక హోటల్లో కలిగే ఇబ్బందుల్ని గురించి చెప్పి "ఆయనకు మరీ మడీ ఆచారమున్నా మాకాయన వేలిడిచిన పెద్ద మేనమామకు

"పెత్తండ్రి కొడుకు అవుతాడు లెండి" అని తనకూ తెలియని బంధుత్వం కలుపుకోవాలని ప్రయత్నం చేశాడు. కాని ప్రయత్నపూర్వకంగా చెప్పినట్టుగానే ఉన్నదా సమాధానం అతను ముఖం ఎంత అమాయకంగా పెట్టినా. ఆమె మొదట నవ్వుకొన్నది.

"అయితే మోహన్ మీ చిన మేనమామ కేమవుతాడయ్యా!" అని పకాలున నవ్వేసింది. తన తెలివి తక్కువతనాన్ని అంగీకరించేస్తున్నట్లు అతనూ నవ్వేశాడు.

"సరే పోనీ ఎవరైతే ఏంగాని రమ్మను." అని ఓ క్షణమాగి కొత్త అనుమానంగా ఇంతకూ ఆయన ఏంపనిమీద వచ్చాడో చెప్పకూడదుటయ్యా?" అని అడిగింది. అతను ఏదో దాస్తున్నాడని పసిగట్టి.

"పెద్దపనేం కాదులెండి...సంబంధం వెతకడానికి వచ్చాడట" అన్నాడు మోహన్ చెప్పక తప్పక.

"ఇంకేం విడకబోయిన తీగె...మరి చెప్పవూ. అంతలో దాస్తావెందుకయ్యా? ఆ మాట చెప్పడానికే సిగ్గు పడుతున్నావా?" అని నవ్వుతూ నిలవేసింది.

"అబ్బే లేదండీ."

అతనీసారి నిజంగానే సిగ్గుపడ్డాడు.

అది గమనించి చిన్నవయస్సులో సిగ్గు అన్నది మొగపిల్లల్లోకూడా ఎంత శోభిస్తుందో! అనుకొన్నదావిడ.

"అవున్లే ఇరవైయ్యేసేళ్ళు వచ్చేదాకా పెళ్ళిళ్లు కాకపొయ్యేసరికి ఈ రోజుల్లో ఆడపిల్లలు సిగ్గుపడడం మానేస్తున్నారు. అందుకని ఆ పని మనమైనా చేద్దామని మొగపిల్లలు నేర్చుకొంటున్నట్టున్నారు అవునా?" అంటూ ఆవిడ లోపలకు వెళ్ళింది.

ఆయన అంతలో స్నానం పూర్తిచేసుకొని "ఇటు రావచ్చుకదమ్మా" అంటూ చాలా పరిచయమున్న ఇంట్లోకి వచ్చినట్లుగా పెద్దపెద్ద అంగలు వేస్తూ వంట ఇంట్లోకి వచ్చాడు. "అబ్బాయి ఇప్పుడే చెప్పాడు అతనికి బంధువులేటగా" అంటూ గోడకానించిఉన్న పెద్దపీట వేసుకొని కూర్చుని చెంబులో మంచి నీళ్ళూ ఉద్ధరిణా తెప్పించుకొని సంధ్య మొదలు పెట్టాడు.

ఆవిడ త్వరత్వరగా వంటపనులు పూర్తిచేసింది. దేవతార్చన మందిరం ప్రక్కగా పెద్దపీట వేసి మంచి అరిటాకు వేసి ఆవిడ ఆ ముసలాయన్ని భోజనానికి పిలిచింది. విస్తట్లో అన్నీ వడ్డించి నెయ్యీ పులుసూ, మజ్జిగాకూడా అభిఘరించాక ఆయన పరిషేచనంచేసి భోజనానికి ఉపక్రమించాడు. "వారుకూడా ఉంటే బాగుండేది. యజమాని సహపంక్తిని లేకుండానే భోజనం చెయ్యవలసివచ్చిందే" అంటూ ఆయన ఎంతో నొచ్చుకొన్నాడు. "క్యాంపునుండి ఇవ్వాళో రేపో వస్తారు. మరి మీరు వస్తారని మాకు తెలియదుకదా" అని అంటూ ఆవిడ పప్పూ నెయ్యీ మారడిగింది. అవీ ఇవీ మారడుగుతూ మోహన్నుగురించి మంచిమాటలన్నది. ఏంకావాలండీ - అని అడిగి కనుక్కొంటూ "అతనూ వాళ్ళూ ఒప్పుకొంటే ఇంకేకవ్వా మీరుకాదు మరొకరు మాత్రం కోరదగిందేముంటుందంట" అని రెట్టించి అడిగింది. ఆయన సమాధానం చెప్పే అవకాశం ఇవ్వకుండా "ఈడైన పిల్ల మా అన్నగారి దగ్గరో తమ్ముడు దగ్గరో ఉంటే ఈ సంబంధం మీదాకా రానిచ్చేవాళ్ళా! అయితే మిమ్మల్నీ మీ సంప్రదాయాన్నీ చూచాక మంచిసంబంధం వచ్చిందని నాకూ సంబరంగానే ఉన్నది" అంటూ గోత్రాదికాలు అడిగి తెలుసుకొన్నది.

"మరింకేమండీ అన్నీ అనుకూలంగా ఉన్నాయి మావాడని చెప్పడంకాదు పిల్లవాడు బుద్ధిమంతుడు. ఆస్తిపాస్తులు మీరూ విచారించుకొన్నదేకదా అంచక్కా చదువుకొంటున్నాడు. ఇంతకంటే మీరుమాత్రం పెద్ద సంబంధం తేగలరా చెప్పండి బాబాయిగారూ!" అన్నదావిడ.

ఆ మాటలన్నీ సంతోషంగా విన్నాడు.
అవునమ్మా అవును. నీవన్నమాట అక్షరాలా నిజం. నిజానికి నేను ఎన్ని సంబంధాలు చూశానో ఎన్నివిధాల తిప్పలు పడుతున్నానో ఎవరికి తెలుస్తుంది. తిరగలేక కాస్త బద్ధకిస్తే నాయింటిది క్షణం ఊరుకొంటుందా!" అన్నాడాయన.

"ఇంకెందుకూ. మీ కష్టాలన్నీ గట్టెక్కాయనుకోండి. మీరింక నిశ్చింతగా ఉండండి" అంటూ పులుసు వడ్డించింది.

పులుసులో కొంచెం పంచదార అడిగి వేయించుకొన్నాడాయన అది అపాయ్యంగా సగంతిని మిగతా సగం అవతలగా నెట్టి అట్టేపెట్టుకొని దాన్ని

పెరుగు అన్నంలో మళ్ళీ మళ్ళీ తిన్నాడాయన. పెరుగు అన్నం తింటూన్నప్పుడు చూచి ఆయింటావిడ 'ఈయనకు చాదస్తం ఓపాలు ఎక్కువే సుమా' అనుకొన్నది. అల్లా అనుకొంటూ కాస్త పరీక్షగా చూచింది ఆయనవంక. ఎందుకో ఆయన వేళ్ళు వణుకుతున్నాయి. ఒకసారి వెంట వెంటనే మరోసారి ఏదో పరాకుగా ముద్దలు నోట్లో పెట్టుకొంటున్నాడు. అల్లా కాసేపు దిక్కులుచూస్తూ కూర్చుని నోట్లోఉన్న ముద్ద గుటుక్కున మ్రింగి గబగబా ఎదుటఉన్న కాస్త అన్నమూ కుక్కుకొని విస్తరిమూట్టూ నీళ్ళుత్రిప్పి ఒక్కవిసురున లేచి దొడ్డిగుమ్మందగ్గరకు వెళ్ళాడాయన.

ఆవిడ నిర్ఘాంతపోయి అల్లాచూస్తూ ఉండిపోయింది. ఏమనడానికీ ఆవిడకు తోచకపోయింది. ఒకవేళ ఏదైనా వికారపెట్టిందేమోనని అనిపించి వెంటనే లోపలకువెళ్ళి రెండువక్కలూ తెచ్చి పీటమీదపెట్టి "వక్కలు పీటమీద ఉంచాను వేసుకోండి" అని అంటే ఆయన అట్టే వద్దమ్మా నాకలవాటు లేదని చెబుతూ చేతులూ ముఖమూ భుజంమీద ఉన్న తడికొల్లాయి తో తుడుచుకొని కాళ్ళు అద్దుకొని "అమ్మాయి. వసారాలో ఓ చాపవెయ్యమ్మా! కాస్త నడుంవాలుస్తాను" అన్నాడు.

ఆవిడ హాల్లో చాపవేసి ఇస్త్రీ జంపకానా పరచి దిండుకూడా ఇచ్చి "ఇక్కడ పడుకోండి. వసారాలో అయితే ఎవరో ఒకరు వస్తుంటారు." అని చెప్పి వెళ్ళింది, ఆయన చాలాసేపు మౌనంగా ఇంటికప్పుకేసి అతిదీక్షగా చూస్తూ ప్రక్కగదుల్లో పిల్లలు అల్లరిచేస్తున్నా, తప్పల్లో సుమతీ శతకంలోని పద్యాలు పెద్దగా చదువుతున్నా ఏమీ పట్టనట్టు నిద్రపోయాడు. పైగా గుఱ్ఱుపెట్టాడు కూడాన్నూ. మోహన్ మంచిబట్టలు వేసుకొని మామూలుకంటె కొంచెం ఎక్కువగా ముస్తాబై పుస్తకాలు పుచ్చుకొని రెండోపూట కాలేజీ తరగతులకు అందుకొందామని వెళుతూ ఆవిడనోసారి పల్కరించి పోదామని లోపలకు వచ్చాడు.

"ఆవిడ తానే ముందుగా మాట్లాడుతూ" ఆయన నిద్రపోతున్నారు—కాబోయే అల్లుడిగారి ముస్తాబంతా చూడకుండా అవునా ?!" అని నవ్వింది. పోన్లెండి ఏం ఎగతాళిచేస్తారు గానీండీ. ఎందుకంత ఎక్కువ పెడతారు, పెరుగూ అదీ ఎక్కువయినట్లుంది. అందుకేనా అంత వేగం నిద్రపోతున్నారు" అన్నాడు మోహన్.

అప్పుడే కాబోయే మామగారిపై పరిహాసాలు అల్లుకొంటున్నావే! సరే, సాయంత్రం కాస్త పెందరాళే వచ్చేస్తావు కదూ" అన్నదావిడ. "అల్లాగే నండీ" అంటూ తలఊపుతూ ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ వెళ్ళిపోయాడు.

"పెళ్ళి అనేసరికి ఎవరికైనా సరదాగానే ఉంటుంది. అంతలో ఏమీ పట్టనట్లు తిరిగే ఈ పిల్లవాడికికూడా పెండ్లి సంబంధం వచ్చేసరికి ఎంత కప్పిపుచ్చుకున్నా ఎంత సంతోషం కనపడిందో! అంతే మరి!" అనుకొన్నదావిడ ఆవిడ మరో మాటకూడా అనుకొన్నది. "అవును ఇల్లానే ఉండాలి సరదా అన్నా సంతోషమన్నానూ. కాని ఈ రోజుల్లో కుర్రవాడు—ఎవర్తెనో ఏ రోడ్డుమీదనో, కాక ఏ పార్కులోనో చూస్తాట్ట. ఆపళంగా అతనికీ ఆ పిల్లకూ ప్రేమట. ఇక షికార్లకూ సినిమాలకూ వేగించుకు పోవడం. ఏమిటో సంబంధం! విడ్డూరాలూ వెఱ్ఱివేషాలున్నూ! అందుకే అవన్నీ ఎంత ఎబ్బెట్టుగా ఉంటాయో!" అని. మోహన్‌మీద అంతకు ముందు నుంచీ ఉంటూ వచ్చిన గౌరవం ద్విగుణీకృతమైంది. ఆదరణా అపేక్షా మొగ్గలు తొడిగాయి.

* * *

మధ్యాహ్నం ఆయన నిద్ర లేవంగానే కాఫీకి నీళ్ళుపెట్టి ఫలహారం చేసింది. పీటవేసి పెద్ద వెండి కంచంలో అవి వడ్డించి "రండి బాబాయిగారూ రెండు బజ్జీలు చేశాను" అని గౌరవంగా పిల్చింది. సొంత వియ్యాలవారికి చేసినట్లుగా మర్యాద చేసింది. ఆయన ముఖం కడుక్కొనివచ్చి చాలా స్వల్పంగా తిన్నాడు. తిని లేవబోతుంటే ఉండండని కాఫీ కలుపుకొనివచ్చి ఇచ్చింది ఆవిడ.

"కాఫీ త్రాగకపోవడమేమిటండి. తప్పదు బాబాయిగారూ తాగాల్సిందే. పోనీ మీకోసం కాకపోయినా కాబోయే అల్లుడికోసమైనా తాగాలి. మరతనికి కాఫీలేందే పూట గడవదు. కాఫీ త్రాగని మామగారు నాకు అక్కర్లేదనికూడా అనేయగలడు కూడాను" అని నవ్వుతూ ఎంతో బలవంత పెట్టింది.

"బాగానే ఉందమ్మా నీ బలవంతం! అయితే తెలియకడుగుతాను కట్నాలూ కానుకలతో రత్నాలాంటి పిల్లనిచ్చి కాళ్లు కడగడమే కాకుండా క్రొత్త అలవాట్లు కూడా చేసుకోవాలటమ్మా? ఊ సరే అందులో సగం ఇవ్వు" అన్నాడాయన. తానుకూడా నవ్వుతూ మరో గ్లాసులో అల్లా సగమే పద్ది ఇస్తే ఆయన గ్లాసు ఎత్తి పట్టుకొని మంచితీర్థం నోట్లో పోసుకొన్నట్లు పోసుకొని కాఫీ గుటగుట త్రాగేశాడు.

"పాప పరిహారార్థం" అనుకొంటూ జోడ్లోనుంచి తీసిన పొటంలోనుంచి చిటికెడు విభూతి నోట్లో వేసుకొని మింగాడాయన. అదిచూచి ఈవిడ వెనకాల నిల్చొన్న పదేళ్ళ పెద్దపిల్ల పెద్దగా నవ్వేసింది. ఆమె ఆ పిల్లను కేకలు వేయడానికిబదులు తనకూ నవ్వాగక పక్కున నవ్వేసింది. పైపెచ్చు "అదేమండీ—అంత పూర్వకాలపు మనుష్యుల్లా కన్పించారంటే మా మోహన్ అసలు మాట్లాడానికే రానంటాడేమో సుమండీ" అన్నది. ఆ మాటకాయన అందుకొని "చూడమ్మాయ్ ఓటి అడుగనా. ఇప్పుడు ఆయనగారు చూడవలసింది చేసుకోవలసింది నన్నా—మా అమ్మాయినా?" అని లోపల సంతోషిస్తూ పైకి నవ్వాడు. ఆ ముసలాయన ఆ నవ్వులో సంతోషాతిరేకాన్ని ప్రకటించారు.

"అవుననుకోండి. కాని ఫలానా వారు మామగారు అని అతను చెప్పుకోవాలిగదా. అందుకు మీరు కాస్త నవీనంగా కన్పించవక్కరేదా అంట!" అన్నదావిడ.

"ఏం నవీనమమ్మా...అల్లా అంటున్నారనే మా అమ్మాయికూడా ఫేషన్లు నేర్చింది. ఇప్పుడు కాళ్ళకు చెప్పులూ వేస్తున్నది, చేతులకు మట్టిగాజులూ వేస్తున్నది" అని ఎంతో ఆశ్చర్యకరమైన విషయం చెబుతున్నట్లు ఆమెవంక చూచాడు.

"అవి చాలవండీ చేతికి రిస్టువాచీ కళ్ళకుజోడూ కూడా ఉంటేనే.గాని మాకు నచ్చదు" అన్నదావిడ చీరకొంగు నడుంచుట్టూ త్రిప్పి బొడ్డునదోపుకుంటూ.

"ఆహా బాగుందమ్మోయ్...ఇంకా నయం గిరజాల జుట్టుకూడా పెట్టుకోమన్నావ్ కాదు" అని ఆగి దప్పున లేచినిలబడి "ఒకవేళ అన్నీ అనుకూలించి అబ్బాయి చేసుకొంటే...దానికీ అతనికీ ఇష్టమయితే ఎన్ని ఫేషన్లయినా చేసుకొంటుంది. కాని ఆ నెరశ గిరజాలజుట్టు మాత్రం పెట్టుకోదు. బొందిలో ప్రాణముండగా జుట్టు ముట్టుకోనిస్తుందా" ఆయన ఆమాట అని ఎటో చూస్తూ కొంతసేపు మౌనంగా పరాకుగా ఉండిపోయాడు. అంతలో దప్పున ముఖం మరోవైపుకు త్రిప్పుకొన్నాడు. గబగబా నాలుగడుగులు ముందుకు వేసి అక్కడ కాసేపు ఆగి వెనక్కు తిరిగి "ఆపనిమాత్రం చెయ్యకు" అని ప్రస్ఫుటంగా చెప్పేసి గుమ్మందాకా వెళ్ళి చూసెమ్మాయి...అన్నట్లు మరచాను నీ పేరేమిటో తెలుసుకొన్నాను గాదు" అన్నాడాయన.

"హైమవతండీ" అన్నదావిడ.

"చూడమ్మా, హైమవతీ. ఇక పైని భారమంతా నీపైన మోపి వెళుతున్నా" అని కొల్లాయిగుడ్డ దులిపి పైన వేసుకొని ఆమెవంక "ఏమంటావ్" అన్నట్లు చూచాడు. ఆ చూపులో జాలికూడా కన్పించింది.

అది గమనించి ఆవిడ "అదేమిటండీ అల్లాపూరిక్కె ఇదవుతారూ! ఏదో నవ్వుతాలకు అనుకొన్న మాటల మీద పెరిగి ఆ మాట వచ్చింది. అయినా మీదంతా విచిత్రంకాని బాబాయిగారూ! ఎంత నవ్వులయితే మాత్రం మనలో ఈడొచ్చిన పిల్లకు పోసుకోసమై గిరజాలు పెట్టిస్తారా? అప లింతకూ ఉన్నవిషయం చెప్పవలసివస్తే మా మోహానుకు మరీ ఫేషనుగా ఉండే పిల్లలంటే గిట్టదు. పెగా వెక్కిరిస్తాడు కూడాను" అని అంటూ ఆయనకు ధైర్యం చెప్పింది.

"అల్లాగా అమ్మా. మీవాడు అంతబుద్ధిమంతుడా తల్లీ. నేనూ అగన్ని చూసంగానే అల్లానే అనుకొన్నాను. సరయితే శుభం అను నేను సంతోషంగా వెళ్ళి వస్తాను" అన్నాడాయన మెట్లు దిగుతూ. వసారా చివరగా నిల్చొని ఆవిడ "శుభమ్. క్షేమంగా వెళ్ళిరండి. తర్వాత వ్యవహారం కాస్తవేగం నడిపించండి" అన్నది.

"అల్లాగేనమ్మా అల్లాగే" అంటూ ఆయన వీధిలోకి వెళ్ళాడు. కొంతదూరం వెళ్ళేదాకా మ్యాత్మ్యాత్య వెనక్కు తిరిగి చూచి ఏదో అమూల్యమైన వస్తువును పారవేసుకొన్న వాడిలా ఆత్రంగా చూశాడు. ఆతర్వాత చకచకా నడుస్తూ రెండుమూడు నిమిషాల్లో కనుమాపు మేర దాటి వెళ్ళిపోయాడు. సందు మలుపు తిరిగేదాకా ఆవిడ అక్కడేనిల్చొని ఆయన్నుగురించే

ఆలోచిస్తూవుండి పిల్లల కేకలు విని లోపలకు వెళ్ళింది. హైమవతమ్మ పిల్లలకు నీళ్లుపోస్తూకూడా ఆ ముసలాయన విషయమే ఆలోచించింది. ఆయన ప్రవర్తనలో ఏదో అసాధారణత్వ మొకటి కన్పించింది. ఆవిడ పొయ్యిరాజేసి ఎసరు పడేసి ముందుగదిలోకి వచ్చి పెద్దపిల్లకు జడ అల్లుతుండగా ఆయన మళ్లా వచ్చారు. "ఇదేమిటి వెళ్లి ఓ గంట అయినా కాలేదు మళ్లా వచ్చారేమిటబ్బా" అనుకొంటూ వసారాలోకి వచ్చిందావిడ. ఆయన రిక్షావాడిచేత ఒక పెద్ద పళ్లబుట్ట హాల్లో పెట్టించి అక్కడ ఉన్న కుర్చీలో కాళ్లు పైన పెట్టుకొని కూర్చున్నాడు. "అమ్మాయి! చిల్లర ఉంటే వాణ్ణి పంపించేయ్" అన్నాడాయన ఎటో చూస్తూ. రిక్షావాణ్ణి పంపించి ఆవిడ లోపలకు వచ్చాక "మా డమ్మాయ్ ఏదైనా మంచి పళ్ళెంపట్రా అని, ఆ ఎందుకండీ అంటూనే ఆవిడ వెండిపళ్ళెం తెచ్చి ఇస్తే ఆ పళ్ళెంనిండా పళ్లూ తమలపాకులూ, వక్కలూ పెట్టి తీసుకొమన్నాడాయన. ఆవిడ కేమీ అర్థం కాలేదు. పెండ్లికొడుకూ అతని తరఫువాళ్లూ పిల్లను చూడానికి వెళ్లితే జరగవలసిన లాంఛనం ఇది. అది ఆయన చెయ్యడేమో అని ఆశ్చర్య పడ్డది. పైగా ఆయన తానేమీ అనకముందే "పుచ్చుకో అమ్మా కాదనకు నాకు చాల కష్టంగా ఉంటుంది." అని అంటుంటే ఆమె కేమీ పాలుపోలేదు.

మాట్లాడకుండా తీసుకొన్నది.

ఏం మాట్లాడో తెలియక "అదేమండీ ఒళ్లో ఏదో దాచుకొని కూర్చున్నారేమిటి?" అని అడిగింది. ఆయన వెంటనే ఒళ్ళోంచి ఒక పెద్ద ఫోటో ఒకటి తీసి ఆమె చేతి కందిస్తూ "అమ్మాయి ఫోటో ఒకటి కన్పిస్తే వెంటనే మీ కిచ్చిపోదామనిపించి వచ్చానమ్మా. ఒట్టి చేతులతో ఎల్లా రానూ అందుకని ఏవో నాలుగుపళ్లు తెచ్చాను." అన్నాడాయన.

ఆమె ఆ ఫోటో అందుకొని పైన ఉన్న ఉల్విరి కాగితం తొలగించి చూచింది. చూచి ఒక్కసారి చకిత అయ్యింది. మోహనుకు ఇంత చక్కని చుక్క భార్యగా దక్కబోతున్నదిగదా అనీ, అంత అందమైన పిల్లను, నాలుగువేలు కట్నంతో కోడలుగా కుదిరించి పెట్టేసందుకు మోహను తలితండ్రులు తన్ను ఎంతో మెచ్చుకొంటారనీ ఆమె ఎంతో సంబరపడ్డది. "మా డమ్మాయ్ పిల్ల విషయంలో నువ్వుగానీ, అబ్బాయి గానీ ఎటువంటి అనుమానాలు పెట్టుకోకండి. మరోటి, ఆ నగలన్నీ దానివే." అని మరో క్షణమాగి "అవే కాదు నా ముసలిదానికి నగలెందుకూ అవీ ఇచ్చేస్తుంది." అన్నాడాయన.

అంతలో మళ్ళీ అందుకొని "మాడమ్మాయ్ ముందు నువ్వు ఓ పని చెయ్యి. పిల్లవాణ్ణి వెంట పెట్టుకొని యింటికి వచ్చి పిల్లను చూడు. అతనికి పిల్లనచ్చితే అని అంటుంటే "మిగతా విషయాలు నేను చూస్తా. అసలు నచ్చకపోవడం అంటూ జరగదుగా" అన్నదావిడ తన సంతోషాన్ని వ్యక్తపరుస్తూ.

ఆ మాట విని ఆయన చప్పున లేచివచ్చి ఆమె కెదురుగా నిలబడి "అమ్మాయ్ నువ్వు ఈ సంబంధం కుదిర్చిపెట్టు. మిమ్మల్ని అసలు ఈ పూటే తీసుకొని వెళ్లి చూపించి వద్దును. తిథి బాగుండలేదు. మరి రేపు ఉదయం వస్తాను. నువ్వు ఆటంకం చెప్పక బయలుదేరి వస్తావుకదూ! వస్తానని మాట ఇవ్వు." అన్నాడాయన జాలిగా చూస్తూ.

ఇంత ఛాందసుడేమా అనుకొంటూ "అల్లాగే నండీ అందుకు వేరే అభ్యంతరం ఏముంది" అన్నదావిడ. "నిజమేననుకో-మరి నేను వెళ్లిరానా-ఫోటో అబ్బాయికూడా చూపుతావా!...చూపించు తప్పలేదుగాఅని ఆయన ముందుకువెళ్ళి మళ్ళీ వెనక్కువచ్చి "అన్నీ ఏర్పాటు చేసుకొని ఉదయం సిద్ధంగా ఉంటారుకదూ అబ్బాయికి చెప్పి ఒప్పిస్తావుకదూ" అని ఆత్రంగా అడిగాడు. "ఈ ఫోటో చూస్తే మోహను ఈపూటే వెళదాం రమ్మనడా" అనుకొంటూ "తప్పకుండా వస్తామండీ. అతను నామాట కాదనడు. వాళ్ళమ్మవస్తే ఒకటే నేనొస్తే ఒకటేనా. వెళ్ళిరండి మీరు ఊరికే..." అని ఏమో చెప్పబోతుంటే "నీకేం తెలుస్తుందమ్మా నా అవస్థ. ఎల్లాగయినా ఆపిల్లను కన్నవాళ్ళం లోకువేకదా" అంటూ ఆయన నెమ్మదిగా మెట్లుదిగి మళ్ళ మళ్ళ వెనక్కు తిరిగిచూస్తూ నిజంగా, తనపిల్లను ఆ తివారింట తొలిసారిగా విడిచిపెట్టి వెళుతున్నట్లుగా చూస్తూ వెళ్ళిపోయాడాయన.

ఆయన అమాయకత్వానికి కొంతసేపూ, ఆయన ఛాందసానికి కొంతసేపూ నవ్వుకొని, మొత్తంమీద శుభప్రదమైన కార్యం తన మూలకంగా సాధింపబడుతున్నందుకు సంతోషిస్తూ లోనికి వెళ్ళిందావిడ.

మోహన్ ఆ సాయంకాలం పెందరాళే ఇంటికి రావాలని కొంత ప్రయత్నం చేశాడు, కాని అది సాగ లేదు. కళాశాలలో ఒక వాగ్వివాద పోటీసభ ఉండి అక్కడ్నించి తెముల్చుకొని రాలేకపోయాడు. కళా శాలకు వెళ్ళినప్పటినుంచీ ఇంటికి వచ్చేయాలనే అని పిస్తూ వచ్చింది. గదిలో కూర్చొని తన పెళ్ళివిషయమై ఆలోచించుకొంటూ సోమరిగా, కాలం విశ్రాంతిగా గడపాలని అనిపించిందతనికి. ఆ పగలంతా అతనాలో చిస్తూనే ఉన్నాడు.

"ఈ పిల్ల విషయంలో అందచందాదుల్లో, సంప్రదాయాదుల్లో కాకపోయినా ఎక్కడో ఏదో ఒక చిన్న లోపం ఉండిఉండాలి. కాకపోతే ఈమన లాయన అల్లాగా తిరగవలసిన పని పట్టదుగదా! బహుశః కట్నం అదీ తను అంటున్నంత నిజంగా ఇవ్వలేడేమో పైకి అల్లగని అన్నా తీరా వెళ్ళి పిల్ల నచ్చిందన్నాక నీళ్ళునమిలే బాపతు అయిఉండవచ్చు. కాక ఆ పిల్లకు చదువు సంస్కారాలు లేవని అతి నవ్యులయిన తోటివరుళ్ళు వెనకాడుతున్నారేమో" అని అనుకొంటూ మొదట శంక వేశాడు. కాసేపు తర్కంలో పడ్డాడు.

తన అనుమానాలు నిర్హేతుకమైనవని కొంతసేపు తర్వాత నిష్కర్షగా అనిపించింది.

"ఇంక పూర్వంలా కాదు.

"అమ్మవాళ్ళో, అక్కయ్యవాళ్ళో తన పెండ్లి ప్రస్తావన తెచ్చినప్పుడు—"ఇప్పుడప్పుడే చేసుకోను" అని నిక్కచ్చిగా గానీ, "మీయిష్టం నాకు తెలియదు" అని ముభావంగానీ సమాధానాలు చెప్పకూడదు. అంత భయం దేనికి? పిన్నిగారిచేత ముందుగా ఈ సంబంధం వివరాలు వ్రాయించి నాకు పిల్ల నచ్చిందనికూడా ఒక ముక్క కలపవచ్చు. అల్లాచేస్తాను." అల్లాగా అను కొని అతనొక దృఢ నిశ్చయానికి వచ్చాడు. అతనికా నిశ్చయం మనస్సులో నిలిచాక ఎంతో ఉత్సాహం వచ్చింది. మంచిధైర్యం ఏర్పడ్డది.

అందువల్లనే అతను తన కళాశాలలో చదువు కొంటున్న ఆడపిల్లలవంక కాస్త ధైర్యంగా నిదా నంగా చూచాడు. చూచి పైపై నాజూకులను సరి గానే పోల్చుకొని అచ్చమయిన సౌందర్యాన్ని చక్క గానే ఊహ చేశాడు.

"ఆపిల ఇలా-ఇల్లాగా సన్నగా అనారోగ్యంగా ఉండి ఉండదు. అల్లాగా గిటకబారినట్లుగా ఉండదు. ఎత్తు మడమల స్లిప్పర్లు వేసుకొని అల్లా తూలుతూ నడకనడకా పిల్ల." అని ప్రతీ పిల్లనూ చూచి వంక లెన్నుతూ తన కొంటెతనానికి అంతలో తానే నొచ్చు కొంటూ, ఏమైనా తను చూడబోయే వసువు వాళ్లలా ఉండదని, ఉండడానికి వీల్లేదని తానే ప్రశ్నించు కొని "అవును, వీళ్ళు మా మగపిల్లల్లాగా చదువు సంస్థల్లో పడి నలుగుతూ, హోస్టలు భోజనాలు చేస్తూ కాలం గడుపుతున్నారయ్యె. ఆ పిల్లయేమో ఇంటి పట్టున నీడలో పెరిగినదయ్యె. లేదా ఉండదూ?" అని తనకు తాను సమాధాన పరచుకొన్నాడు.

అతను సాయంత్రం ఇంటికి తిరిగివచ్చేసరికి అతని మనస్సులో వసువు యొక్క మనోహరమైన ఆకార మొకటి రూపు కట్టింది. అల్లాగా రూపుకట్టిన మనో హరాకారాన్నే మరల మరల తలచుకొంటూ మోహన్ విలాసంగా చేతులూపుతూ పైగా సన్నగా ఈల వేస్తూ మేడపైకి వెళ్ళబోతుంటే చూచి హైమవతమ్మగారు సందు గుమ్మంలో నిలబడి "ఇల్లా రావయ్యా ఒకసారి" అని పిలిచింది. అతను అటూ ఇటూ మాసెడం గమ నించి "ఆయన మధ్యాహ్నం కాసేపు పడుకొని నాలు గ్గంటలకు వెళ్లాడు. అయిదు గంటలకు మళ్ళీ వచ్చి పట్లా అదీ ఇచ్చి వెళ్ళాడు. నీకాబోయే మామగారి సొమ్ము అంతా నేనే పుచ్చేసుకోవడం ఏం బాగుం టుందీ"అని అనుకుంటూ లోపలకు వెళ్లి ఓ చిన్న వెండి పళ్లెంలో రెండు బజ్జీలు పెట్టి తెచ్చి అతని కందించింది. మంచినీళ్లు పిల్లను తెమ్మని తాను కొన్ని చక్రకేళీలూ, రెండు బత్తాయిపళ్ళూ పట్టుకొని వచ్చింది.

"ఓ క్షణం కూర్చో కాఫీ తెచ్చి ఇస్తాను." అని ఆయన మధ్యాహ్నం కాఫీ త్రాగడంలోని విశేషాలు చెబుతూ అతనికి కాఫీగ్లాసు అందించింది. మోహన్ "అబ్బే ఎందుకండీ ఇప్పుడే ఒక అర్ధగంట క్రితమే నండీ త్రాగుతా అప్పుడే మళ్ళీనా" అంటూనే అందు కొని నెమ్మదిగా అప్యాయంగా చప్పరిస్తూ కాఫీ త్రాగుతుండగా ఆవిడ ప్రొద్దుట నుండీ జరిగిన సంగ తులూ, తనకు కలిగిన అభిప్రాయాలూ అన్నీ వివ రంగా చెప్పింది. చెప్పి "ఆయన రెండోసారి వచ్చి వెళ్ళినప్పుడు వాళ్ళమ్మాయి ఫోటో ఒకటి ఇచ్చి వెళ్ళాడు." అని దాన్ని అతని చేతికిస్తూ "ఆయన కూడా కాస్త నాగరికం నేర్చుకున్నాడయ్యోయ్!" అని నవ్విందావిడ.

"అల్లాగేం" అని అతనూ చిరునవ్వు నవ్వుతూ ఆ ఫోటో అందుకొని కుర్చీ చేతిమీద పెట్టి "మొఖం మీద ముసలాయనకు వియ్యాలవారి మర్యాదలు జరిపారన్నమాట." అన్నాడు మోహన్.

"దానికేం భాగ్యం కానీ. అసలు విషయం చెప్పలేదు. రేపు మనం వెళ్ళి ఆ పిల్లను చూచిరావాలి. ఆయన మరీ మరీ చెప్పి సరేనంటూనే కాని వెళ్లలా. నిన్నెల్లా అయినా ఒప్పించి వెంట తీసుకొని రమ్మని బ్రతిమిలాడాడు. చివరకు నేను, తర్వాత మీ అమ్మతో సర్ది చెప్పుకోవచ్చునులే అని ధైర్యం చేసి, వస్తావని వాగ్దానం చేశాను. మరి నా మాట..." అని ఆమె అంటుండగానే మోహన్ నవ్వుతూ "మీ మాట జవదాటడం కష్టమే కాని అల్లా చేశారేం? స్వతంత్రించామనుకోరూ ఇంటిదగ్గర తెలిస్తే?" అన్నాడు.

"ఊ—తెలియనిస్తావా, అయినా ఎందుకయ్యా అంతభయం నీకూ. నువ్వు ముందు పిల్లను చూడు. నచ్చితే ఆపైని భారమంతా నాది. నేను తీసుకొని వెళ్ళి చూపించాను అని వ్రాస్తే మీ అమ్మగానీ, నాన్నగారు కానీ ఏమీ అనుకోరు. ఒకవేళ పిల్ల నచ్చడూ ఇక్కడే తుంచేయవచ్చు వ్యవహారం. అయినా నేను మాత్రం పరాయి దాన్ని కాదుగా, నువ్వు సరేనను." అన్నదావిడ. మోహన్ లోపల కాస్త భయంగా ఉన్నా, మరో ప్రక్క అమిత సంతోషంగా ఉన్నా పైకి "ఊ సరే కానివ్వండి:" అని మాత్రమే అని ఊరుకొన్నాడు. ఒక్కక్షణం అల్లా ఊరికే నే కూర్చుని మరి నేను వెళ్ళొచ్చుగా" అన్నట్లు చూస్తూ లేచి నిల్చుని ఆ ఫోటో అందుకొన్నాడు.

"ఇందాకటినుంచీ ఫోటో చూడనే లేదే! ఓహో అర్థమయ్యిందిలే. కాని చూచావబ్బాయ్ మా కోడలుకు ఘోషా పద్ధతులేవీ పట్టుబడడానికి వీలులేదు. సుమా" అని పకపకా నవ్వేసింది.

అందుకతనూ నవ్వుకొంటూ మేడపైకి వెళ్ళాడు. అతను తన గదిలోకి వెళ్ళి అప్రయత్నంగా తలుపులు వేసుకొన్నాడు. కిటికీలోనుంచి అప్పటికే కావలసినంత వెల్తురు వస్తున్నా లైటు వేశాడు. తాను తాపీగా కుర్చీలో కూర్చుని ఫోటో తీసుకొని పైన ఉన్న ఉల్లిపొర కాగితం నెమ్మదిగా తొలగించాడు. అతనొక్కసారి మిక్కిలిగా చకితుడయ్యాడు.

అంతలో అతనొక్కసారి ఆనందపరవశుడయ్యాడు. తానా పగలంతా ఊహ చేసిన రూపాన్ని ప్రత్యక్షంగా తన ఊహలకు పదిరెట్లు అధికంగా ప్రత్యక్షంగా చూచాడు. నూత్న వధువు ప్రథమ దర్శనం చేశాడు.

అతను ఆ ఫోటో వంక అల్లాగే చూస్తూ కొంత సేపు మౌనంగా ఉండిపోయాడు.

వెన్నెల కాంతులను నలువైపులా వెదజల్లుతూ కలువలను తట్టి నిద్రలేపుతూ అంతలోనే ప్రపంచమంతా తానే ప్రకాశిస్తూ చంద్రుడు వెలుగొందుచున్న సమయంలో వియత్పథాలనుండి, పల్చని తెల్లని అందమైన మేఘాలను ధరించి క్రిందికి దిగి వస్తూ ఉన్న అప్సరసవలె కన్పించిందామె. భూలోకంలో ఉన్న తన ప్రియునికై తొలిసారిగా తానుగా అభిసారికయై వస్తూ ఉన్న ఏ గంధర్వకన్యనో చూచి పాలరాతిపై ప్రతిబింబాన్ని పట్టి చూపినట్లుగా ఉన్నదా చిత్రం.

ఆమె రూపు రేఖలను అతను పరిశీలనగా చూచాడు. అంతటి సౌందర్యాన్ని ఒక్కసారిగా చూడలేకనూ పోయాడు. అందువల్లనే నెమ్మదిగా చూచాడు. తృప్తిగా హాయిగా చూచాడు.

చూచి సంతోషించాడు. తనలో తను నవ్వుకొన్నాడు. సరిగ్గా తన మనస్సులో ముద్రితమైన రూపానికీ ఎదుట ఉన్న రూపానికీ అతి సన్నిహితమైన పోలికలు ఉండటం గమనించి అతను మరింత సంతోషించాడు. మిక్కిలిగా సంబరపడ్డాడు.

ఇంత అందమైన పిల్లా!

వెంటనే నిశ్చయం చేసుకొంటే బాగుండు.

మరొకళ్ళెవరూ చూడకముందే తామే వెళ్ళి సంబంధం ఖాయం చేసుకొని వస్తే బాగుండు. అసలు పిన్నిగారికంటె కూడా ముందుగా పిల్లనోసారి చూచి వస్తే! అనుకొన్నాడు మోహన్.

"ఏబళ్ళోనో, ఏ కళాశాలలోనో చదువుకున్న పిల్లయితే ఏదో వీలు చూచుకుని ఏ గేటుదగ్గరో నిలబడి చూచేయవచ్చును. కాని ఈ పిల్ల విషయంలో అది కుదరదుగా" అని ఎవరో తన్ను ఉడికిస్తూ సమాధానం చెప్పినట్లయ్యింది.

తీయతీయగా అతన్ని ఊరిస్తూ, ఉడికిస్తూ మళ్ళీ మళ్ళీ చక్కిలిగింతలు పెడుతూ, సమాధానపరుస్తూ ఎన్నో ఆలోచనలు అతని మనస్సులో మెదిలాయి. అవి మెల్లగా గాలిపిల్లల్లాగా సాగాయి. అల్లరిచేశాయి. అతన్ని కొంత అల్లరిపెట్టాయి. అతను తన అమాయకత్వానికి తానే నవ్వుకున్నాడు. కాసేపు విసుక్కున్నాడు. కొంతసేపు తర్వాత ఆయన భోగట్టా అంతా తెలుసుకుని వివరంగా వేగంగా వ్యవహారం నడిపించని, నడిపించలేని తన తెలివితక్కువతనానికి తానే సిగ్గుపడ్డాడు.

“అబ్బే అల్లా అన్నీ అడిగేస్తే చెవాయునకు చులకనైపోనూ! కాదూ ఒకవేళ ఇంటిగుట్టులవీ, తెలిస్తే మాత్రం ఎవ్వరికీ తెలియకుండా ఈ రాత్రికి రాత్రివెళ్ళి చూచిరావడం పడుతుందా? ఇల్లాఅనివింటే నవ్విపోతారు.” అనుకొంటూ అతను తన్ను తాను కూకలేసుకొని సమాధానపడ్డాడు. విప్పిన పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నాడు. తలుపు చప్పుడయ్యేసరికి.

‘ఎవరూ లేరు, గాలేకదా’, అనుకొని మళ్ళీ ఏదో ఆలోచనలోపడ్డాడు. అంతలో క్రిందనుంచి హైమవతమ్మగారి కేక వినపడింది. అతను “ఏమిటండీ”అంటూ క్రిందకు వెళ్లాడు.

“ప్రొద్దుపోయింది ఇప్పుడుహోటలుకేంపోతావు గాని ఈపూట ఇక్కడే భోజనంచేసి కాస్తపెందరాళే పడుకో.” అని అంటూ బలవంతపెట్టి అతనికి అన్నం పెట్టింది. రేపు పెందరాళే నిద్రలేస్తే పిల్లలతోపాటు నీకూ వేడినీళ్ళిస్తాను. వీలైతే తలంటుకొందువుగాని, అన్నదావిడ. అతను ఏమీ మాట్లాడక అన్నింటికీ ఊకొట్టి త్వరత్వరగా భోజనం పూర్తిచేసి పైకివచ్చాడు. అతను పైకివస్తుంటే ఆమె మళ్ళీ ఓసారి హెచ్చరిక చేసింది” కాస్త పెందరాళే నిద్రపోవయ్యా’’ అని. మోహనుకు రాత్రిళ్ళు బాగా ప్రొద్దుపోయేదాకా చదువుకోడం అలవాటు. ఒక్కోసారి ఒంటిగంటకూడా దాటవస్తున్నప్పుడు హైమవతి భర్త వచ్చి “పడుకో వయ్యా మోహన్ ఇంకా ఏం చదువుతావ్” అని కోప్పడిన సమయాలుకూడా ఉన్నాయి. అల్లాగా మరి ప్రొద్దుపోయి పడుకొన్నప్పుడు మరునాడు ఉదయమంతా మధ్యాహ్నందాకా అతను కొంచెం మందకొడిగా కన్పించేవాడు.

ఈవిషయాలన్నీ జ్ఞాపకంవచ్చే ఆవిడ అతన్ని అల్లా హెచ్చరించింది. రెండోసారి అల్లా హెచ్చరిక చేసి లోపలకు వస్తూ ఆమె మరోటికూడా అనుకున్నది. అల్లాఅనుకొని అంతలో పెదవికరచుకొని “కోడలితో ముందుగానే చెప్పాలి. అబ్బాయికి ఆట్టే నిద్రాభంగం కలిగించకమ్మా అని” అనికొని నవ్వుకున్నది.

ఆరాత్రికి మోహనకు అంతతేలిగ్గా నిద్రపట్టింది కాదు. ఆలోచిస్తూనో, ఊరికే కలలుకంటూనో, కాలం వృధాచెయ్యాలని అతను అనుకోలేదు. భోజనం చేసి పైకి వచ్చాక ఎంతో బుద్ధిమంతుడిలా పుస్తకాలు ముందేసుకొని కూర్చున్నాడు. చదువుకోవాలని ప్రయత్నంచేశాడు. కాని తెరచిపెట్టిన లెక్కలపుస్తకం, నోట్సుపుస్తకం అట్లాగే ఉన్నాయి. చేతిలోఉన్న పెన్ను అల్లాగే ఉండిపోయింది. ఒక్క స్టెప్పుకూడా వెయ్యలేకపోయాడు. విధానం తెలిసి ఉండికూడా చేద్దామనుకొన్న లెక్క సాగలేదు. అతను మరోపుస్తకం తీసి చదవడం మొదలుపెట్టాడు. కాని అదీ సాగలేదు. మనస్సు బల్లమీద రికార్డుపుస్తకంలో దాచి ఉంచిన ఫోటో మీదకే పోతున్నది. ఇంక లాభంలేదని చదువు కట్టిపెట్టి, ప్రక్క పరచుకొని, ఇంకా దాపరికం దేనికని ఆ ఫోటోనుబల్లమీద తన కెదురుగా కన్పించేలాగున అమర్చి వపుం వాల్చాడు మోహను.

అతను పదిగంటలు దాటాక ఆలోచనల ప్రవాహాలకు అడ్డుకట్టలు వెయ్యాలని ప్రయత్నాలు చేస్తూ చేస్తూ, తన ప్రయత్నాలు వెనువెంటనే సఫలం కాకపోవడంచేత ఆ విషయాన్ని మొదటినుంచి కొసదాకా ఒక్కసారి సింహావలోకనం చేసి తన అందచందాల విషయమై ప్రసక్తివచ్చి, తన కుటుంబంలో జరిగిన వివాహాది శుభకార్యాలలో వదినలు, మరదళ్ళూ, మేనత్తలూ తన్నుగురించి పలికిన ప్రశంసా వాక్యాలు జ్ఞాపకం చేసుకొని, తృప్తిపడి, “ఇంక నిద్రపోవాలి, పిన్నిగారు అన్నిసార్లు చెప్పింది,” అని అనుకొంటూ కూడా చాలాసేపు మేల్కొనే ఉండి చివరకు అప్రయత్నంగా నిద్రపోయాడు మోహన్. మంచినిద్ర పట్టింది అతనికి.

‘తామిద్దరూ వీధి గుమ్మంలోనే ఆగిపోయారు. ఆపిల్ల అవతల గుమ్మంలోనే ఆగిపోయింది. ఆ అమ్మాయి

తెల్లని గ్లాస్కో చీరకట్టుకొన్నది. గ్లాస్కో రవిక పాతపద్ధతిలో కుట్టించినది తొడుక్కున్నది. పగటి పూట అయితే ఆమె శరీరగతమైన సర్వ సౌందర్యమూ కొంత పరీక్షగా చూడకముందే కన్పించిపోను. అదే జరిగితే అతని గుండెల్లో రైళ్ళు పరుగెత్తి ఉండేవి. తికమక పడి ఉండేవాడు. హైమవతమ్మగారు "ఇదేం వస్త్రధారణమమ్మాయ్—మనకి తగువటమ్మా" అని ముఖంమీదే కుమ్మంలోనే అనేసి ఉండేది.

కాని ఎందువల్లనో ఎవరూ ఏమీ మాట్లాడలేదు. పైగా వాతావరణమంతా పొగమంచు కమ్ముకొన్నట్టుగా ఉన్నది. అందువల్ల కాబోలు ఆమె ఏమీ అనలేదు. కాని మోహన్ ఆమె వంక ఆమె స్నిగ్ధతనూ లావణ్యాన్ని పరీక్షిస్తూ చూడడం గమనించింది. అతన్ని మందలిద్దామనుకుంటూనే ఆమెకూడా ఆ పిల్ల వంక చూస్తూ ఉండిపోయింది. మంచులో ముంచి ఎత్తిన తెల్లని కలువ పూవులా ఉన్న ఆమె ముఖంలో సౌందర్యం కొట్టవస్తూనే ఉన్నది. ఆమె పెదవులు లేత గులాబీ రేకలను వెక్కిరిస్తున్నాయి. స్నిగ్ధమూ కోమలమూ అయిన ఆమె చెక్కిలిపై, చెవులకున్న రాళ్ల దిద్దుల ఎఱ్ఱని కాంతులు సన్నగా ప్రసన్నంగా ప్రతిఫలిస్తున్నాయి. అంతలోనే ఆ కాంతులను ప్రన్నని ఆ మృదుకపోలాలు తోసివేస్తూ ఉన్నాయి.

ఎంతో ఆకర్షిస్తూనే ఉన్నదా అమ్మాయి. దేవతాకన్యలా మెరసి పోతూనే ఉన్నదా పిల్ల బొడ్డు మల్లెలా అందాలు పోగేసుకొని కూర్చున్నట్టే ఉన్నది. తీగ సంపెంగలా విలాసంగా తాజాగ్గానే కన్పిస్తున్నది. మసక మసక కాంతిలో కూడా తళతళ మెరసిపోయే మంచి ముత్యాల్లాగా ఆ పిల్ల కళ్లు మిలమిల మెరుస్తూనే ఉన్నాయి. ఆ పిల్ల ముందుకువచ్చినప్పుడు ఆ నడకలో యౌవన వయోవిలాసవతి నడకలో సహజంగా ఉండవలసిన మందగమనం, ఆ ఒయ్యారం, ఆ ఉలుకూ, ఆ సొగసూ స్పష్టంగా కన్పడుతూనే ఉన్నది. అచ్చమూ అమాయకమూ అయిన ఆమె ముఖోత్పలముపై ప్రేమ చంద్రుని, కాంతులు ప్రసరించి అందంగా ప్రతిఫలిస్తూనే ఉన్నాయి. నవ వధువులా ఆమె సిగ్గు తెర అతిప్రయత్నం మీద తొలగించుకొని చూస్తున్నట్లూ ఉన్నది.

కాని...కాని...

కాని ఆమె వల్లా ఒక్కసారి పరీక్షగా చూచే సరికి ఎందువల్లనో నిశ్చలంగా నిలచి పోయింది. మరికొన్ని క్షణాల తర్వాత నిల్చునట్టే ఉండి నిలుచున్న చోట కన్పించలేదు. అల్లాగని హైమవతమ్మ గారికి ముందుగా అనిపించింది. ఆమెగారు విభ్రాంతి పడినిలిచింది. "అదేమమ్మా" అని సందేహం లోపడి అతను అటూ ఇటూ చూచి మళ్ళీ ఎత్తుగా ఎదురుగా ఉన్న ఫొటోవంక కన్నార్పకుండా చూస్తూ ఉండి పోయాడు. హైమవతమ్మ గారు మోహన్ను "నీకొక్కడూ చెప్పేదీ ఎందుకలా చూస్తావ్" అన్నట్లు ఉరిమి చూస్తూ మోచేత్తో పొడిచింది.

మోహనుకు చప్పున మెలకువ వచ్చింది. ఒక్క అర్ధక్షణం క్రితం తన్ను ఎవరో నిజంగానే మోచేత్తో పొడిచి హెచ్చరించి నట్లుగానే ఉన్నది. సరిగా అలానే అనిపించింది. కలపూర్తిగా కరిగిపోయింది. నిలువెత్తు మంచు విగ్రహం నిమిషంలో చూస్తుండగానే కరగిపోయి నట్లుగా అంత సౌందర్యమూ, అంతలోనే అదృశ్యమైనట్లుగా అతని మనస్సు కొంత చెదిరింది. "ఏమిటీ కల? ఇలా వచ్చిందేమిటి?" అని పలుమార్లు ప్రశ్నించుకొన్నాడతను కొంచెం చిరాకు పడ్డాడు. ఎంతకూ సమాధానం దొరక్కపోయే సరికి అతను వెంటనే ప్రక్కమీదనుంచి లేచివెళ్ళి గ్లాసుడు మంచి నీళ్ళు త్రాగి కాసేపు కుర్చీలో ఊరికే కూర్చున్నాడు. ఇదేమిటి "ఇంత పిచ్చివాణ్ణవుతున్నాను అని అనుకొని సమాధాన పరచుకోవాలని ప్రయత్నిస్తూనే చాలా సేపు అల్లాగే ఉండిపోయాడు.

అంతలో బుడిపుట్టి తీసి ఆ ఫొటోవంకే చూస్తూ కూర్చున్నాడు.

ఆ యౌవన నవవిలాసం పూలపొదలపైన కొనలు తేలుతూ మంద మంద పవనాలకు కూడా ఓర్వలేక ప్రక్కలకు ఒరిగిపోతూ ఒయ్యారాలుపోతూ కదులుతూ ఉన్న ఏలకీ లతలాగా ఉన్నది. తమలపు తీవెలా చూచిన కొద్దీ నవనవలు వెదజల్లుతూన్నది. తన బాహువులను ఆ లావణ్యలతకు ఆధారంగా అందివ్వాలని అనిపించింది మోహనుకు. అల్లాగని అనుకొనే సరికే అతని ఒడలంతా ఒక్కసారి పులకరించింది.

"ఇప్పుడే ఇల్లా అనుకోవడం ధర్మం కాదు. ఎవరైనా చూస్తే బాగుండదు సుమా" అనుకొంటూ

ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ, లేచి వెళ్ళి లైటు ఆర్పి మెల్లిగా ప్రక్కమీద నడుం వాల్చాడు. "నీవల్లా అనుకోవడం తప్పుకాదూ?" అని ఎవరో ప్రశ్నించినట్లయి "అబ్బే అంత తప్పేంకాదు. ఆ పిల్ల నన్ను కలలో కవ్వించింది. కనుక నేను ఇలలో భావనలో సరసమాడాను. మరేంతప్పు కాదు." అని సమాధానం చెప్పుకొన్నాడు. అందువల్ల అతనికి తృప్తికలిగింది. తృప్తిగా సుఖంగా నిద్రపోయాడు.

అతనికి కొంచెం పెందరాళే మెలకువ వచ్చింది. మత్తెక్కించే సువాసనలు వెదజల్లే పూల పొదరిండ్ల ప్రక్కగా చాలాసేపు నడిచి వచ్చినట్లున్నది. అతనికింకా కొద్దిగా మత్తుగానే ఉన్నది. ఆ మత్తుదనం కొంత చిత్రంగా మధురంగా కల్పించింది. హృదయం తేలికగా ఉన్నట్లు కనిపించి.

ప్రభాత వాయువులు మందమందంగా ప్రసరిస్తున్నాయి. అప్పుడప్పుడే విడిపోతున్న పొంగమంచు తెరలతో దోబూచులాడుతున్నాయి. చెటుకుబురులను తాకుతూ సన్నని సవ్వడులుచేస్తూ, ఆ గాలులు ఉషస్సులో ప్రకృతి కాంతి ప్రపంచానికై పాడుతున్న మేలుకొల్పులకు తామున్నూ వంత పాటలు పాడుతున్నాయి. అవి మెల్లిగా శరీరాన్ని తాకి నూతనోత్సాహాన్ని కలిగించుతున్నాయి. పులకరింతలు కలుగజేస్తున్నాయి. రాత్రంతా వెన్నెలలో, మంచులో నీటి అలలపై తేలుతూ ఒయ్యారాలు పోతూ, ఒళ్ళు విరుచుకొంటూ కదలులాడుతూ ఉన్న కలువలు ప్రభాత వాయువులను మరింత పరిమళవంతం చేస్తున్నాయి. శైత్యాన్ని చేకూరుస్తున్నాయి.

మోహను లేచి కూర్చున్నాడు.

రాత్రి తనకు కలిగినది చిత్రానుభూతి ఏదో అస్పష్టంగా స్ఫురణకు వచ్చింది. రాత్రి తానాలోచించిన విషయం మరింత మధురంగా అనిపిస్తూ జ్ఞాపకం వచ్చింది. అతను మందహాసం చేశాడు. లోపల ఎంతో తృప్తిగా సంతోషంగా ఉన్నది.

మోహన్ గబగబా క్రిందకు వెళ్ళి త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకొని కాఫీకి వెళ్ళి వచ్చాడు.

మోహన్ కాఫీకి వెళ్ళి తిరిగి వచ్చేసరికి అప్పుడే ఎనిమిది గంటలయింది. అతను సరాసరి ఇంటికి రాక ఒకరిద్దరు మిత్రులతో ఉల్లాసంగా పిచ్చాపాటి మాట్లాడి ఆలస్యంగా వచ్చాడు. అతను ఇంటికి వచ్చేసరికి గుమ్మం ముందు సజ్జపుబండీ ఒకటి ఆగిఉన్నది. అతను పైకి వెళ్ళబోతుంటే ఆవిడ వసారాలోనే ఎదురై "ఎక్కడికి వెళ్ళావయ్యా ప్రొద్దున్నే-కాఫీ ఇక్కడ ఇవ్వకపోయినావా—సరె సరె, ఆయన వచ్చి చాలా సేపయ్యింది. నువ్వు వేగం వచ్చేయాలి" అంటూ తొందర పెట్టింది. రెండేసి మెట్లు ఒకేసారి ఎక్కుతూ మోహను ఒక్క నిమిషంలో గదిలోకి వెళ్ళాడు. కూజాలో నీళ్ళు వంచుకుని సబ్బుతో రెండుసార్లు ముఖం కడుక్కొని టర్కీ తువ్వాలతో ఒత్తుకుని పౌడరు రాసుకొని తల దువ్వుకొన్నాడు. అతను తల దువ్వుకొని బట్టలు మార్చుకోడానికి దాదాపు పది నిమిషాలు పట్టింది. "ఇంకా కాలేదుటయ్యా నీ ముస్తాబు" అని క్రింద నుంచి హైమవతమ్మగారు రెండుసార్లు కేకలు పెట్టింది. అతను ముస్తాబు పూర్తి చేసుకొని గుమ్మందాకా వచ్చాక మళ్ళీ ఆ ఫోటో నొకసారి చూడాలని అనిపించి తలుపు దగ్గరగా వేసి అల్లా చూస్తూ నిలబడ్డాడు. అంతలో ఆవిడ మెల్లిగా తలుపు నెట్టుకొని లోపలకువచ్చి అతన్ని చూచి ఒక్కసారి పకాలున నవ్వేసింది. "ఇందుకా ఇంత ఆలస్యం చేస్తా...సరె సరె బయలుదేరు" అన్నదావిడ. "అబ్బే లేదండీ నాదేం ఆలస్యం లేదు పదండి" అంటూ మెట్లు దిగాడతను. "చేసుకొనవలసిన ఆలస్యమంతా ఇందాకే చేశావులే—పద" అంటూ నవ్వుతూ ఆవిడ అతన్ని అనుసరించి క్రిందకువచ్చి ప్రయాణపు ఏర్పాట్లు త్వరత్వరగా పూర్తిచేసింది. ఆఫీసు జవాన్ను "ఇల్లుజాగ్రత్త నేను పది నిమిషాల్లో వచ్చేస్తాను" అంటూ హెచ్చరికలు చేసి, పెద్దపిల్లతో "ఎక్కడికీ వెళ్ళకండమ్మా" అని చెప్పి, పళ్ళబుట్ట ముందు బండీలో పెట్టి ఆవిడ బండీ ఎక్కింది. ఆవిడ తర్వాత ఆయన మెల్లిగా బండీలో ఎక్కి కూర్చున్నాడు. మోహన్ తనదుస్తులు నలిగిపోతాయని వాళ్ళతో కాక వేరె రిక్షా చేయించుకొన్నాడు.

ఆయన దారి పొడుగూతా హైమవతమ్మగారితో ఏదో చెబుతూనే ఉన్నాడు.

పిల్లను చాలా గారాబంగా పెంచాడట తను. తన భార్యఅయినా ఎప్పుడైనా చిన్నప్పుడు కోపంవస్తే ఓ దెబ్బవేసి ఎరుగునటకాని తానెన్నడూ పల్లెత్తు మాట కూడా అనలేదట. అసలు మాట అనిపించుకొనే పిల్ల కాదట ఆ పిల్ల. తన కొక్కతేపిల్ల కావడంచేత తన

ఉన్న ఆస్తిపాస్తులన్నీ క్రమంగా ఆ పిల్లకే చెందుతాయట. పిల్ల పైకి కొత్త నాజూగ్గా కనిపించినా అవసరమైతే ఎంత చాకిరీఅయినా పైన వేసుకొని నిర్వహించుకొని పోగలదు. మరీ, పెద్దపిల్ల అయినప్పటినుంచీ ఇంటి బాధ్యతలన్నీ స్వయంగా చూసుకొంటున్నదట. అల్లాగా ఆయన తన బిడ్డనుగురించి వివరంగా ఎడతెగకుండా చెప్పుకొనిపోతూంటే మొదట కొంత కుతూహలంవల్లనూ, తర్వాత కొంత క్రొత్తవాడు అందులో పెద్దవాడు—ఆయన చెబుతూ ఉండడంవల్లనూ హైమవతమ్మగారు సావధానంగానే విన్నది. చాలాసేపు ఓపిక వహించి ఊ కొడుతూ కూర్చున్నది. కాని పోను పోను ఆయన మాటలు మరీ పిచ్చిగా కనిపించేసరికి, ఆయన చెప్పిన విషయాలు మళ్ళీ మళ్ళీ చెప్పడం మొదలుపెట్టేసరికి, ఆవిడకు నిజంగా విసుగుపుట్టింది. చివరకావిడ ఎందుకండీ బాబుగారూ మీరు ఇంత వివరంగా చెప్పాలా?—మాట్లాడానికి వస్తున్నాంగా మీరు కొంత విశ్రాంతిగా కూర్చోండి." అని అనేసింది. హైమవతమ్మగారా మాట అన్నాక ఆముసలాయన దప్పున మాట్లాడం ఆపేసి ఇంక మళ్ళీ ఉలకనూ లేదు, పలుకనూ లేదు. బెల్లం కొట్టిన రాయిలా అలా కూర్చుండి పోయాడు. పైగా ఏదో దిగులుగా ఎటో చూస్తూ ఉండిపోయాడాయన. వాళ్ళ యింటి గుమ్మంముందు బండి ఆగాక కూడా ఆయన నోరు మెదపలేదు. ఆయన మాట్లాడకుండా బండిదిగాడు. ఆవిడ మెల్లిగా బండిదిగి బండీవాడిచేత పళ్ళబుట్ట దింపించింది. "మీరు పదండి నేను బండివాడికి డబ్బులిచ్చి వస్తాను" అని మూగ సజ్జలుచేసి చెప్పాడాయన. ఆ యింటి గుమ్మంముందు నిల్చుని ఆవిడ ఆయన ప్రవర్తనకు ముసి ముసి నవ్వులు నవ్వుకొన్నది.

ఆ యింటి ముందు ముత్యాలతో ముగ్గులు పెట్టినట్లయ్యింది.

మోహన్ను కలుపుకొని "బండీ ఆగిన చప్పుడు వినిపించినా ఇంటి వాళ్లు బయటకు రాలేదామా" అనుకొంటూ దగ్గరగావేసి ఉన్న తలుపు నెట్టుకొని ఆవిడ లోపలకు వెళ్ళింది. కాని హాలు అంతా ఖాళీగా ఉన్నది. చాపలైనా పరచిలేవు. ఒక్క క్షణం వీరిద్దరూ అక్కడే ఆగిపోయారు. "ఎవరండీ వస్తా?" అంటూ ఆవతలి గదిలో నుంచి ముందుహాల్లోకి వచ్చిందొక ముత్తైదువ. మంచి దబ్బపండు ఛాయలో ఆమె అంత వయస్సులోకూడా ముద్దుగానే ఉన్నది, ఆవిడ పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకొన్నది. వంగపండు చీరకట్టుకొన్నది. సన్నని జరీ అంచుగల రవిక తొడుకున్నది. జుట్టు ముడి వేసుకొన్నది. ఆమె విశాలమైన కళ్ళు ఎంతో ఆప్యాయతను ప్రకటిస్తున్నాయి.

మోహన్ ఆవిడ ముందుగా కన్పించేసరికి ఒక్క క్షణం నిరుత్సాహపడ్డాడు. ఎవరో వచ్చిందని పెండ్లికూతురే వచ్చి తన్ను చూచి లోపలకు తుర్రుమంటుందని అతనూహించాడు. వాళ్ళకు తెలుసుగదా మనం వస్తున్నామని. అందువల్ల ముస్తాబైలోపలే దాక్కొని ఉంటుంది," అని అనుకొని సమాధానపడ్డాడు. నిజంగా అదే బాగుంటుంది. ముందుగా కన్పించేస్తే పెళ్ళిచూపుల సొగసే ఉండదు, అని కూడా అనుకొన్నాడు మోహన్. క్రిందటి వేసంగి సెలవుల్లో మిత్రుడొకడు పెళ్ళిచూపులకు వెళుతూ అతన్ని తోడుతీసికొని వెళ్ళాడు. ఆనాటి దృశ్యమంతా అతని కొక్కసారి స్ఫురణకు వచ్చింది.

అందకత్తె అలంకారాలు చేసికొని వచ్చి తల్లో, మేనత్తో చెయ్యిపుచ్చుకొని తీసికొని వచ్చి కూర్చోబెడితే ఎంతో సిగ్గుపడుతూ కూర్చుని, ఎన్నివిధాల మాట్లాడించినా మొదట్లో మాట్లాడక పోవడం, తర్వాత క్రమంగా మాట్లాడడమూ, అతి బలవంతంమీద ఒకటి రెండు పాటలుకూడా పాడడమున్నూ ఇది సహజంగా జరిగేవిషయం. వధూవరులు – ఎవరూ తమ్ము చూడనప్పుడు, పెద్దవాళ్ళు అప్రమత్తంగా కొన్నిసార్లూ, ప్రయత్నపూర్వకంగా మరికొన్నిసార్లూ చూచుకొంటూ సిగ్గుపడడం, సిగ్గుపడుతూనే చూచుకోవడం. అతను తనవంక చూడడం లేదనుకొని భ్రమపడి పెండ్లికూతురు ధైర్యంచేసి పెండ్లికొడుకువంక చూడడం – చూపులు కలియడం – ఆపిల్ల నిలువునా సిగ్గుపడి పోవడమున్నూ. ఇలాంటి సంఘటనలు ఎంత మధురమైన ఆనందానుభూతి నిస్తాయో, ఆనాడు కొంతగా తెలిసింది మోహన్కు. అప్పుడతను తన మిత్రుణ్ణీ, మిత్రులకు కాబోయే భార్యనూ చూచి, వాళ్ళ ఆనందాన్ని చూసి తానూ సంబరపడుతూ తనకూ అట్టి అనుభూతి స్వవిషయంలో కావాలని రహస్యంగా కోరుకొన్నాడు.

ఆ విషయమంతా మనస్సులో ఒక్కసారి మెదిలేసరికి ఒక్కసారి అల్లా తనపై మల్లికా ప్రసవ సౌరభ భరితమైన పవనవీచికలు మంద మందంగా ప్రసరించి, క్రమంగా నీటి అలల్లాగా దూర దూరంగా కదలి వెళ్ళినట్లయింది. చిరునవ్వులతో అతని ముఖం వికసించింది.

"ఇంకా నిలబడే ఉన్నారేమిటి? కూర్చోండి అమ్మాయి. కూర్చో నాయనా" అని ఆవిడ ఇద్దరికీ ఆసనాలు చూపింది.

హైమవతమ్మగారు మోహన్ను కూర్చోమని ఆవిడతో "అయితే ఇంతకూ మేం వస్తున్నట్లు బాబాయిగారు ముందుగా చెప్పనే లేదా ఏమిటి?" అన్నది.

ఆమాటకా ముత్తైదువ వెంటనే సమాధానం చెప్పలేదు.

మోహన్ అక్కడ మంచికుర్చీలున్నా వెంటనే కూర్చోక ముసలాయన ఇంకా లోపలకు, రాలేదామా అని ముఖద్వారంవైపు చూస్తూ ఒక్క క్షణం అల్లాగే ఉండిపోయాడు. ఆవిడ ఆ కుర్రవానివంకా, హైమవతమ్మగారి వంకా చూస్తూ ఏదో ఆలోచనలో పడి ఓక్షణం తర్వాత తెప్పరిల్లుకొని కూడా ఏం చెప్పాలో తోచక, ఏమని చెబితే మర్యాదగా ఉంటుందో తెలియక తికమకపడ్డది. అసలు వీళ్ళు తనయింటికి ఎందుకు వచ్చారో - వారెవరో కూడా వెంటనే స్ఫురించ లేదావిడకు.

ఆవిడ అల్లాగా వెంటనే మాట్లాడకపోవడం చూచి హైమవతమ్మగారు "ఈ వెర్రిబాగుల మనిషి ఇంట్లో చెప్పకుండానే ఇంత హడావిడీ చేసిఉంటాడు" అన్న నిర్ణయానికి వచ్చి "పోన్లెండి - చెప్పడం మరచారో ఏమో!" అంటూ ముందుకువెళ్ళి "రండి పిన్నిగారూ లోపలకు వెళదాం" అన్నదావిడతో.

తామిద్దరూ లోపలకువెళ్ళి అన్ని విషయాలూ వివరంగామాట్లాడుకొని పిల్లను మూడు నిముషాల్లో ముస్తాబుచేసి తీసుకొనివచ్చి చూపిద్దామనుకొన్నది హైమవతమ్మగారు. వాళ్లు నిర్లక్ష్యం చేస్తున్నారేమోనన్న భావం మోహనుకు ఎంతమాత్రమూ కలుగనీయ కూడదని ఆవిడ లోపల్లోపల ఎంతో తాపత్రయ పడ్డది.

అందువల్లనే చనువుగా ఆవిడగారి చెయ్యి పుచ్చుకొని కాస్త త్వరత్వరగా లోపలకు అడుగులు వేసింది. గుమ్మం అవతలకు వచ్చాక మెల్లిగా "మాది మీ శాఖేలెండి. ఆ అబ్బాయి తండ్రీ మా వారూ పెత్తండ్రి పినతండ్రి కొడుకులు. అతను మా యింట్లోనే ఉండి చదువుకొంటున్నారు. చాలా బుద్ధిమంతుడు. చిన్నబాబాయిగారువచ్చి అన్నీ విచారించి అతన్ని చూచి వెళ్ళారు. వాళ్ళో అన్ని విషయాలూ మాట్లాడారు లెండి. అయితే తెలియకనడుగుతాను మీకు అసలు చెప్పనే లేదా ఏమిటండీ?" అని అడిగింది హైమవతమ్మగారు. "ఏమిటి చెప్పలేదంటారూ?" అని అనలేక అనలేక అన్నదా ముసలాయన భార్య.

"అప్పుడే ఈ వియ్యపురాలితో పరిహాసాలు కూడానా! అదేనండీ పిల్లని చూట్టానికి మేం తరలి వస్తున్నామని చెప్పలేదా అని అడిగాను. సరి పోన్లెండి. ఇప్పుడు మించిపోయిందేమీ లేదు. ఒక్క నిమిషంలో ముస్తాబు చేయించేస్తాను. అది ఏదో లాంఛనం కనుకా. అందులోనూ కొంత క్రొత్తవాళ్ళం కనుకానూ. లేకపోతే ఇలా వచ్చి చూడాలా ఏమిటి! మనం మనం మాట్లాడుకొని నిర్ణయాలకు వచ్చే వాళ్ళం. ఇంతకూ అమ్మాయి పేరేమిటన్నారూ? ఏదీ ఇంకా లోపలే దాక్కున్నదా ఏమిటి! మరీ అంత సిగ్గయితే ఎల్లాగండీ" అంటూ హైమవతమ్మగారు ఎంతో కలుపుగోలుగా ఏదో మాట్లాడేస్తునే ఉన్నది. కాని ఎదుటఉన్న మనిషి మొదట నిర్ఘాంతపోయి— అంతలో కొయ్యబారిపోయి అంతలో మహాసముద్రపు పొంగులా ముంచుకొనివచ్చిన ఆవేశానికి తట్టుకోలేక కూలబడి పోవడం గమనించ నేలేదు. మరుక్షణంలో, గమనించినా ఎంతమాత్రమూ అర్థమేం కాలేదు. "అరెరె అదేమిటండీ" అని హైమవతమ్మగారు ఆశ్చర్యపడుతూ, ఖంగారు పడుతూ అడుగుతూనే ఉన్నది. కాని ఆవిడ వినిపించుకోలేదు. పెద్దగా ఏడుస్తూ "అయ్యో! నా తల్లీ! నీకు పెళ్ళి సంబంధం తెచ్చారే మీ నాన్న," అని తలబాదుకొంటూ దుఃఖపు పొంగులో మాటలురాక బొంగురుపోయిన కంఠంతో "నాకంత భాగ్యమా! అమ్మాయి లేదమ్మా లేదు" అని మళ్ళీ పెద్దగా ఏడ్చింది. హఠాత్తుగా ఏడుపు వినిపించేసరికి దరదరా లోపలకువచ్చి గుమ్మంలోనుంచే ఆ దృశ్యంచూచి నిర్ఘాంతపడి పోయాడు మోహన్.

అతను వచ్చి చూచేసరికి ఆ ముసలావిడ క్రింద నేలమీద కూలబడిఉన్నది. ప్రక్కగా హైమవతమ్మగారు కూర్చుని ఆవిణ్ణి ఓదార్చాలని ప్రయత్నం చేస్తోంది. అతనికేమీ అర్థంకాక "అదేమిటండీ పిన్నిగారూ...ఎందుకావిడ?" అని ఆగిపోయాడు. అతనికి వెంటనే ఆవిడకు ఫిట్సువంటివేమన్నా వచ్చే శారీరక దౌర్బల్యమేమైనా ఉన్నదేమో అనుకొన్నాడు. హైమవతమ్మగారికి క్రమంగా విషయం అర్థమైంది. అవతలకు వెళ్ళమని అతనికి సంజ్ఞచేసింది. అతను ఆవిడ వైపు చూచేసరికే వాళ్ల వెనుక గోడమీద ఎత్తుగా వ్రేలాడదీయబడి ఉన్న పెద్ద సైజు ఫోటో ఒకటి కన్పించింది. కించిన్మాత్రంకూడా ప్రయత్నం లేకుండా మోహన్ ఆ పిల్లను వెంటనే పోల్చుకొన్నాడు. ఒక్క నిమిషం కన్నార్పకుండా ఆ ఫోటో వంకే చూస్తూ నిలుచున్నాడు.

ఆడవాళ్లిద్దరూ అతనలా చూడటం గమనించారు. అతన్ని చూచి మళ్ళీ పెద్దగా ఏడ్చిందావిడ. అతని మనస్సు ఒక్కసారి కలుక్కుమన్నది. అతనా ముసలి ముత్తైదువ దుఃఖాన్ని చూడలేక, ఆ ముసలితల్లి ఆక్రోశం వినలేక ఆ స్థితిని చూచి తట్టుకొనే శక్తి లేక చప్పున అక్కడ్నించి వీధిగుమ్మంలోకి వచ్చేశాడు. వెనుకనుంచి మాటలు వినపడుతున్నాయి. చిన్నవాడు అబ్బాయి మనస్సుకూడా కష్టం కలిగించావమ్మ దౌర్భాగ్యురాల్ని—ఇదంతా మాకర్మ. దాన్ని మొదట్లో వారి బావమరిదికి ఇద్దామనుకున్నాం. ఆదికృష్ణుడి పెళ్ళామనే అంటూ ఉండేవారాయన. కాని వాడు నీ అందానికి నేను తగను అని ఖచ్చితంగా చెప్పేసి ఓ నర్సును పెండ్లాడేశాడు. అలా అనుకొన్న సంబంధం కుదరలేదు. అప్పటినుంచి సంబంధాలు ఇతరత్రా చూస్తున్నాం. పెళ్ళిప్రయత్నాలు చేస్తుండగా హఠాత్తుగా జబ్బుచేసి పిల్ల నా రుక్కమ్మ..." అని చెప్పలేక పెద్దగా ఏడ్చి ఎంతో కష్టంమీద దుఃఖాన్ని ఆపుకొని "అప్పటినుంచి ఆయనకు మతిస్థిమితంగా లేదు. మరి ఈ మధ్య నే ఎక్కువవుతున్నది. నిన్న దాని పుట్టిన రోజు పండగ...ఆయన..." అని ఇంక ఒక్కమాట కూడా చెప్పలేక వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది.

మోహన్ వీధి గుమ్మంలోనుంచే పిన్నిగారూ "మీరు కాస్త నెమ్మదిగా రండే, రిక్షా పంపిస్తాను సరేనా? అని చరచరా ముందుకు వెళ్ళిపోయాడు. ఆవిడ సమాధానం అయినా వినకుండా. అతను అంతకంతకు వేగంగా నడిచాడు. అంత వేగంగా నడుస్తున్నా విరియబూసిన నిత్యమల్లిలా అందంగా నిత్య నూతన వధువులా ఆపిల్ల అతని కళ్ళముందు ప్రత్యక్షమవుతూనే ఉన్నది. ఆ ఫోటో ఇంకా మనస్సులో మెదులుతూనే ఉన్నది. నీళ్ళు నిండిన కళ్లనోసారి అప్రయత్నంగా తుడుచుకొన్నాడు. జరిగిన విషయమంతా ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది. నిజంగా జరిగిన ఒక వాస్తవ విషయాన్ని అంగీకరించడానికి అతని మనస్సు గట్టిగా నిరాకరించింది. అతనేదో గొణుక్కుంటూ ముందుకు సాగిపోయాడు.

# వాసనా ప్రకృతి

సుప్రసన్న

ఈ గంధానిల వీచికల్ మృదులతా హేలాత్వరాయాతముల్
సాగన్ పల్లెలు, ఫ్యాక్టరీల్, నగరముల్ సౌధాలు పాథోనిధుల్
ఊగన్ సర్వజగత్తు ప్రత్యణువులో నున్మాద మాధుర్య పా
రాగోత్పాతము సొన్నజల్లువలె జారన్ ఎల్లచేతమ్ములన్.

ఈ పువుపువ్వు లేపెదవు లించుక మెల్లన విప్పి, మాధురీ
కూపములైన వాడి ఎదకోనల ముళ్ళను విప్పి, భావ వి
ద్యా పరమార్థభూత సకలాధ్వముల న్వెలయించుచున్న వా
యూ! పదిలమ్ముగా చనుమ్ము రమ్మోయి! దిగంతము లెల్ల చుట్టిరా!

పరికిణీ కట్టిన పసిపిల్ల చిన్నని జడమల్లెపూవుల కడలనుండి
సుధ నిండుకుండయౌ శోభనపుం బెండ్లి కూతురు వాల్జడ కొనల నిండి
ప్రాతస్సమాయాత ప్రౌఢాంగనాముఖ తాంబూల రాగమ్ము తాకి కదలి
తల్లి పూజోద్యాన తరులతాపాళిలో భక్తితో నంజలి పట్టిపట్టి
ఎడద ఎడద మొగ్గ ఎలపూవుగా చేసి
విడిది చేసి నన్న నడులు చేసి
అఖిల లలితకళల కాదివై వెలయు వ
రీమళా! సుధా సరిత్తరంగ!

ఓసీ వాసనలైనదాన! ఇటురావో! వేడికౌగిళ్లలో
ఈ సర్వమ్మును చుట్టివైచెదవు కానీ నీవు నా కౌగిటన్
రాసక్రీడ యొనర్పగావలయు నే రారమ్ము! ఆనంద ల
క్ష్మీ సామ్రాజ్యమునం జరించెదము కార్చిచ్చుల్ వలెన్ ప్రేయసీ.

ఎద ఎదవాసనల్ వెలువరించును, కన్నులు కన్నులందునన్
కదలు సువాసనానదులు, కామిని కైశికమందు వాసనల్

మొదలును సన్నసీలలయి, మీగడ లట్టుల తేలునవ్వులన్
ఇది ఇదియంచు నేల పరమేశ్వరభావము కూడ వాసనే !

చేరెడు కన్నుల చెల్లెలి మాటల తీవిలో సంపెగల్ ప్రోవులగును
శారదాబ్దమువంటి చక్కనిశిశువు నవ్వుల మల్లెపూవులు జలదరించు
చంద్రబింబమ్ములా సాగెడు చెలిపైట అంచులో చేమంతు లాటలాడు
మహిమోలె వెలసిన మాతృమహాదేవి చూపులో కలువపూల్ శోభనొందు

స్నేహమున్నచోట శ్రీమృదుభావ ప
రీమళములు ఐక్యసిద్ధి నొందు
ఊహసేయవలయు 'సోహ'మ్మనవ్వలె
జీవభావమపుడు చివురులెత్తు.

ఆపని గాఢ వాసనలకై వెదుకన్వలెనా మనుష్యుడా !
ఈ పువులే పరిమళము లీయవు, సర్వ జగత్సరస్సులో
పూవులు కానిదేదియును పుట్టదు, సర్వము పుష్పజాతియే,
ప్రోవులు ప్రోవులై విరియబూచిన సృష్టియె పంచభూతముల్.

ఈ విరు లేడ వోయినను ఈ సుమవాసన విశ్వవీథిలో
పోవదు, ఎప్పుడో తదనుభూత హృదంతరమందు క్రొత్త రూ
పై వివృతంబునొందు, తదనంతర మా పువు క్రొత్తదాను, చి
త్రావధులైన విశ్వ హృదయాబ్జము లిట్టులె పూచె తమ్ముడా !

చిత్రములైన వాసనలు చిత్రములైన పథాలవెంట లో
కత్రయముం జరించు, సకలాత్మలలో దనియించు, భావనా
మాత్రమునందె తోచు తనమాదిరి వాసన లప్పుడే జడ
త్వత్రుటన మ్మొనర్చు సుఖవారిధియో దుఃఖపువార్ధియోయనన్.

ఎవడును వాసనాప్రకృతియే యగు, వాసనలేని జీవితం
బవసరమా? జడత్వమున కావల నేమిటి యున్నదో ఎరుం
గవు మరి నీవు దానికొరకై వెదుకన్ వలెనేల? నీ ఎడం
ద విరిసికొన్న లోకమున తావులు ముంచును తేల్పునొక్కడన్

సుకమొ దుఃఖమొ జీవి వెంబడిని వచ్చున్ వాసనా భావ వీ
చికలం దందె పరిభ్రమించు జగతిన్ జీవుండు యద్యద్వినూ
త్నకలాపంబున నైన వాసనలచేతన్ కృష్ణుడైపోవు మం
జులతా మార్గమునందు ద్వంద్వమున విచ్చున్ రేఖ లానందముల్.

తొలి యేదో ఒక పూవు విశ్వమున వర్తించెన్ తదంతర్వినూ
త్నలతా మార్గములందు వేల్పువులు అంతా విచ్చుకొన్నాయి, పూ
వుల క్రొంగ్రొత్త పరీమళాలు తొలి పూవుంబట్టి వర్ధిల్లె ని
శ్చల మానందమునుండి సర్వజగతీ సర్గంబు కల్గించుకై.

ఏతాదృశ్మృదు వాసనానుగ మనోహీవాక సౌందర్యముల్
ఏతామెత్తగ రమ్మ! యాంత్రిక నరుం డీనాడు హృత్పీఠ సం
స్థా తాత్పర్యము గుర్తెరుంగడు కవిత్వంబేలు కొన్నట్టి చాం
ద్రీ తీరంబుల చేరబోవు ధిషణారీథత్ప్రమాణంబుగన్.

సుమనస్సీమల వాసనానదులలో సూర్యాంగరాగంబులో,
హిమభూభృచ్ఛిఖరాగ్ర దేశములలో ఎచ్చోటనో విశ్వ మె
ల్ల మృదుజ్యోత్స్నల నింపిపోయిన శివాలంకార కైశోర చం
ద్రము డేలున్ నను వాసనాస్పృహుని, సౌందర్యప్రియా స్వాదునిన్.

# పురుషకారపు బాధ్యత

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

పుణ్యము లేనివారికి కన్యావరణము, కన్యాదానము, వివాహము మొదలగు శుభకార్యములు జరుపుటకు శుభముహూర్తములు కాని, కడకు శుభదినము కాని లభించదని శౌనకమహర్షి చాటిచెప్పినాడు.

"వరణ, ప్రదాన, పరిణయ
శచీ ప్రపూజా, భిషేక, కరణాని।
సుశుభే, తిథౌ, ముహూర్తే
నభవంతి, కిలాల్పపుణ్యానాం॥"

ఇది గొప్ప అన్యాయముగా చూపట్టుచున్నది. సత్యము విచారించితిమేని, నిర్దుష్టములైన చక్కని ముహూర్తములలో శుభకార్యములు జరుపవలసిన ఆవశ్యకత అల్పపుణ్యులకే హెచ్చు. సమృద్ధిగా పుణ్యఫలము కల అదృష్టశాలురకు సాధారణముగా కష్టములు రానేరావు. వచ్చినా, సులభముగా అవి తొలగిపోగలవు. కనుక, రమారమి వారి జీవితములు శాంతియుతముగా, ఆనందకరముగా, సాగిపోవుచుండును. అట్టివారికి శుభలగ్నముల ఉపయోగమున్నచో, అది అల్పమే. మరి, తమ జీవితములు కష్టములపాలు కాకుండునట్లుగా, జాగరూకతతో గమనించి తగిన సదుపాయముల నాశ్రయించవలసిన ఆవశ్యకత పుణ్యహీనులకే కదా? ఇట్లుండగా, శౌనకమహర్షి పైవిధముగా శాపము పెట్టుచున్నాడేమి?

ఎవరికి మంచి ముహూర్తములు అవసరము కలదో, వారికే అవి లభ్యముకానిచో, ఇక ముహూర్త శాస్త్రమునకు ప్రయోజనమేమి? శుభకాలములలోనే వివాహాదులు జరుపవలయునని శాసించినవారు మహర్షులే కదా?

"తస్మాత్సమ్యక్పరీక్ష్యైవ,
కాలయోగం విచక్షణైః,
ద్వితీయ జన్మ కర్తవ్యం;
అస్య కాలో విధీయతే."

అని నారదమహర్షి సెలవిచ్చియున్నాడు. స్త్రీలకు వివాహము ద్వితీయ జన్మమనుట ప్రాచీనుల సంప్రదాయము. అట్టి ద్వితీయజన్మమునకు బాగుగా విమర్శించి విచక్షణలో తగిన శుభకాలమును ఏర్పరచవలయునని శాసించి, ఆవిషయమున సూత్రముల నిబంధించినాడీ దైవర్షి. ఇతర మహర్షులు సైతము ఇట్లే చెప్పిరి. ఈ నియమములే ముహూర్తశాస్త్రము. ఇట్లు శాసించిన శాస్త్రకర్తలే "మీరు అల్పపుణ్యులు; మీకు శుభకాలము దొరకదు." అనుటలో అర్థమేమి? నోటితో లేదనుటకు బదులుగా చేతితో లేదనుటయేకదా!

కాని, లోకకళ్యాణదృష్టితో శాస్త్రమును రచించినవారు మహర్షులు. ఏవిధముగానైనా స్వప్రయోజనము వారికి దీనిలో కానరాదు. వారు యోగసిద్ధులు, త్రికాలజ్ఞులు. అట్టివారు శాస్త్ర రచనలో ప్రమాదముపాలైనారని కాని, పరస్పర విరుద్ధములైన సూత్రముల నిబంధించినారని కాని, భావించుట సాహసము మాత్రమే కాక పూజ్యులపట్ల క్షంతవ్యము కాని అపచారముకూడ. సరే కాని, శౌనక వాక్యమునకు సమన్వయమెట్లు?

ఆచార్య వరాహమిహిరుడు సైతము ఒక విధముగా శౌనకమహర్షి మతమునే సూచించినాడన వచ్చును.

"ఉద్వాహే నియతి ర్నయ త్యతిబలా వేలాం సమాం ప్రాక్ఫలైః" అని. విధి ప్రబలముగానున్నచో పురాకృతఫలము సిద్ధించుటకు తగిన కాలమునే అది సంపాదించి తెచ్చిపెట్టగలదట! ఇది అతని సిద్ధాంతము- అనగా, ప్రాచీన సుకృతము పరిపక్వము కానున్న కాలములో శుభముహూర్తములు, ప్రాచీన దుష్కర్మ పరిపక్వతకు వచ్చువేళలో దుర్ముహూర్తములు, లభించగలవనుట! శుభముహూర్తములు సులభముగా లభించు పుణ్యాత్ములకథ అట్లుండనిత్తము. అల్ప పుణ్యులగు వారి గతియేమి? వారికి తరుణోపాయమే లేదా? పురుష

ప్రయత్నము లేనిచో దైవమెంతకే ఫలము నియ్య దనియు, పురుషకార మావశ్యకమనియు, పెద్దలు చెప్పి వారుగదా?

"తథా పురుషకారేణ
వినా దైవం నసిధ్యతి"
"సిధ్యంతి సర్వా ఆరంభాః,
సంయోగాత్ కర్మణోర్ద్వయోః,
దైవాత్పురుషకారా చ్చ;
నత్వేకస్మాత్కథంచన" అని

మరి ప్రయత్నించినచో అల్పపుణ్యులకు మంచి ముహూర్తము దొరకక పోవుట కేమి కారణము? శుభకాలము వచ్చువఱకు వారు కాచియుండక ఆత్రపడుదురనియా? లేదా, ముహూర్తమును నిర్ణయించి ఇచ్చు దైవజ్ఞుడు ప్రమాదవశమున దుర్ముహూర్తమును నిర్ధరించి ఇచ్చుననియా? కానిచో, తగిన యోగ్యతలేని ఏ నక్షత్ర సూచకుడో ముహూర్త నిర్ణయమునకై వారి పాలికి లభించి ఏ వ్యతీపాతలోనో, ఏ విష్టిలోనో, ఏ అష్టమలగ్నమునో, ఏర్పరచి యిచ్చుననియా? ఏమి దీని యర్థము? ఆలోచించిన కొలది ఇది చిక్కు సమస్య అగుచున్నది.

ఏది ఎట్లుండినా, మౌహూర్తికులకు మాత్రము ఈ శౌనకుని సూత్రము ఎంతో ఉపయోగకరముగా నున్నది. వధూవరుల జాతకములను పరిశీలించక, దైయుక్తిక విధులను గమనించక, గణితపద్ధతుల నాదరించక, యుక్తాయుక్త వివేచన లేక, గడియ కొకటి అడిగిన వెంటనే "తత్కాలలగ్న"మని నిర్ణయించి ఇచ్చి, ఎవరైన ఆక్షేపించినచో "వారి వారి కర్మ ననుసరించి వారికి ముహూర్తములు లభించగలవు. జ్యోతిష్కుడు నిమిత్తమాత్రమే." అని ప్రతి యిచ్చి మౌహూర్తికుండు తన బాధ్యతను తప్పించుకొనుటకు ఇది చక్కని ఉపాయముగుచున్నదికదా? మరియు, 'కానున్నది కాకమాన'దను యదృచ్ఛావిషయ సంప్రదాయముగల తత్త్వజ్ఞులకు ఈ సూత్రము మంచి చేయూత. కాని జ్యోతిశ్శాస్త్ర సూత్రమును రచించిన మహర్షులకు మాత్రము ఈ సిద్ధాంతముపై అభిమానము లేదు. దైవ పురుషకార శక్తుల పరస్పర సహకారముతోటి సంయోగమే ఫలప్రదముగా వారు నిర్వచించిరి. కావున నే, దైవము విషమముగా నుండు కాలములో సర్వారంభములు మానుకొని ఊరక యుండవలయునని వారు శాసించుట.

"యదా గ్రహాణాం వైషమ్యం
సర్వారంభం పరిత్యజ."

అని భరద్వాజవాక్యము. ప్రాచీన కర్మపరిపాకరూపమగు దైవము ఎపుడు హితకరమగునో, ఎపుడు విషమఫలప్రదముగా నుండునో, గ్రహగతి తెలుపుననియు, దానిపోకడ జాతకదశాదులచే గుర్తించి తదరీతి పురుషకారము నెరపవలెననియు మహర్షుల సిద్ధాంతము.

వరాహమిహిరాచార్యుని వాక్య మిది చిత్తగింపుడు.

"యత్నేన సంపాద్య మనుష్యకారం,
యత్నావకాశే పురుషో నిరుంధే,
ప్రతీక్షతే దైవ మతంద్రితో యః,
త మాపదో నాత్మకృతాః స్పృశంతి."

పురుషకారమును ప్రయత్నముతో సంపాదించి జాగరూకతతో దైవానుకూల్యమును ప్రతీక్షించువానికి ఆత్మకృతములగు ఆపదలు రావట! అవకాశము లభించినదని దుర్దైవముగల కాలములో శుభకార్యములు చేయరాదనియు, దైవానుకూలము సమకూరిన దినములలోనే అట్టి కార్యములు జరుపవలెననియు ముహూర్త శాస్త్రపు సిద్ధాంతము.

ఆకాశరంగమందు సంచరించెడి గ్రహములకు మానవజీవితములతో గల సంబంధము ఆ గ్రహములనుండి నిరంతరము భూమిపై ప్రసరించుచుండు తేజఃసమామ్నాయమువలననే కలుగుచున్నదిగదా! ఈ తేజస్సు దుర్నిరోధమగు వేగముగల మహాప్రవాహము. అప్రమేయమైనది దానిశక్తి. దాని మార్గమునకు సన్నిహితముగ అందుబాటులోనుండు వస్తుజాలమును హఠాత్తుగా లాగి తనతో తీసికొనిపోవుశక్తి దానికి సహజసిద్ధము. దానిని నిరోధించి నిలువగల్గుట కాని పని. గంటకు 60 మైళ్ళ వేగముతో ఇనుప పట్టాలపై పరుగెత్తుచున్న పంజాబు మెయిలుబండి మార్గమునకు గజము దూరములో నిలుచుకొన్న వ్యక్తి ఆ బండిని తాకకపోయినా దాని వేగమువలన నిలుకడ కోలుపోయి కాళ్ళు పట్టుతప్పి ముందుకు లాగబడుచు ప్రమాదము పాలగును కదా? సులభముగా అర్థమగుటకై

ఈ రైలుబండి దృష్టాంతము చెప్పుటే కాని, వాస్తవమునకు ఇది నీచోపమానము. గ్రహతేజః ప్రవాహవేగముతో రైలువేగమును పోల్చుట మార్తాండ ప్రకాశముతో మిణుగురుపురుగును పోల్చుటవంటిది. ఆ ప్రవాహవేగమునకు దొరకకుండ మానవుడు ఎంత దూరము నిలువగలిగితే అంత క్షేమము.

కాని, ఈ ప్రవాహము దృగ్గోచరము కాదు. అది ఎప్పుడు ప్రవహించునో, ఏ మార్గములో వచ్చునో తెలియదు. ఇట్టి పరిస్థితులలో దానిబారికి చిక్కకుండ తప్పించుకొనుటెట్లు? ఈ విషయమున మానవులకు తగిన ఉపదేశము లభించుకొరకే మహనీయులగు ప్రాచీన మహర్షులు జ్యోతిశ్శాస్త్రమును రచించుట. ఈ ప్రవాహ మెప్పుడు దుష్టముగా పరిణమించునో, అది యే మార్గమున ప్రయాణము సాగించునో, ఎవరు దానికి సన్నిహితముగా నుండుట సంభవమున్నదో, మున్నగు అనేకాంశములు—ఆ శాస్త్రము సూచింప గలదు. కాని అవి తెలిసికొన గలిగినంత మాత్రమున నే మనకు చరితార్థత లేదు. ఆ ప్రవాహమునకు అతివిచిత్రమైన శక్తి యొకటి గలదు. తన కార్యమునకు అనుకూలించు వస్తుజాలమును, పరిస్థితులను, అది సిద్ధపరచుకొనియే వచ్చుచుండును. దూరమునుండి చూచినచో అది యెంతో రమ్యముగా చూపట్టి మనల నాకర్షించగలదు. వివేకమును కోలుపోయి దానిని ఉపయోగించుకొను ఆశతో సమీపించితిమేని, అతిసులభముగా ఆ ప్రవాహవేగము తటాలున మనలను లాగి యీడ్చుకొని పోగలదు. తరువాత మనకు స్వాతంత్ర్యమే ఉండదు. ప్రతిక్రియ ఏమియు చేయజాలము. ఏ ప్రయత్నము చేసినా, దానికి సహాయమగును. కడకు అధఃపాతాళమే గతి.

సారాంశ మేమన, గ్రహవైషమ్యముకల, అనగా దైవశక్తి విషమముగానున్న కాలములో దాని వైషమ్యమును ఫలింపజేయగలవ్యక్తులు, సన్నివేశములు, మనల నాకర్షించుటకై మనచుట్టును సిద్ధమగును. అన్నియు అనుకూలముగా ఎదిగివచ్చినట్లు చూపట్ట గలదు. ఆ అవకాశములను ఉపయోగించుకొన్నచో బాగుపడగల మనుభావము సాధారణముగా మనకు జనించుట స్వభావము. అట్లు ఉపయోగించుకొనుటకు ప్రయత్నము ఏకొంచెమయినా చేసినచో చాలు. ఆ ప్రవాహమునకు మనము దొరికినట్లే. అనగా, విషమదైవశక్తితో సహకరించుటకు మన పురుషకారశక్తిని ఉపయోగించితి మనుట. ఆ మాత్రము అవకాశము లభించినచో, ఆ విషమశక్తి నిర్నిరోధముగా మనలను ఈడ్చుకొనిపోయి గమ్యస్థానము చేర్చగలదు. అనగా, విషమఫలము మనలను అనుభవింపజేయును.

కనుకనే, దుష్టదశాకాలమున అభివృద్ధికార్యములు జరుపుటకై పురుష ప్రయత్నము చేయరాదనుట. ఉద్యోగమున క్లేశము సూచించు దశలో ప్రయత్నించినప్పుడు క్రూరుడైన అధికారిక్రింద నే ఉద్యోగము దొరకును. గ్రహగతి బాగుగా లేనిదినములందే పదవీస్వీకారము చేయవలసిన నిర్బంధము వచ్చును. వియోగక్లేశము సూచించు దశలో వివాహము జరిగినేని, అల్పాయురాయముగల కన్యకయో, వ్యధికరణ స్వభావముతో విడాకులు పంపుకొనుటకు దారితీయు విషయమో, దాపురమగును. దుష్ఫలము నియ్యగల ముహూర్తము కూడి రాగలదు. శుభకరమైన ముహూర్తము నిర్ధరించియుండినా, ఆనాటి కేవో అననుకూలము లేర్పడును. అల్లునకు సెలవు లేదనియో, ఆడుబిడ్డ చెరగుమాసిన దనియో, మరి ఏ అల్పకారణముననో, సుముహూర్తములమార్చి తరువాత దుర్ముహూర్తములను ఉపయోగించుకొని చిక్కులపాలయిన దృష్టాంతము లెన్నియో గలవు.

తేలిన దేమనగా, దుష్టకాలములో శుభకార్యములు జరుపుటకు పురుషకారము నుపయోగించినచో దుష్టఫలమే తెచ్చిపెట్టగల ముహూర్తములే దొరకు ననుట పై మాత్రముల సారాంశము. ఇచట ముహూర్తమనుట ఉపలక్షణము మాత్రమే. వ్యక్తులు, పరిస్థితులు, సన్నివేశములు, అన్నియు తదనుగుణమైనవే లభింపగలవనుట.

విషయము సుబోధ మగుటకై ఒక ఉదాహరణము జూపుట ప్రయోజనకారి. ఒక యువకుని జాతకచక్రమును చిత్రింపుదుము.

| | | | |
|---|---|---|---|
| శ 8 24 (వ) | I ४-40 దాంపత్య 27-51 | వ 5-31 | |
| | సాయనము | | యము 26-11 శ 20-33 |
| రా 20-23 X 7-8 | పురుషజాతకము | | పుణ్య 4-56 బు 15-43 ర 16-8 భార్య 69-29 |
| చ 11-24 | కు 6-9 గు 14-40 | | ఇ 13-16 శు 21-29 |

మేషలగ్నము. లగ్నాధిపతి కుజుడు స్వక్షేత్రములో ప్రబలుడై అష్టమభావములో నున్నాడు. ముందువెనుక లాలోచించక తాత్కాలిక భావోద్రేకముతో, అహంభావముతో, ఖిల్లాకపు పట్టుతో ప్రవర్తించుట స్వభావము. పైగా ఈ కుజునకు వరుణుని సమసప్తక వేధ. ఉన్నశక్తిని తన కొఱకయినా, ఇతరుల కొరకయినా సద్వినియోగపరచు కొనీయని వ్యధికరణచిత్తవృత్తి. బుద్ధి విపరీతపంథలో నడచును. చాలదని గురు బుధులకు పరస్పర కేంద్రవేధ. వివేకము మట్టము. ధర్మస్థానమందలి చంద్రునికి మాయావి ఇంద్రుని క్రూర కేంద్రదృష్టి. అలవికాని ఊహాలు. అందరాని ఆదర్శములు, పనికిరాని కార్యారంభములు, దీని ఫలము. దశమాధిపతి శని వ్యయస్థానములో పడియున్నాడు. ప్రయత్నములు పదిపాళ్ళు వ్యర్థ విఘాతమునకే ఉపయోగపడగలవు. కళత్ర (సప్తమ) స్థానాధిపతి శుక్రుడు కుజుని అర్ధకేంద్రములో, వరుణుని పార్శ్వ కేంద్రంలో నుండుట. సుఖాభావమును క్లేశమును తెలుపు యోగమిది. విషయసుఖస్థానములో (V) నున్న పుణ్య సహమమో, లగ్నాధిపతి కుజుని కేంద్రవేధకు పోవుచున్నది దురాశ్రయమోహమువలన దుఃఖప్రాప్తి ఫలము. జాతకుని సామాన్య స్వభావమిది. ఇట్టి వ్యక్తికి 21 సంవత్సరములు తీతవయస్సులోనే ప్రబలశక్తిగల దశలు వచ్చినవి. దేవమాన దశాపద్ధతిలో చలితరవికి లగ్నాధిపతి కుజుని అర్ధకోణ దృష్టి, వరుణుని కోణదృష్టి సహా, సమకూడినవి. ఉత్సాహముతో జాతకుడు ఉద్రేకితలాగినాడు. తాను పట్టినదే పట్టు. ఇతరుల మాట చెవికెక్కదు. చలిత కుజుడు చలిత శుక్రుని అర్ధకోణ మైత్రి సంపాదించుకొని సయ్యాటలాడగల్గుటసైతము అప్పుడే. విద్యనుండి విషయసుఖము వైపునకు దృష్టిమరలినది. కళత్రము లేనిదే కథ జరుగదను గట్టి భావము వచ్చినది. కన్యావరణములో యోక్త్రాయుక్త వివేచనకొఱకు కాలయాపన చేయు సహనము లేదు. ఎవరైన నేమి, భార్యాస్థానము నలంకరించుటకు కన్యక ఒకతె కావలసియున్నది. వివాహము జరిగినా జరుగక పోయినా భార్యవచ్చుట ప్రధానము. దాంపత్యసహమము చలించి శుక్రుని కోణదృష్టినందుకొని నాట్యమాడుచున్న కాలమది-ఇంతే కాదు-చలిత భార్యాసహమము వరుణుని కోణదృష్టికి వచ్చి చిందులు త్రొక్కుచుండెను. భార్యకావలయు నని ప్రబలమైన ఉత్కంఠ ఆయువకునకు కలుగ లేమి అగుదు? తిగినవి వేకమా లేదు; ప్రపంచానుభవమా చాలదు. సంస్కారమా శూన్యము-పెద్దలు ఎంతహితము బోధించినా ఫలము కావంలేదు. జాతకునిది మకరిపటు. విద్య వచ్చినా, లేకపోయినా, వివాహము చేయనిచో అనర్థ సంఘటనలకు దారితీయు నేమో అని పెద్దలు భయపడినారు. వెంటనే కన్యకలను వెదుకుటకు గట్టి ప్రయత్నము చేయ నారంభించినారు వారు.

వివాహమునకు అనుకూలించు దశాసౌకర్యములు జాతకునకు వచ్చియున్న మాట వాస్తవమే. కాని వివాహమైనచో అహితమే ఫలించునని సూచించు దుష్టదశలు సహా వానితో మిళితమై వచ్చియుండుట విషాదకరము. చలిత రవి చలితశనిరెుక్క సమసప్తక వేధ నందుకొనుచున్నాడు. చలిత భార్యా సహమము త్వరలోనే ఆ శని వేధనందనున్నది. చలిత దశమ కేంద్రమునకు యముడు ఎదురు చుక్క అయినాడు. ఇట్టి కాలములో వివాహప్రయత్నము చేసినచో, దుష్టదైవమునకు పురుషకారము సహాయ మగుట కాక మరేమి?

ఎంతో ప్రయాసపడి పెద్దలు చక్కని కన్యక నొకతెను కుదిర్చినారు. కాని ఇంతిలో పుటిన దొక్క ముసలము! తమ కూతురు నితని కిచ్చి పెండ్లి చేయవలెనని సంకల్పించి ఒకానొక కన్యక తల్లిదండ్రులు విడాదిగా ఎంతో సన్నాహము చేసినా వారికోరిక ఫలించియుండ లేదు. జాతకుని పెద్దలకు ఆ పసువు, ఆ సంబంధము, రుచించినది కాదు. కాని, ఇతనినే పెండ్లి యాడవలెనని ఆ కన్యక గట్టిపట్టు పట్టినది. ఇతనికి కన్యక నిచ్చుటకు సమ్మతించిన వారు వెనుకంజ వేయునట్లుగా ఏవో కొన్ని చాణక్యతంత్రములు రహస్యముగా జరుపబడినవట! సమయము చూచి వచ్చి జాతకుని వలలో వేసికొన్నది ఆ చతురురాలు. "అన్యథాశరణం నాస్తి" అని ప్రార్థించి ప్రాధేయపడి ఆతని సమ్మతిని సంపాదించినది. విధిలేక, ఆమెతోనే జాతకునకు వివాహముజరిపినారు పెద్దలు. మరి ఇంకేమి చేయగలరు?

ఇది ఇట్లుంచి ఆ వసువు జాతకమును ఒకతూరి పరిశీలింతము. ఇదే ఆమె జాతక చక్రము:—

| | | | |
|---|---|---|---|
| గు0-59 (వ) | I 1-1<br>శని 18-0<br>దాంపత్య 21-48 | వ 17.25<br>కే 23-25 | చ 11-30 |
| పుణ్య 12-10 | వసువు జాతకము | | య 29-45 |
| X 0-45 | (సాయనము) | | ర 0-11<br>కు 0-30<br>బు 26-2 |
| | భ ర 12.45<br>రా 23-25 | | శు 10-14<br>ఇ 19.7 |

ఈమెది సహో మేషలగ్నమే. అందులో మేషాంశ, వర్గోత్తమము. నూటికి నూరుపాళ్ళు కుజధర్మము. లగ్నాధిపతి కుజుడు ప్రబలుడగు సింహ రవితో అత్యంతిక సంయోగములో నుండుట గమనింపదగినది. రవి కుజ సంయోగమునకు,

"ఓజస్వీ, సాహసికః,
మూర్ఖో, బలసత్త్వసంయుతో, వ్రతవాన్,
పాపమతి, ర్వధనిపుణో,
రవి కుజయోస్స్యాత్, ప్రచండశ్చ."

అని 'సారావళి' వర్ణించిన ఫలము స్వభావములో నుండెనేని, అట్టి స్త్రీ యుద్ధరంగమునకు ముఖ్యముగా తగియుండునేమో కాని, సాధారణముగా శాంతియుత మగు సంసారధర్మ నిర్వహణమునకు తగియుండునా యనుట సందేహము — ఇదటి యోగమునకు యము డొక్కడు తోడు. దావాగ్నికి ఝంఝామారుతము తోడైనట్లు — ఈ త్రిమూర్తుల కోణదృష్టి లగ్నముపై నున్నది. ధైర్యము, సాహసము, ప్రచండత్వము, కార్యశూరత, రోషము, శాఠ్యము, నిర్దయత, శౌర్యము మున్నగు గుణములు జాతకురాలి స్వభావములో చూపట్టినచో వింత లేదు. లగ్నము వరుణుని అర్ధకేంద్రమునే అభిలషించుచున్నది. ప్రవర్తనములో 'మురారి మార్గము.' సప్తమాధిపతి శుక్రుడు యిచట సైతము అరింటనే ఉండుట వైవాహిక జీవితము శాంతియుతముగా సుఖప్రదముగా నడచుటకిది కొంత ప్రతిబంధకము — ఇంతేచాలక, మిథునచంద్రునిలో ఈ శుక్రునికి నిండుగా కేంద్రవేధ! బుధ గురువులకు సమసప్తక వేధ యుండుకతమున వివేకము శూన్యమని చెప్ప నవసరము లేదు.

ఇది ఇట్లుండి వీరికిగల అన్యోన్య గ్రహయోగములను పరికింపుడు. వరుని రవికి కన్యవరుణుడు కేంద్రము? అతని యమునకు ఒకవైపున ఆమె శుక్రుడు, మరియొకవైపున ఆమె చంద్రుడు. అతని శుక్రునితో ఆమె శుక్రుడు నిండుకేంద్రము. వైవాహిక జీవితవిషయమున ఇది నిస్సంశయముగా క్లేశసూచకములు. పోగా. వీరిరువురు ఒకేలగ్నములో జనించినవారే — ఇట్టిజాతకులు సమాన ప్రభావము కలవారగుటచే, 'భార్యా భర్తృత్వ' వ్యవహారముల సమంజసముగా నిర్వహించగల్గుట కష్టము. అందులో స్త్రీ లగ్నమునకు తరువాతి నున్నది పురుషలగ్నము. స్త్రీ లగ్ననక్షత్రము. ఉత్తరాభాద్ర -- పురుషలగ్న నక్షత్రము రేవతి.

"ఏకరాశౌ పృథగ్ధిష్ణ్యే ।
పుంతారా ప్రథమాధి చేత్ ।
అతీవ శోభనా ప్రోక్తా;
స్త్రీతారా చే దశోభనా" — గర్గుడు.

ఇట్టియోగమును పెనెరిల లగ్నమందురు. పురుషుడు నిస్తేజస్కుడగునటు! భార్యయుందర అతని ఆటలు సాగవు. వీరి జన్మచంద్రులు నికరముగా పరస్పర సమసప్తకములో నుండుటచే వీరు ఒకరి నొకరు ప్రబలముగా నాకర్షించుకొన్నారు. సామాన్యపరిస్థితులలో ఇది వివాహమునకు రమ్యమగు యోగమని పేరు. కాని ఇతర విషమయోగములు లేకుండినుండినచో వీరి దాంపత్యము హితకరముగనే గడచియుండెనేమో? కూటములు శోధింపగా వీరికి పొంతనములలో 36 టికి 24 గుణములు వచ్చినవి. విషమ గ్రహయోగములవలన అవి దుర్గుణములుగా మారినవి కాబోలు!

పోనిత్తము: వీరి జాతకముల పరస్పర సామరస్య మిట్లున్నది కదా! వివాహము జరిగిన వయస్సునకు కన్యక జాతకములో చలితవది వరుణునితో కేంద్రవేధలో నుండెను. సంబంధబాంధవ్యములకు కొరగాని విషమదశ ఇది. చలిత దశయును కని కేంద్రవేధకు పోయి పురుషకారమునకు దుష్ఫలమే కలుగునని సూచించినది. చలిత భర్తృసహమును వృశ్చికాంతపు క్రూరగండ సంధిని చేరుకొన్న కాలమది. చలిత కుజుడు భర్తృసహమునకు వచ్చియుండెను. ఇది వివాహమునకు తగని కాలమని ఈ దుష్టదశలు చాటుచున్నవి కదా!

జాతకములో పరస్పరానుకూల్యమును చూపు దైవ సంపత్తి లేని ఈ కన్యావరులకు విషమదశలు నడుచుచున్న కాలములో వివాహమహోత్సవము జరుగుట! ఏరీతిగా చూచినా, వీరు ఒకరికొకరు తగని వారు — కాని ఒకవిధముగా ఆలోచించితిమేని వీరు అన్యోన్యముగా తగినవారే కాబోలు నన వచ్చునేమో? దుష్టదశావాస్థానము ననుసరించి అన్యోన్యముగా విషమఫలప్రాప్తికి తగినవారే అగుచున్నారు కదా? దశ (దైవశక్తి) దుష్టముగానున్న కాలములో పురుషకారము దానికి తోడుపడెనేని దుష్ఫలమును సమ

కూర్పుటకు పనికివచ్చు వ్యక్తులు, పరిస్థితులు, ముహూర్తములు దాపుర మగుననిగదా వరాహమిహిరుని సిద్ధాంతము! పెద్దలు వేరుకన్యను నిర్ధరించినా అది త్రోసిరాజు చేయబడినది. దశలతో అతని కన్యక తప్పిపోయి, అతికిన వధువువచ్చినది. వరుని చలిత లగ్నమును ఈ వధువుయొక్క ఇంద్రుడు సార్థకేంద్ర దృష్టితో లాగి మంత్రించి మచ్చుబూడిద చల్లినాడు. అతనిభార్యాస్థానముపైన ఆమెచలిత శని తిష్ఠ వేసియుండెను. శని పట్టు వదలునటిదికాదు. అది ఆమె వరుణునికి కేంద్రస్థానము. శని ఆకర్షణమంత్రము జపింపగా, వరుణుడు ఉచ్చాటన మంత్రమును పఠింప గలడు. ఆమె చలిత లగ్నాధిపతి కుజుడు అతని చంద్రునికి నిండు కోణమునకే వచ్చియుండుట. కాక అతని చలిత శుక్రుడు ఆమె ఇంద్రునిపైనున్న కోలము అది. ఇంద్రజాల విద్యతో ఆమె జాతకుని స్వాధీనపరచుకో గలిగినది. పెద్దల ఉపదేశమును వారి నిర్ణయమును త్రోసిపుచ్చినాడా మూర్ఖుడు. ఎన్ని ప్రతిబంధకములు కల్గినా ఆ ప్రపంచమూనిని కడకు తన ప్రతిజ్ఞ ఏమో నెరవేర్చుకో గల్గెను.

వరాహమిహిరాచార్యుని మతము ననుసరించి ఈ వధూవరులకు తగిన ముహూర్తమే లభింపవలయును గదా! వరునికి భార్యకై ఆత్రము. వధువునకో ప్రతిజ్ఞా పరిపాలనమునకు ఉత్కంఠ. కాలయాపనము ఎవరోర్తురు? సుముహూర్తమునకై అపు కాచినచో, ఏ ప్రతిబంధక సామగ్రి ఏర్పడునో అని వారిభయము. ఏ మహానుభావుడో వారి కొరకు ముహూర్తమును ఏర్పరచిఇచ్చి పుణ్యము కట్టుకొన్నాడు.

ఆ ముహూర్త చక్ర మిదే:—

| | | | |
|---|---|---|---|
| | X 18.0 | | బు 2-0 (వ)<br>కే 8-3<br>ర 9-37 |
| కు 28-12<br>చ 20-48 | వివాహముహూర్తము<br>—<br>సాయనము | | శు 9-0<br>I 20-30<br>వ 29-32 |
| | | | గు 24-14<br>యు 26-14 |
| రా 8-3 | శ 28-45 (వ) | ఇ 28-1 (వ) | |

ఈ ముహూర్తము ఎంత శోభాయమానముగా నున్నదో చిత్తగింతురుగాక! లగ్నము పునర్వసూ నక్షత్రపు విషనాడిలోనున్న శుభక్షణమందే మంగళ సూత్రము మూడుముళ్ళు పడుట.

"వివాహ వ్రతమాదాసు
గృహారంభ ప్రవేశయోః
యాత్రాది శుభకార్యేషు
విఘ్నదాః విషనాడికాః." జ్యోతిఃసారము.

ఇది మహా విఘ్నప్రదమగు యోగము. శుక్రవరుణుల పరినమును లగ్నమున్నది. ఆ వాహనమునకు వెనువెంటనే ఉద్వాసన మనుచే ఇది. వివాహకాలములో చంద్రుడు అష్టమభావములో నుండుట మహాదోషములలో నొకటి. అందులో చంద్రుడే లగ్నాధిపతి. అగుట మరింత దోషమునకు ప్రాబల్యము. ఆ చంద్రునకు సమసప్తకములో గురు, యములుండుటచే చంద్రజామిత్ర శుద్ధిలేదు.

"దేవగురు ర్యం స్వం తాం
పశ్యేద్ద్విష్టాంచ దుర్భగాం కురుతే."

అని ప్రాచీనసూత్రము. బంధు వైషమ్యము, భర్తృద్వేషము, దుర్భగత్వము, చంద్రజామిత్ర గురువునుండి కలుగుననుట. ఇక, యముని ఫలము మనవారు చెప్పలేదు. కుజుని ఫలము వంటిదే కాని అంతకంటె గొప్పది. అని మనమూహింప వచ్చును. మరియు కుజుని సంయోగముచే చంద్రుడు అభిలషించుచుండుట. అనగా సగ్రహ చంద్రదోషము. ఈ కుజునకో నిండు కేంద్రవేధలో శని. 24 గంటలు నడచు లోపలనే చంద్రునికి గురుయముల సమసప్తకవేధ, శని కేంద్రదృష్టి, కుజుని సంయోగము సహా సిద్ధించుచున్నవి. ఎన్ని స్పర్థలో, ఎన్ని అనర్థములో, ఆవాడే కల్గియుండుట అసంభవము కాదు. కుజశనులు స్పర్థకు దిగినచోట కేశాకేశి, బాహాబాహి వ్యవహారముల వరకు రావచ్చును. సప్తమాధిపతి శని గండాంతములో నున్నాడు. భర్తపాలికి ఈ వివాహ మొక గండము వంటి దనుట. ధనిష్ఠానక్షత్రములో వివాహము. ఈ నక్షత్రము వివాహ విషయమున దుష్టమయినది. శుభసూచనలు చాలవా?

ఆనాడు వరునికి జన్మకేతువుపైన దైనిక సప్తమ కేంద్రముండెను. ఆత్మగౌరవ భంగకరమగు భార్యా

సంపాదన మని దీనిసూచన. వధూవుకన్యనో, దైనిక సప్తమ కేంద్రములో తాత్కాలిక వరుణ మహాశయుడు ప్రత్యక్షము. వియోగమునో, విపరీతసంఘనో చూపుటకు బీజ మచట నే నాటబడినది. ఏమి విధి దుర్విలసిత మిది ?

వివాహమైన కొన్ని గంటలలోనే ముహూర్తపు ఫలము మూర్తీభవించినది. ఇరుపక్షముల వారికి పరస్పర ముగా ఘర్షణములు, స్పర్థలు యథేచ్ఛముగా జరిగినవట. ఆ మరుదినమందే వధువు తీవ్ర ప్రతాపమును బాహాట ముగా చూపినది. కుజ, రవి, యమ సంయోగముగల వ్యక్తి ఈమె.

"నా ప్రతిజ్ఞ నెరవేర్చుకొంటిని. ఇంతవరకు నిన్నాశ్రయించినాను. ఇకమీద నీవు నన్ను ఆశ్రయించ వలసినదే" అని భర్తకు, కాదు వరునకు తెలిపి వెంటనే తనవారితోడ బయలుదేరి చల్లగా పుట్టినిల్లు చేరుకున్నది. ఆమె కోరినది మంగళసూత్రము; అది లభించినది. అతనియింటికి వచ్చుటకాని, అతని పెద్దల ననువర్తించుట కాని, తనకు సాధ్యముకాదని ఖండిత ముగా మొగమాటము లేక ఆమె వరునకు చెప్పివేసెనట! ఆమెను నిలుపుటకు, కడకు సమాధానపరచుట కయినా, పాపము, ఆ పిచ్చిపుల్లయ్యకు సాధ్యము కాలేదు. వివాహపు శాస్త్రము అయినది కాని భార్య స్వాధీనము కాలేదు. ఆశ ఎంతో అంత నిరాశ. అతని పరిస్థితి విషాదకరము.

పెద్దల హితోపదేశమును విని ఈ జాతకుడు వివాహమును మానుకొని యుండినచో, అప్పుడు ఈ దిశలు ఎట్టిఫలము నిచ్చియుండును? అనవచ్చును. వివాహము కాలేదేయను క్లేశము; ఏదైనా స్త్రీ వ్యసనము నకు లోబడి ఉద్దేశము ఫలించక దుఃఖపడుట, ఇంతటిలో కథ జరిగియుండగలదు. ఇప్పుడో, వివాహమై ఏమి సాధించినట్లు? భార్య ఇంటికి రాలేదు. సరిగదా, మరల వివాహమూ సాధ్యముకాదు. కన్యక నిచ్చువారే ఉండరు. ఉండినా, శాసన నిషేధము. అమార్గ ప్రవర్తనమో, దుర్మార్గ ప్రవర్తనమో, వచ్చునని భయపడి పెద్దలు వివాహమునకు ప్రయత్నించిరి. మంచి ఉద్దేశ్యమే. కాని ఈ పురుషకారమువలన ఫలించినదేమి? ధనవ్యయము, ప్రయాస, మనఃక్లేశము గౌరవహాని, బంధుద్వేషము ఇంతే కదా? పోగా జాతకుడు నీతిమార్గ మతిక్రమించుటకు మునుపటికంటె ఇప్పుడే అవకాశము లెక్కువగా నున్నదనుట సత్య దూరముకాదు. ముల్లుతీసి కొఱ్ఱుదిగవేసినట్లు అన్నసామెత అయినది.

పోనిత్తము. ఇప్పటికి ఫలము ఇంతే. భావిపరిణామము దైవాధీనము. దానినిచట చర్చించుట అప్రస్తుతము. ప్రపంచానుభవము చాలని వధూవరులు తమ కథను న్యాయస్థానమున కెక్కించి రచ్చపాలుచేయు కుండునట్లుగా వివేకము కరపి వారిని రక్షింపుమని సర్వేశ్వరుని ప్రార్థింతము గాక!

దుష్టదైవమునకు పురుషకారము సహాయపడినపుడు ఫలమెట్లు విషపరిణామమునకు దారితీయునో, ఈ కథ బోధించుచున్నది. శ్రీవరాహమిహిరుల సూత్రములు మనకిపుడు పనువ్యర్థములుగా నున్నవి కదా?

దైవానుకూలమును గమనించియే పురుషకారమును జరుపవలెనని మహాభారతమందలి ఈ క్రింది ఉపదేశము ఎంత స్పష్టముగా నున్నదో చూడుడు.

"సర్వేషాం పూర్వమారంభాత్
చింతయేన్నయ పూర్వకం,
ఆత్మశక్తి, ముపాయాంశ్చ,
దేశకాలేచ, యుక్తితః,
కరణాని, ప్రయోగంచ,
ప్రక్షేపంచ, ఫలోదయం,
ఏవమాదీని సంచింత్య,
దృష్ట్వా దైవానుకూలతాం,
అతఃపరం సమారంభేత్,
యాత్రాత్మహిత మీహితం..."

—అధ్యా 216 అనుశాసనిక పర్వము.

# మంటలు




శ్రీ మంథా వెంకట రమణారావు

* గత సంచిక తరువాయి *

## రంగం: 3

* * రామోహోటలు-సమయం - రాత్రి 12 గం॥-హోటల్ గదిలో రెండు పెట్రోమాక్సులు వెలుగుతూ ఉంటాయి - పొయ్యలు మండుతూ ఉంటాయి - ప్రక్కనేఉన్న సినిమాహాల్ నుండి విడి రికార్డులు తక్కువస్థాయిలో విన వస్తూ ఉంటాయి మనుష్యులువచ్చి, పోతూ ఉంటారు — ఒక పెనమ్మీద దోసెలు కాలుతూ ఉంటాయి...ఒకపని వాడు దోసెలు వేస్తూ ఉండగా, రామో, ప్రక్కని నిల్చుంటాడు, ఒక్కొక్కరినీ చిరునవ్వుతో పలుకరిస్తూ; వచ్చిన జనం గందరగోళంగా మాట్లాడుతూ ఉంటారు.

1 : రెండు లైట్ టీ సాహూ!
2 : రెండు రోస్టు దోసెకూడా.
1 : నువ్వు తీసుకో...నాకొద్దు...
2 : ఈయేళొక్కరోజుకీ తినవయ్యా...
1 : యింటర్ వెల్ అయిందికదా - యింక చూసుకో వయ్యా, కథ ఎలా రంజుకడతాదో...
సాహు: (దోసెలు పెడుతూ) దోసె...
1 : టీ కూడా లే...
2 : రామో భయ్యా ... యేటయ్యా యింత అన్యాయం చేసేస్తున్నావు...
రామో: (చిరునవ్వు నవ్వి ఊరుకుంటాడు).
3 : ఉలుకూ పలుకూ లేకుండా...
రామో: ఎక్కడికి పోతాను...మళ్ళీ కల్సుకోమూ...
3 : ఆపాటి ధయిర్యమిస్తివా ... నెల కాపోతే రెండ్నెల్లు...మళ్లా కల్సుకుంటే...పచ్చిపోమూ లేకపోతే...
రామో: ఏదో అభిమానంకొద్దీ అలా అనడం-నాకన్న పెద్దలు ఉంటూ ఉన్నా...
4 : అల్లకూ నీకూ సాటేటయ్యా రామో...నీ చేతి రుచి తపస్సుచేసినా ఒస్తుందిటయ్యా...
సాహు: టీ...లైట్ టీ...
[టీ ముగ్గురుముందూ ఉంచి పోతాడు]
1 : తెల్లారకట్ల వారీ ఎక్కుస్తావటగా...
రామో: ఔను...
4 : నాకెందుకో యిచారంయేస్తుందయ్యా...
1 : ఎయ్యదా...మరి ఆ ఇడ్లీ అవీ దొరుకుతాయా...
4 : అదికాదేస్ ... దగ్గరిసుట్టం ఒదిలిపోతున్నట్టుందయ్యా...ఎంతన్నా యిసారం ఎయ్యదా...
2 : నీ శిష్యుల సంగతేటవుతాది రామో...మా యేడుస్తార్లే నా కొండెలు...
3 : మనపంగతే యిదయితే ముష్టిరౌథకలు ఆళ్ళ మాటడిగేవ్...
4 : ఓసారిదు పేడిచి మళ్లా రోడ్డుసైడు ముష్టికి పోతార్లే...
రామో: వాళ్ళగురించే నాకు మనసులో ఎంతో ఇదిగా ఉంది...
2 : కాస్లే...తేరగా తినమరిగేక ఆళ్ళకేడుపాస్తార్లే ...రోజల్లా ముష్టెత్తుకున్నా పావలాడబ్బులు దొరకవ్...
5 : (పోసుకూ) ఆ కొస బెంచీమీద కూకుందాం పద...
6 : ఆ యెదరుసుండా బాగుంటందయ్యా...

7 : యెక్కడో ఓ చోట...యీడికి ముందెక్కడయి పోయింది...

1 : బాగా యేసుకొచ్చేరు—యీ తాగుబోతోళ్ళని రానిస్తావేటి రాజో...

5 : (తిరిగి) యెవఁడా...ఏట్రా పేల్తున్నాడు...దయిర్యమయిన మొగాడెవడో ముందుకు రంఁడా... యేటంటావు రాజో...నిజవేఁనా?

రాజో : నిజఁవేఁ...అక్కడ కూచో అన్నా...

1 : ఒరేయి...తాగి ఉన్నావని కాని...పళ్ళిరగదంటును వాణ్ణొండే...

5 : (లాల్చీ చేతులు మడిచి చుట్టూ చూస్తూ) అఁ!... యెవఁడా నాయినా ఆ దమ్ములున్నాడు... పళ్ళిరగదంతాడా...పళ్ళు ... ముందుకి రాడేం మీస మున్న మొగాడు...

6 : ఆ యెగురుకుండా బాగుంటుందయ్యా...

7 : యెక్కడో ఓచోట...యీడికి ముందెక్కడయి పోయింది—

రాజో : కోపం చేసుకోకన్నా...నీ కొక్క పమొస్తే అగ్గలఁవాఁ...అక్కడ కూచో...ఏం కావాలో చెప్పు...

5 : (రాజో భుజం పట్టుకుని) నా కేఁవీఁ ఒద్దు రాజో అన్నా.. నిన్ను మాద్దాని కొచ్చేను...మూసేను ...యిగను పోతాను...

రాజో : నేనంటే ఎంత అభిమానమన్నా నీకు... మీలాటి వాళ్ళ అందరి ఆదరం ఉండబట్టేకదా ఇక్కడ నిలబడగలిగే విన్నాళ్ళు...

5 : నేను తాగేనా... నేదన్నా తాగనేదు...యిపార మన్నా యిపారం...మా అన్నెళిపోతున్నాడే అది యిపారం—సాయింత్రిమల్లా యిపారమే —ఆ సాండోడు యిది తాగు...యిపారం పోతుంది అన్నాడు...ఒద్దయ్యా అంటూంటే గటగటా గటగటా పట్టీసేరు...యిపారం పోయిందా...ఉహు...పోలేదు...రాజో అన్నా యెళిపోతున్నావా...!

రాజో : నాకు మాత్రం విచారంకాదా అన్నా... అందరం మళ్ళా కల్సుకోమూ...అప్పుడు ఎప్పుడూ విడిపోకుండా ఉందాం...

5 : అయితే యెళ్ళిపోతావా...నానారీ యెక్కావా... నానారీ తెచ్చేదా...యిపారమయ్యా యిపారం ...దుక్కం ఆపుకుండా ఉండయ్యా...నిజం ...నమ్మూ...మాడు...ఏడుస్తున్నానో నేదో సెప్పు...

రాజో : రా...రా...కూచో...నువ్వంటే నా కెప్పుడూ యిష్టమే...

1 : సాండోడు మరో అరగంటకి దుకాణం కట్టేస్తాడు...(నవ్వుతాడు)

6 : యేటీ...మేం నేకుండానా...

5 : ఘూట్...కటిస్తే కట్టేనీ...మా అన్న కన్నానా... (బెంచీ వేపునడుస్తూ ఆగి) యిక్కడుండ లేను... ఉండలేనన్నా...యిపారం పోకపోతే మళ్ళీ రమ్మన్నాడు...(బయటకి 6, 7 లతో పోతూ) ఘూట్. కటిస్తే కటేనీ...రాజో అన్నా...నీ బాకీ డబ్బు మళ్ళీ కల్సుకున్నప్పు డిస్తుంటాను...శీరాబ సెంద్రుడి సాక్షీ...తిమ్మడిమీద కోపం సెయ్యక...

రాజో: నువ్వేం నాకు బాకీ లేవ్...అది అప్పుడే తీర్చిసేవ్...

5 : యిచ్చిసేనా... గేపకం నేదు...యిపారం వల్ల మర్చిపోయేను...అసాండోడు...

[5, 6, 7 పోతారు]

1 : తాగుముచ్చు యెదవలు...

రాజో: వాళ్ళ కష్టాలు వాళ్ళకి ఉన్నాయి...

3 : ఔనౌన్లేఉంటాయి—ఆ పాకుగాడి పెళ్ళాం ఆడ్ని చితక తంతాది...

2 : ఏటి?

3 : రక్తం ఒచ్చేటట్టు తంతాది...దోస్తీగాళ్ళని తీసుకెళ్తే అళ్ళనీ తంతాది...సాంబడు సెప్పాల...

2 : యేటి సెప్తాడు సాంబడు...

3 : పూలు తెచ్చుకున్నావా అంటాది......లేదే అంటాడు...సీర తెచ్చుకున్నావా అంటాది... లేదే అంటాడు...మీసం గొరిగించుకున్నావా అంటాది...యీడికి పౌరుషం ఒచ్చి దాన్ని తంతాడు...దానికి రోషంవచ్చి,అడ్డొకటంటిస్తే యిది ఏడంటిస్తాది...కాళ్ళమీద పడి అలాగే తెస్తాన్లే నా అమ్మా రేపు అంటాడు...ఆ రేపు ...రేపే...రోజూ అంతే...

2 : మీసం ఉండి యేం లాభం...పౌరుషం లే సెనవ ......నేనైతేనా దాన్ని రకాలు కక్కించి

(టేబిలు గుద్ది) కొం(డుకొం(డుమనిపించేటట్టు చేసి మెడపట్టుక గెంటేస్తును...

8 : అయిందా...యీడికిప్పుడు దాన్పేత తన్నించుకుంటే కాని నిద్దరరాదు...యీడ్ని తంతే నే కాని వానికి నిద్దరరాదు...యిప్పుడింక తాగి... ముగ్గురూ ఆడింటి కెడతారు...!

1 : యీళ్ళ సంగతి నా కప్పుడే ఎరిక...యీళ్ళ ముగ్గుర్నీ తంతుందిరా వాయినా రోజా...

3 : అది నాకూ ఎరికే...యిది నీకెరికా? యీళ్లంతా కల్సి మాంచి కోరడా ఒకటి కొనియిచ్చేరు దానికి...

1 : మొదలెట్టేస్రేడోయి...రామో యేడీ... నాగే స్వ(రావువొచ్చిస్తా(డా బాబూ...

సాహు: డబ్బు లక్కర్లే దల్లండి......గురూగారేం పుచ్చుకోవద్దన్నారు.

2 : ఓ హో....అక(రోజనా?......మొదటే సెప్తే మరో దాసెలింగు నే...

4 : అది గేవని సెప్పవరెవ్వాయి రామోని...

1 : పదస్...పదస్...యిక్కడే మంచి రమ్ము... అంతా అప్పుడే దొబ్బిపోయేరు...

[హోటలు కాళీ అవుతుంది ఈ సరికి...రామో గదిలోనుంచి వస్తాడు వాడిపోయిన ముఖంతో ...వచ్చి కుర్చీలో కూలబడతాడు...తలరెండు చేతులలోనూ పట్టుకుని ఆలోచిస్తాడు...]

రామో: సాహు!...లాఖ్కొణో!...

[ఇద్దరూ వస్తారు]

సాహు : ఏం గురూజీ...

రామో : (ఆలోచిస్తూ) మీకు తెలుసుకదూ...?

లాఖ్కొణో : ఏఁవిఁటి తెలీడం...

రామో : నా (ప్రయాణం...

[ముగ్గురూ మౌనం]

ఏం సాహు...

[ మౌనం ]

మీ కిష్టం లేదుకదూ...

ఏం...సాహు?

లాఖ్కొణో: అంత మాటనగలమా......మీమనస్సు మారిపోతే మేమేం చెయ్యగలం...

సాహు : రామో గురూ...ఇన్నేళ్ళు లేదు గదా... ఒక్కసారిలా మనస్విరిగిపోయింది మీకు... నాకివాళ మనస్సు ఖరాబయిపోయింది. పని పోతాదని కాదు...కేముళ్లాటోరు...మీ మనస్సుకేం కష్టం ఒచ్చింది...ఎందు కొక్కసారి మనస్విరిగి పోయింది...

రామో : చూడు సాహు...మనసు విరిగిపోవడం కాదు మనస్సలానే ఉంది. నాకు కొంచెం మార్పు కావాలి...ఎన్నేళ్లయింది సాహు...జ్ఞాపకం ఉందా నువ్వే ఒచ్చేవ్ మొదట...

సాహు : గేపకం ఉంది. ఒక సాయం(తం...ఏక ధారగా వర్షం...ఒళ్ళు తెలీని జ్వరంతో పంతులు గారి గడపమీద పడి ఉన్నాను...మీరు దయ చూపెట్టే...

రామో : ఆరోజు సంగతి వదలు...నువ్వు దొరకడం నా అదృష్టం......నాకుడి భుజంగా ఉండి ఇదంతా నడిపిస్తున్న దెవరు...?

సాహు : అలా అనకండి...అంతా మీకే...

రామో : తక్కువ రోజులు...తక్కువ రోజులు...

సాహు : ఆనకొచ్చేరు లాఖ్కొణో...కారిపోయే కష్టంతో హోటలు......ఐదు నెలలు హోరా హోరిగా వర్షం...ఊళ్లో కలరా...రొక్కడ చూసినా సావు బాజాలు......(ప్రతి గంటకీ హోటల్ పక్కనించే......ఆ రొదురుగానె కొల్పడం...

రామో : టిక్కు టిక్కుమంటూ ఆ రోజులు...అకల రాలో బోయి ఉంటేనె బాగుండునని పిస్తుంది ఒకో అపుడు...

లాఖ్కొణో : నా కెన్నో సార్లలా అనిపించింది గురూజీ...దయించండి...మీలాంటి మంచోళ్లకి రోజులు కావియి...

రామో : నీకు ఆవేశం ఎక్కువ లాఖ్కొణో...ఉత్తి అమాయకుడువి...ఒక్కడివీ ఎలా నెగ్గుకొస్తావో.

లాఖ్కొణో : నాకు బయంలేదు ... నన్నెవ్వరూ ఏమీ చెయ్యలేరు...అన్యాయంచేస్తే ఊరు కోను...

సాహు : ఇప్పుడీలారీలు... (డయివర్లు......మొదట కొన్నేళ్ళు ఎడ్లబళ్ళు...రాత్రి మూడుకల్లా హోటలుముందాగేవి బళ్లు...మినపట్లు...టీ... ఈరెండే...

రామో : బండినడిపే రహీమ్ గుర్తున్నాడూ?

సాహు : అడ్డిశల్యుకుంటే గుండె ఏడుస్తాది...ఏం దయిర్యం...యేంబలం...ఛూ యీళ్ళు మడుసులా...పులితో చెయ్యికి చెయ్యి కలిపి నిలబెట్టి మొలకున్న బాకుఅందించండిరా అంటే డజను మంది మడుసులూ ఒక్క అడుగు ముందుకెయ్య లేకపోయేరు...యింక లాబం లేదని బాకుకోసం ఒక సెయ్యి ఒదిలీసరికి దెబ్బతీసింది—అయినా దాన్ని సంపి అడుసచ్చేడు...ఛూ......రొయిదవ మడుసులు...

రామో : ఆరోజులు...ఆ మనుష్యులు...ఆవర్షాలు... రోగాలు...చావులు...కొండలమించి తేలుతూ తేలుతూ వచ్చే మేఘాలు...మంచీ చెడూ తెలియని కొండవాళ్ళు...ఊరినిఏలేరాజు...

సాహు : ఆ రామోగురూ...

రామో : ఔను...ఆరామో...అందరూ...అన్నీ వేరు ...ఇప్పుడూ వర్షాలు, మనుష్యులు, మేఘాలూ అన్నీ అందరూ ఉన్నారు...ఇవన్నీ వేరు—ఆ నిర్మలత్వం లేదిప్పుడు...చావులో కూడా ఏదో నిర్మలత్వం ఉండేదప్పుడు... కట్టేసేరు...

లాఖ్కోణో : శ్మశానంలో యిల్లు

రామో : (నిట్టూర్చి) మరచిపో...అన్నీ మరచిపో... రామోని......రామోతో గడిపిన రోజుల్ని మరచిపో...కొత్తగా మొదలెట్టు...

సాహు : మీగొంతుకేటిఆలామారిపోయింది...మీమాట లింటూఉంటే బయమాతున్నది.

రామా : ఏంఏంభయపడకు—నేనుహాయిగా ఉంటాను. స్వేచ్ఛగా...ఒకమాటవినండిద్దరూ...ఆ వాడు రగిలేయి ఈ మంటలు...అలా మండుతునే ఉన్నాయి...వాటిని ఆర్పలేం...వాటిని ఆర్పలేం...నే వెళ్లేక ఎప్పట్లానే మీరు నడుపు కొండి...ఇది మీది...ఇంక...ఆ వెర్రివాళ్లని ఎప్పుడూ కనిపెట్టి ఉండండి—ఈరోజులలో ఎవడుచేస్తాడు వాళ్ళకి ధర్మం...ఉపోషాలుండి పోతారు...మన్నేనమ్ముకున్నారు...

సాహు : (రామో చెయ్యిపట్టుకుని) రామోగురూ... వెళ్ళకండి...మేం ఉండలేం మీరులేకపోతే... మీకేం చెయ్యనక్కర్లేదు...మాదగ్గరుంటేచాలు దయిర్యముంటాది...

రామో : ఎప్పుడూ మీ పక్కనే ఉంటాను...నా మనస్సెప్పుడూ మీ దగ్గరే ఉంటుంది...

లాఖ్కోణో : అలాగంటే పనికిరాదు గురూజీ...

రామో : ఒక్క మాటకి జవాబు చెప్పండి ... నేను సంతోషంగా ఉండడం మీ కిష్టమేనా?

సాహు : అదేంమ్మాట...

రామో : అయితే నే చెప్పినట్టు చెయ్యండి—బలవంతం చెయ్యకండి...ఇంక వెళ్ళండి...

సాహు : మిమ్మల్ని బండి ఎక్కించకుండా వెళతామా...

రామో : ఉదయంవరకు ఉంటా నిక్కడే......మీరొచ్చే నా ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ చేదురుగాని...ఇంక వెళ్లండి నిద్రపొండి...

[ఇద్దరూ వెడతారు......రామో హోటలు పొయ్యలకేసి చూస్తూ కూచుంటాడు...ఒక స్త్రీ దుకాణంలోకి వస్తుంది...రేగిన జుత్తు...వాడిపోయిన కళ్లు...పాలిపోయిన పెదవులు—రబ్బరు గాజులు...నలిగిపోయిన పచ్చటి చీర...మాసిన తెల్లటి జాకెట్టు]

స్త్రీ : రామో బావా...

రామో : (ఉలికిపడి చూసి) నువ్వా శోశీ...ఏం ఇంత ఆలశ్యం చేసేవ్ టీకి ఇవాళ...

స్త్రీ : ఏం చెయ్యమన్నావ్ ... తీరుబాటవుతేనా...

రామో : తెక్కనవాళ్ళరీ...

శోశి : (నవ్వి) ఆళ్ళ కూపిరే అడ్డంలేదు—

రామో : (చిరునవ్వుతో) ఏమిటివాళ విశేషం...

శోశి : ఏటుందీ...బొంబాయినించి యిజ్జనారం రొదుతున్నాయి కొత్తకార్లు ... యిరవయ్యో ... పాతికో...యిక్కడ రాత్రికాపేరు ... అవి కార్లయితే మరి డయివర్లు మడుసులుకారా? (నవ్వుతుంది)

రామో : ఆరోగ్యం జాగర్త...రోజు రోజుకీ నీరసిస్తున్నావ్...

శోశి : నాకేటయింది బావా...రాణీలాగున్నాను—

రామొ : నిజమే...నిజమే...ఎంత ధైర్యం నీది... ప్రతినిముషం దుఃఖాన్ని ఎదుర్కొంటూ నవ్వుతూ బతుకుతున్నావ్....

శోశి : దుక్కమెందుకు బావా...మా పెద్ద కష్టమొస్తే చస్తాం ... అంతేనా ... చెప్పు ... అంతకన్న

పెద్దకష్టం వాలాటివానికి ఏటొస్తుంది...చావ
డానికి నాకు బయంలేదు...మరింక దుక్క
మేటి...హాయిగా నవ్వుతూ ఉండక...

రామో: నీ మనసే నాకుంటే నా బతు కింకోలా ఉండును...

కోశి: యివాళ గొప్ప యిసారంగా అగబడుతున్నావ్.

రామో: విచారమే కోశి ... నా వంటి పిరికివాళ్లకి బతుకులో విచారంకాక ఇంకేముంటుందే...

కోశి: మా రాజులా ఉన్నావ్...నీకేటయింది.

రామో: నాకిది ఇలా కావాలి... నే ఇలా ఉంటాను అని బతుకునుండి అడిగేందుకు ధైర్యంలేక ఏవో బలహీనతలకి లొంగి, పొరపాట్లు ... నేరాలు చేసినవాడు మారాజులా కనిపిస్తే మాత్రం ఎందుకు...

కోశి: నాకేం బోధకాదు... నువ్వెందుకో యివాళ అదోలా ఉన్నావ్...

రామో: అగూట్లో నీ గ్లాసుంది తెచ్చుకో... టీచేసి పోస్తాను.

కోశి: నీకెందుకులే కష్టం యిప్పుడు...

రామో: తెచ్చుకో కోశి...నిమిషం పట్టదు... టీ లేందీ నిద్రపోలేనని నువ్వే అన్నావ్ ఎన్నో సార్లు—సుఖంగా నిద్ర కూడా లేకపోతే ఇంకెందుకు?

కోశి: (గ్లాసు తెచ్చుకుంటూ) నే చెప్పినట్టుండు బావా ... హాయిగా ఉంటావు ... పాపంటే బయమా...?

రామో: ఆ ఒక్క భయమే లేదు...

కోశి: మరింకేం...హాయిగా నవ్వుతూ ఉండు... తక్కిన వన్నీ ఏం కష్టాలు...ఆలోచించకు...

రామో: గ్లాసు పట్టు...

[టీ పోస్తాడు]

అలానే కానీ ... రేపట్నుంచి అలానే ఉంటాను...ఎప్పుడూనవ్వుతూ నే ఉంటాను...

కోశి: (తాగుతూ) నిన్ను చూస్తే నాకెప్పుడూ యెందుకో జాలేస్తాది... రామో! నువ్వు పనికి రానోడివా...నువ్వు అమాయకుడిలా గుంటావ్...ఎవళ్ళన్నా నిన్ను సులబంగా మోసం చేస్తారు... అలా చూడకు నే నిజం చెప్తున్నాను...

రామో: (మంటలకేసి చూస్తూ) మనిషిలోని పశుత్వానికి రోజూ తిలవంచి, దయ, జాలి ఎరగని నువ్వు నామీద చూపెట్టే జాలి ఎంత విలువయినదో నాకు తెల్సు ..ఈ...ఆఖ్రరోజున అంతకన్న ఏం కావాలి?

కోశి: ఆఖ్రరోజేటి బావా...

రామో: తీర్థ యాత్రలకి పోతున్నాను ... ఎన్నో పాపాలు చేసేను...వాటికి ప్రాయశ్చిత్తం... దుకాణం ఉంటుందిలే ... పాహు వదుపు తాకు...టీకి ఒస్తూ ఉండు...

కోశి: అదా సంగతి...అందుకా అలా ఉన్నావ్... పూరీ యెళ్తే వుకి ప్రసాదం పట్రా...మరిచి పోక...దరిద్రగొట్టోళ్లం... ఎన్నో పాపాలు చేసేం...దేముడి దర్శనం మాకెక్కడు... ప్రసాదమన్నా దొరికితే—

రామో: ఎప్పుడూ నవ్వుతూ ధైర్యంగాబతికే నీకెందుకు భయం...దేవుడు మీ వేపే ఉంటాడ్లే... ఏదో మనస్సుతృప్తికి మేంచేస్తాం తీర్థయాత్రలు. ...నువ్వు నమ్మినట్టు మేం నమ్మగలమా దేవుడ్ని.

కోశి: యెడతా బావా...మరిచిపోమాక...

రామో: లేదు...మరిచిపోను...

[కోశి వెళ్లిపోతుంది...రామో వీధిగది మూసేస్తాడు...ఒంటరిగా పచారుచేస్తాడు, గది ఈ కొసనుండి ఆ కొసకి- మండుతూఉండే పొయ్యిలని పరిశీలనగా చూస్తాడు- బల్లల్ని బెంచీలనూ ఒకసారి తడివిచూస్తాడు...శారద ప్రవేశిస్తుంది సడిలేకుండా...రామో ఆమెవేపు తిరిగి నిదానంగా ఆమెను చూస్తాడు...]

రామో: రా...శారదా—కూచో...

శారద: కోరి ఆహ్వానిస్తున్నారు...

రామో: నీతో మాటాడాలి శారదా...కూర్చో...

శారద: (కూర్చొని) ఏమిటో...?

రామో: (తత్తరపడుతూ) శారదా...ఇన్నాళ్లూ లేకపోయింది నాకు ఆ శక్తి...శక్తికాదు...ధైర్యం ...నిజా నిజాలని ఎదుర్కొనే ధైర్యం...

శారద: ఇదివరకు లేని శక్తేమిటి...ఇప్పుడు వచ్చిందేమిటి?

రామో: నిజా నిజాల్ని ఎదుర్కొనేందుకు నాకిప్పుడు భయంలేదు...

శారద: (చిరునవ్వు నవ్వుతూ) అదేనా చెప్పదల్చు కున్నది...

రాము: అదే...అదే...కాదు...అది కాదు... అన్ని సంగతులూ ఉన్నవున్నట్టు నీతో మాట్లాడాలని ఉంది...

శారదా: నాకు తెలీనివా ?

రాము: కాదు...

శారద: నేను చేసిన పొరపాట్ల గురించా...

రాము: కాదు...

శారద: నే చేసిన్నా పొరపాట్లు చేసేనని మీకు వేసిన అనుమానాల గురించేమో...

రాము: అవునూ... కాదూ...అని చెప్పలేను...అన్ని సంగతులూ...

శారద: అవునూ... కాదూ అని చెప్పలేరా....ఔను, తెల్సు...తెల్సు...ఏ విషయం మీద ఇంత అను మాన పడుతున్నారో...

రాము: కాదు...శారదా...కాదు...

శారద: ఎన్నేళ్ళయి దాచుకున్నారీ అనుమానాన్ని... ఎంగిలి తీర్చుకోలేక పోయేరు.

రాము: ఏ అనుమానం శారదా...ఏ అనుమానం.

శారద: ఏం అనుమానం? అదే...అదే...గోపీ చావుకి నేను కారణమే నేమోనని మీ అనుమానం... ఔనా...ఔనా...(నవ్వి ఔనా...ఒప్పు కుంటారా? ఔనండి...అదుగో మీ ముఖం చెపుతోంది...మీ కళ్ళు చెప్తున్నాయి.

రాము: (పీడుకుపడ్డట్టయి) శారదా...శారదా...ఎంత శిక్ష వేసేవ్...ఎంత నీచమైన జమ కట్టేవ్ నన్ను!

శారద: క్షమించలేరు కదూ...మీరంతా పూజ్యులు ఉదార స్వభావులు... నేను పనికిమాలినదాన్ని... దయ ఉంచి మీ భార్యగా నన్ని గౌరవ హోదా లోకి తెచ్చేరు...అందుకు నా చర్మం మీకు చెప్పులు కుట్టిఇవ్వడం పోయి మిమ్మల్ని నీచ పరుస్తున్నాను...మీకు శాంతి లేకుండా చేస్తు న్నాను... నేను రాక్షసినీ...

రాము: (పిచ్చివాడులా ఇటూ అటూ తిరుగుతూ) భగవాన్...భగవాన్...ఎందుకు నాకీ పరీక్ష... శారదా...ఊరుకో...ఊరుకో... నేను దీనికి తట్టుకోలేను...నీకు పుణ్యం ఉంటుంది...

శారద: తట్టుకోలేరూ...(లేచి) అయితే దీనికి తట్టు కోండి...గోపీ చావుకి నేనే కారణం... విన్నారా?

రాము: నువ్వా...నువ్వా...నువ్వు కాదు... నేను నమ్మను...నమ్మను.

శారద: నమ్మరూ? ఎంత నటన...నమ్మేరు...అదేమీ అనుమానం....ఇన్నాళ్ళూ...మిమ్మల్ని వేధి స్తున్న అనుమానం....

రాము: కాదు...కాదు...ఎప్పటికీ నేను నమ్మను. ఎంత సేవ చేసేవ్. రాత్రనక పగలనక ఎంత ప్రేమగా చూసేవ్!

శారద: సేవ చేసేను...ప్రేమగా నే చూసేను...కాని నేనే కారణం...విన్నావా... నేనే.

రాము: నువ్వు ఎంతన్నా నేను నమ్మను...

శారద: నమ్ముతావు...నన్ను నమ్మిస్తాను...ఇప్పుడు నన్నొక పిశాచంలా ఎలాగూ చూస్తున్నావ్... మరింత భాగ్యపడు ..బ్రహ్మరాక్షసిలా చూడి ప్పుడు....

రాము: నీకు మతిపోతోంది శారదా ...

శారద: ఏం? నా కన్న కొడుకా గోపీ ... ఎందుకు నేను చూడాలి ప్రేమగా...నీకు ప్రేమ ఉంది కామోసు పెంచుకున్నావ్...నా కెందుకు... ఎక్కడ్నుంచి ఎరువు తెచ్చుకునేది ప్రేమ... అది ఆ నాడే ఇగిరి పోయింది...ఇంకిం చెసేయి మంటలు....

రాము: గోపీ అంటే ప్రేమగా చూసేవ్...తల్లిలా పెంచేవ్ నాలుగేళ్లు. ఆనక ఆ జబ్బు వచ్చి ...

శారద: ఉంటే ఉంది ప్రేమ...అందరికీ పంచి పెట్టాలని ఉందా...(పిచ్చిదాన్లా అయి) దాచుకున్నాను. జాగర్తగా తాళం వేసి దాచుకున్నాను. నా రక్త మాంసాలు పంచుకో నేవారి కోసం... గుండె లోతులలో పాతేసి దాచుకున్నాను... కాని...నువ్వు రగిల్చేవ్...చిమ్ము...మంట... జీవితాంతం ఒకే ఒక మంటగా మండేమంట... ప్రేమ, గుండెలోతులలో, ఉన్నదున్నట్టు ఇగిరి పోయింది...ఇంకిపోయింది...మోసం...దోపిడి ఇల్లు అంటించి...మంటలంటించి...దోపిడి...

రాము: (శారద భుజాలు పట్టుకుని కూర్చొపెట్టి ఆమె తల గుండెల కానించి) శారదా...శారదా...

నాకు తెల్సు నీ బాధ...నీ ఆవేదన...నువ్వు క్షమించవు...క్షమించలేవని నాకు తెల్సు...కాని...కాని.

(మగతలో)

శారద: పంచిపెట్టాలని ఉందా... సేవచేసేనే...రాత్రనకా పగలనకా...

రామో: ఎవరు కాదన్నారు...కన్నతల్లి కూడా చూపలేని ప్రేమ కదా నీది శారదా...

శారద: లేదు...నాకేం ప్రేమ లేదు...ఇంకిపోయింది.. ఊసుపోక చేసేను సేవ...ఊసుపోవాలా?... ఊసుపోవాలా ఒద్దా...ఏం? చెప్పు...

రామో: (తల విదుపుతూ) ఔను...శారదా...ఔను.

శారద: (గబుక్కున లేచి) నిద్రాహారాలు మాని... (ముఖం తిప్పుకుని మగతగా) నేనూ మనిషి నేనా?...(మగతగా) నాకూ తిండీ నిద్రా కావాలా?...ఆరోజు నిద్రపోయేను...అలా మందుమింగు...డాక్టరు మరీమరీ చెప్పినరోజు నిద్ర ఎన్నెలా ఆవరించింది!...ఎలా నిద్రపోయేను!...మందు ఇవ్వకపోవడం నాది తప్పా?... నిద్ర నాకెందుకు రావాలి ... నేనూ మనిషి నేనా...నాకూ తిండీ నిద్రా కావాలా? నమ్మరు ఏళ్ళ తరబడి అనుమానాలు...

రామో: (లేచి) శారదా...నీకు చేసిన అన్యాయానికి నేనేం చేసినా ఆలోటు పూర్తికాదు...నే నెప్పుడూ ఏ అనుమానమూ పడలేదు. ఇప్పుడు కూడా ఏ అనుమానం లేదు...లేదు శారదా...

శారద: (మొదటిలోనే) అనుమానాలు...ఏళ్ళతరబడి; నిజమేనండీ......నేనే కారణం ... ఎందుకు కాకూడదూ?... నేను కన్నబిడ్డా? కోరి నిద్ర పోయేను...నిద్రపోవాల నే ... నిద్రపోవాల నే నిద్రపోయేను ... ఎందుకు ధారపొయ్యాలి నా సర్వస్వం... నా వాడు కాని వాడికి...

రామో: ఒక మాట విను శారదా... ఎంత సేవచేసినా ఎన్ని మందులిచ్చినా గోపీ బతక్కపోను... ఎందుకలా బాధపడతావ్ ?

శారద: అయితే నువ్వు నమ్ముతున్నావన్నమాట... నేను అశ్రద్ధగా నిద్రపోయేనని నమ్ముతున్నావన్నమాట... అయ్యో! అయ్యో! వీళ్ళందరికీ నామీద ఏం హక్కుంది... నా ప్రేమని బలవంతాన పుంజుకు నేందుకు వీళ్ళకేం హక్కుంది. వలలో చేపని పట్టినట్టుపట్టి... ఒళ్ళు... మనస్సు శక్తి... ప్రేమ... అన్నీ పిలికి దోచుకుంటారా?... పంచుకుంటారా? ఓయి దేవుడా!

[బెంచిమీద కూలబడి టేబిల్ మీద ముఖం పెట్టి కళ్ళు మూసుకుంటుంది.]

రామో: (స్తబ్ధుడయి నిల్చుంటాడు...ముందుకు అడుగు వేసేందుకు ధైర్యంలేక... శారద చలనం లేకుండా ఉంటుంది... దగ్గరికి వెళ్ళి శారదని తట్టి) శారదా... శారదా...

(శారదలో చలనంలేదు...) శారదా... (ఆమె నాడిచూసి బెంచీమీద పడుకోపెట్టి ఆమె వేపు ఆందోళనగా చూస్తూ నిల్చుంటాడు... వీధి తలుపు చప్పుడు... రామో తలుపుతీస్తాడు. రామ్మూర్తిపంతులు వస్తారు...)

రామ్మూర్తి: (శారదను చూసి గాబరాపడి) ఏమిటయింది... ఏమిటయింది రామో ?

రామో: గాబరాపడకండి... ఆవేశం ఎక్కువయినప్పుడు ఫీట్సులా ఒస్తుంది... కొద్ది సేపట్లో పోతుంది... రండి... కూచోండి...

రామ్మూర్తి: ఇదంతా చూస్తూఉంటే రామో... నీ ప్రయాణం కొద్దిరోజులు వాయిదా వెయ్యకూడదా అనిపిస్తున్నది...

రామో: మీరే అలా సెలవిస్తున్నారా పంతులు గారూ ?

రామ్మూర్తి: అదే చెప్పేందుకు వచ్చేను రామో... ఏదో ఆవేదన పట్టుకుంది నిన్ను వదిలి వెళ్ళినప్పటినుంచి...

రామో: సర్వం మీకు తెలుసుకదా...

రామ్మూర్తి: తెల్సు... తెల్సు... నువ్వు లేకుండా ఉండడం అంటే ఊహించుకోలేకుండా ఉన్నానయ్యా...

రామో: లోటు ఉంటుంది పంతులు గారూ...సాహూ వాళ్ళు నడుపుకుంటారు... వాళ్ళని కాస్త కనిపెట్టి ఉండండి...

రామ్మూర్తి: ఇది చూసేక కొద్దిరోజులు ఆగమని నొక్కి చెప్పాలని ఉంది రామో...అందరికీ మంచిది...

రామో: ఒక్క నిమిషమున్నా ఓర్చడం కష్టం పంతులు గారూ...నా మనస్సు ఏ స్థితిలో ఉందో భగవంతుడికి తెల్సు...

రామ్మూర్తి: ఒత్తిడి చెయ్యడం లేదు నేను...బాగుంటుందేమో అన్నాను...

రామో: క్షమించండి పంతులుగారూ...ఇంకోలా అనుకోకండి...

రామ్మూర్తి: (నిట్టూర్చి) సరే...అదీ మంచిదే... ప్రయాణం మూడు గంటలకేనా...?

రామో: తెల్లవారేక...మీరంతా రానిదీనా... పంతులుగారూ ఒక ముఖ్యమయిన మాట చెప్దామని మిమ్మల్ని రమ్మన్నాను—మీవల్ల నాకొక సహాయం కావాలి....

రామ్మూర్తి: తప్పకుండా...రామో...తప్పకుండా...

రామో: నాకు తండ్రిలాంటివారు...శారదని మీకు ఒప్పచెప్తున్నాను...ఆమెభారం అంతా మీది...

రామ్మూర్తి: (ఆశ్చర్యపోయి) రామో...చాలా పెద్ద భారం వేసేవ్...

రామో: కాదనకండి...

రామ్మూర్తి: నా కభ్యంతరం లేదు...కాని ఆమె...

రామో: శారదకి మీ మీద గౌరవం లేదనుకోడం పొరపాటు...గ్రహించేరా పంతులుగారూ...

రామ్మూర్తి: (ఔనన్నట్టు తల ఊపుతాడు.)

రామో: కొత్త ఇంటికి మార్పించండి. మనసొప్పక ఇదే ఇల్లు చేసుకున్నా నిన్నాళ్ళూ...డబ్బు మీ పేర ఉంచేను...

రామ్మూర్తి: ఇదేం విడ్డూరమయ్యా రామో...

రామో: అడ్డు చెప్పకండి పంతులుగారూ...మీరున్నన్నాళ్ళూ ఆ భారం అంతా మీదే...ఆవక భితగదేర్చ...ఆమెకి ఏలోటూ రానీకండి....

రామ్మూర్తి: రామో...పెద్ద భారం వేసేవ్...ఏదన్నా సరే నువ్వు మాత్రం విచారం పెట్టుకోకు...నే నంతా చూసుకుంటాను...నిర్విచారంగా ఉండు...

రామో: మీ మేలు ఏనాటికీ మరిచిపోలేను...నన్ను జ్ఞానవంతుణ్ణిగా చేసింది మీరే...మిమ్మల్ని వదలడమంటే ఎంతో బాధగా ఉంది—

రామ్మూర్తి: మరోవిధంగా ఆలోచిస్తే, నేనే నీ బతుకులో అడుగు పెట్టకపోయి ఉంటే నీ మానసిక పరిణామం ఇలా ఉండకపోను...అప్పుడు నీ జీవితం మరో మాదిరిగా ప్రశాంతంగా ఉండి ఉండునేమో...

రామో: మీరలా అనడం ధర్మం కాదు...నాకు చాలా బాధ కలుగుతోంది...

రామ్మూర్తి: నా మాటలు పట్టించుకోకు...నే నెప్పుడూ నీ శ్రేయోభిలాషినే...

[శారద కదుల్తుంది]

రామో: (లేచి) ఆవిడ్ని చూడు...నే వెడతాను... ఉదయం ఉంటావుకదూ...కలుస్తాను...

[శారద లేస్తూ ఉంటుంది...రామ్మూర్తి పంతులు వెడతాడు.]

శారద: (లేస్తుంది—లేచి నాలుగువేపులా కలియజూస్తుంది)

రామో: (లేచి దగ్గరగావెళ్ళి చెయ్యిపుచ్చుకుని) ఎలా ఉంది శారదా.

శారద: (అతనివేపు చూసి ఊరుకుంటుంది.)

రామో: ఉత్తినే ఆవేశపడ్డావ్... వెళ్ళు... పడుకో...రెండు దగ్గరౌతున్నది...

శారద: (అడ్డంగా తల ఊపుతుంది)

రామో: నామాట వినవ్ ?...విశ్రాంతి అవసరం నీకు...వెళ్ళు...

శారద: వెళ్ళను...

రామో: ఇంతిరాత్రివరకూ మేలుకోడం మంచిది కాదు...

శారద: ఇదేకాదు మొదటిరాత్రి మేలుకుందుకి...

రామో: బతుకులో ఎన్నో పొరపాట్లు జరుగుతూ ఉంటాయి...నేను నేరం చేసేను...కాని సరిదిద్దుకోనేందుకు అవకాశం లేదు...ఎన్నిసార్లన్నా నిన్నడుగుతాను క్షమించమని...

శారద: అడగకండీ...ఆడదాన్ని...

రామో: నువ్వామాట అన్నంత వరకూ నాకు శాంతి లేదు...ప్రతిరోజూ...ప్రతినిమిషం...రాత్రీ... పగలూ....ఇన్నేళ్ళూ నామనస్సు నన్ను శిక్షిస్తూనే ఉంది...శారదా...మరాబాధ ఓర్చుకోలేను...

శారద: నేనే ఆమంటని...కాలుస్తున్నాను... కాదా ?

రామో: ఏదో ఆవేశంలో అన్నమాటని అలా అర్థం చేసుకోకు శారదా....

శారద: మరెలా అర్థం చేసుకోమంటారు...

రామో: నీలోరేగిన అశాంత్యగ్నికి...అశాంతికి కారణం నేనన్న బాధ నన్ను దహిస్తోంది...శారదా...

రామేమనస్సు: (లైట్లరంగు మారుతుంది పచ్చగా) ప్రపంచాన్నీ దాని అందాన్నీ గ్రహించి ఆనందించగలిగే...జ్ఞానం సంపాదించి అది వెదజల్లగలిగే... నేను అంతమయాక నారూపాన్నీ... నా ఉనికినీ తనలో ఇముడ్చుకుని నన్ను తనలో పునర్జీవితునిగా చేసుకోగలిగే...నా ఆశయాల... ఆవేశాల...ఆకాంక్షల ప్రతిరూపం...వెనుక వదిలి వెళ్ళేందుకు చిత్రం...సృష్టించే శక్తి లేదని ప్రతినిముషం నాకు జ్ఞాపకంచేస్తూ... నువ్వు...నామనసునీ...నన్నూ దహిస్తూ...

(లైట్లు మామూలు రంగుకి వస్తాయి)

శారద: తెలివిలేనిదాన్ని...నాకన్ని అర్థాలు తెలియవ్...

రామే: ఎలాగైనా అర్థంచేసుకో శారదా...కొంత సానుభూతి చూపు...

శారద: అప్పుడు మీకు మనశ్శాంతి దొరుకుతుందా.

రామే: దొరుకుతుంది.... దొరుకుతుంది....

శారద: దొరుకుతుంది...అప్పుడు ఆహా ... ఇంక ఏం అడ్డున్నాయి. ఇంక అంతా శాంతి, స్వేచ్ఛ అని రెక్కలు పట...పట ఆడించి ... కూతకూస్తూ ఎగిరిపోతారు.

రామే: శారదా మళ్ళీ అదేవరసా.

శారద: స్వేచ్ఛగా ఎగిరిపోతారు. నాకుమ దొరికిపోయిందికదూ...ఇంక నేను ఈ మంటలలో పడి కాలి...కాలి బూడిదయినా...నా కెక్కడిది సానుభూతి ... నన్నెవరు ఓదార్చేది ... నా రోదన ఎవరు వినేది...ఔను ... నాకేం హక్కుంది... నేరమా పొరపాటా...కాదు... కాదు. అడదాన్ని...బానిసని.

[లేచి నిల్చుంటుంది]

రామే: శారదా...శారదా...ఆవేశపడకు...నామాట విను...కూర్చో.

[కూర్చుండబెడుతూ]

ఆవేశపడకుండా విను ... నామనస్సులోనిది చెప్పనీ ఈ ఆఖ్రరోజున...

శారద: ఆఖ్రరోజా ... ఏ ఆఖ్రరోజా ... ఎవరికాఖ్రరోజు...

రామే: ఇక్కడి నా ఆఖ్రరోజు...

శారద: అదుగో...అదుగో...మరి నేను క్షమించడం ఎందుకు ... నాఓదార్పు లెందుకు ... అంతా నిశ్చయించేక ... నేను కాదన్నా ఔనన్నా వెళ్ళేందుకు తయారుగా ఉన్నాక...

రామే: నువ్వు క్షమిస్తావని తెల్సు శారదా...

శారద: (ఉద్రేకంతో లేచి) నువ్వు మనిషివే?...క్షమిస్తావని నీకు తెల్సా?.... తెల్సు...క్షమిస్తానా? ...క్షమించేను...ఇంక వెళ్ళు...వెళ్ళిపో!

రామే: శారదా...ఆవేశపడకు నామాటవిను...

శారద: వెళ్ళు... వెళ్ళిపోఇంక నీకుస్వేచ్ఛ ... బంధాలన్నీ తెగిపోయేయి...వెళ్ళు...నాముందునుంచి వెళ్ళు... ఒక్కనిమిషమున్నా ఉండకు...

రామే: (తల దించుకుని) నీకాళ్ళు పట్టుకుంటాను... నన్నలా ఒకదోషిలా చూడకు...అలా చూడకు

శారద: ఒద్దు ... ఏమీఒద్దు ... క్షమించేనంటే నీకు తృప్తికదూ... సరే ... అన్నాను ... వందసార్లంటాను...వెళ్ళిపో...వెళ్ళవేం...

రామే: నన్నెందుకంత హీనంగా చూస్తావ్...?

శారద: ఆ నేరంకూడానా .. ఆ నేరంకూడానా...?

రామే: ఆ ఒక్క పొరపాటుకే...నన్ను దోషిగా చూడ్డం న్యాయంకాదు శారదా...మనలాటి వాళ్ళు ఎందరు లేరు...ప్రపంచంలో...నీ కన్ని విధాలా తృప్తి కలిగేందుకు ప్రయత్నించేను... లేదనగలవా?

శారద: వెళ్లండి...వెళ్లండి బాబూ! వెళ్లండి...!స్వేచ్ఛ వెతుక్కుంటూ పొండి.

రామే: అసాధ్యమైన కోరికను మనసులో పెట్టుకుని నన్ను ఇన్నేళ్ళూ ద్వేషించావ్. నన్ను దోషిగా చూసేవ్ ...ఔను...ఔను... నేను కారణం. నిజమే. నామట్టుకు నేను పశ్చాత్తాపపడి బాధపడ్డాను. నీ బాధ...నీ ద్వేషం చూసి అనుభవించి మరింత బాధపడ్డాను. కాని శారదా... దీనికి ఒక కొస...అంతం అంటూ లేదా? జీవితాంతం ఇంతేనా? బూడిదయాకే శాంతి దొరకాలా?...

శారద: ఎంత సులభంగా విడమర్చేసేరు...నన్ను కాలుస్తున్న ఈ సెగ చల్లారిందా?

రామే: అన్యాయంగా మాట్లాడకు శారదా...ఇన్నేళ్ళయి ఎందుకు భరిస్తున్నా నీ మంటలవేడి... ఎందుకు ఓరుస్తున్నానీ బాధ...

శారద: (పిడికిలి బిగించి) అందుకు నేను క్షమించాలి, సానుభూతి చూపాలి...ఎందుకు పడుతున్నారు బాధ? కేవలం మీ కోరికలకి లొంగి తెల్సి తెల్సి

నన్ను ఈ కౌగిలిలోకి తోసేరు కాబట్టి...అది మీరే...మీరే అందుకు కారణం...అన్యాయం మీరే చేసిందని చూపుతూ...నాలాటి ఒక అభాగ్యురాలు...మీ రక్తం పంచుకొని ఒక జీవి ఇప్పుడు తృప్తిగా ఉన్నారు కాబట్టి...అందుకు పడుతున్నారు బాధ...మీకు తప్పించుకుందుకి వేరుమార్గం లేదు కాబట్టి...

రామో: (తల రెండు చేతులతోనూ కొట్టుకుని) అమ్మా!!...

[ఒక్కసారిగా శారద పాదాల మీదపడి]

నీచుణ్ణి! పాపాత్ముణ్ణి! స్వార్థపరుణ్ణి! ఐనా మనిషిని! సాధారణమైన మనిషిని...క్షమించు మాతృమూర్తీ!...క్షమించు...

శారద: (వెనక్కి అడుగులు వేసి) ఛీ!...ఛీ!

రామో: (అలానే ఉండి) ఈ ఆఖరు ఘడియ...ఈ ఆఖరు ఘడియలో నాకో మాత్రం శాంతినియ్యి. క్షమించు!

శారద: (గట్టిగా) ఆఖరు ఘడియా...ఆఖరు ఘడియా. ఎక్కడికి పోతావ్...స్వేచ్ఛా...స్వేచ్ఛా? నీకు స్వేచ్ఛ కావాలా... (క్షీణంగా) స్వేచ్ఛ కావాలేం... కాళ్ళ నమకున్నావా కాళ్ళమీద పడేందుకు...శక్తి నమకున్నావా?...

[రామో లేస్తాడు...అతనితల రెండు చేతులతోనూ పట్టుకుని కళ్ళు పెద్దవిచేసి] ఔను...శక్తినే...శక్తిని...నిన్ను వెన్నంటే ఉంటాను. నా శక్తి...నా మనసు...నిన్ను వెన్నంటే ఉంటుంది...వాటి మంటలు నిన్ను దహిస్తూనే ఉంటాయి. ముక్తి కావాలా? ఎక్కడ దొరుకుతుంది...నాకూ కావాలి స్వేచ్ఛ...ఇవ్వగలరా. ఇవ్వగలరా...ఈ రాతిబొమ్మలో మనస్సు పాతుకపోయింది...దానికి దారి చూపండి... (జుత్తు మరింత విరబోసుకుని) శక్తిని...కాలుస్తాను...మసిజేస్తాను...బూడిద చేస్తాను...

[ఆమె తూలుతూ లోనికి పోతుంది...రామో కళ్ళెంట నీరు కారుతూ ఉంటుంది...పిచ్చివాడిలా నాలుగు దిక్కులా చూస్తాడు. హోటలు నాలుగు మూలలా తిరుగుతాడు. మంటలముందు ఆగుతాడు...మండే మంటల్లోకి చెయ్యిపెట్టి ఉంచేందుకు ప్రయత్నించి చెయ్యి వెనకకు లాక్కుంటాడు...]

రామో: ...మంట...కాల్చదూ?...[వెళ్ళి కుర్చీలో కూచుంటాడు తలపట్టుకుని]

మంట...కాల్చదూ...

[జేబులో చెయ్యిపెట్టి ఆలోచిస్తూ ఉంటాడు. గబుక్కున చిన్నసీసాతీసి మూతవిప్పి నోట్లో ఒంపుకుని టేబిల్ మీద పడిపోతాడు... దూరాన వినిపిస్తూ ఉంటుంది మూడు గంటల శబ్దం...వీధి కుక్కలు మొరుగుతూ ఉంటాయి. అంతా నిశ్శబ్దం...సర్వం నిశ్శబ్దం...కొంత సేపటికి...శారద ప్రవేశిస్తుంది....సగం దీపాలు ఆరిపోతాయి...రామో పక్కకివచ్చి నిల్చుంటుంది...చెయ్యివేసి కదుపుతుంది...చలనం ఉండదు...మరింత గట్టిగా కదుపుతుంది...చలనం ఉండదు...ఆమె ఆ ప్రక్కని కూలబడుతుంది...క్రిందపడ్డ సీసాతీసి చూస్తుంది... కళ్ళు కప్పుకుంటుంది......]

శారద: ఇదా...ఇదా...స్వేచ్ఛ...ఎగిరిపోయేవ్... ఎగిరిపోయేవ్. లేదు...నీకు స్వేచ్ఛలేదు... లేదు...

[తీవ్రంగా గాలివీస్తూ తలుపు చప్పుడవుతూ ఉంటుంది]

శారద మనస్సు: (లైట రంగులు మారుతాయి) నాలో పుట్టి...పొంగి...పారే...ప్రేమ...వాత్సల్యం...ప్రశాంతత లోనుండి...నా మనసు అందాల ప్రతిరూపం—ఆ అమాయకత్వం...ఆ అందాలలో ఏకమై బాహ్యాన్ని మరవగలిగే చిత్రం—నాకు లేకుండా చేసిన నువ్వు...నా మనసులో చిచ్చుమంటలు రగిల్చిన నువ్వు......

[లైట్లు మామూలు కాంతికి వస్తాయి... శారద సీసా నోటిదగ్గర పెట్టుకుని పడిపోతుంది టేబిల్ మీద... లైట్లు ఆరిపోతాయి...చిన్న కాంతి తప్పితే... గాలి ఉధృతంగా వీస్తూ ఉంటుంది...]

పురుషకంఠం: సన్నగా నాజూగ్గా ఒక కుర్రవాడు... దబ్బ పండులా మిసమిసలాడుతూ... చురుకైన కళ్ళు...మంచితనం అణకువ..దయ...నిజం.. ఆ మనిషి రక్తంలోని పాళ్ళు...

స్త్రీకంఠం: చల్లగా...హాయిగా పక్షిలా ఎగిరిపోతావ్ కదూ... రెక్కలున్నా ఎగరలేని పక్షి... తృప్తిగా కళకళా... మెరుస్తూ... పకపకా నవ్వుతూ అపంజరంలో ఉంటుంది కదూ... చెప్పు...పక్షులలో అలా జరుగుతుందా?

మరొక పురుషకంఠం: ఓడిపోయే నోడిపోయేను... స్వేచ్ఛా బానిసత్వాల మధ్యనలిగి...

[తెర]

# దూతమత్తేభము

క ళా దా స

* గత సంచిక తరువాయి *

భవదాప్యాయన సంగతిన్ పులక లెత్తన్ ప్రౌఢపుష్పప్రస
న్నములో నీపము లొప్ప 'నీచగిరి' సేదల్ తీర్చుకొమ్మందు లో
యలవేశ్యాసుఖతల్ప గుంఫిత సుగంధంబుల్ గుబాళించు, త
న్నగరీవాసుల యౌవనాభిరత భోగౌద్ధత్యముల్ తెల్పుచున్.

తమ చెక్కిళ్ళు చెమర్చినన్ తుడువ కర్ణేందీవరచ్ఛేదముల్
కమలెన్ పువ్వుల నమ్ముకొమ్మలకు, ఛాయాదాతవై తన్ముఖ
క్షణమైత్రిన్ సుఖమందిపొమ్ము; వనకుల్యావాటికన్ మొల్ల మొ
గ్గల ప్రోత్సహింపుము క్రొత్తనీటి చిదురల్ పైజల్లి విశ్రాంతిగా.

పెడగా పోవును గాక యీపథ ముదీచీగామి వౌనీకు, ఉ
జ్జయినీ సౌధసుఖానుభూతులకు మారొమ్మ మీకుమీ! జన్మమే
విఫలంబౌను, నటత్ తటిత్ చకిత లోలాపాంగ మంగల్య మా
ల్యములో పౌరనితంబినీ నయనసాంగత్యం బుపేక్షించినన్.

తరగల్ త్రుల్లగ కూజితంబులగు హంసల్ మేఖలామాలగా,
సుడిబొడ్డేర్పడ జాఱుచున్ సుభగవై 'నిర్వింధ్య' నీ దారిలో
కలియన్ వచ్చు, రమింపు మింపుగ రసాంతరోద్భగివై,—చేష్టితం
బులెగా నెచ్చెలు లిష్టవల్లభులపట్లన్ చూపు భావార్థముల్—

జడగా పొందిన అంతరాళ తను ధారావారితోడన్, తటీ
తరులన్ జాఱెడి యెండుటాకుల వివర్ణచ్ఛాయతో దీర్ఘ దు
ర్విరహావస్థను వెల్లడించెడి నహో నీ భాగ్య! మేతత్ తను
జ్వర సంశోషణ మెట్లుతీఱు? నది నీవైకూడి తీర్పందగున్.

అటుపై చేరుము వత్సరాజ కథనార్థాభిజ్ఞులౌ గ్రామ వృ
ద్ధు లధిష్ఠించు అవంతిమండల విశాలన్ శ్రీ విశాలాపురిన్—
అది యొక్కం డలరున్—పురాసుకృతముల్ క్షీణించిపో—స్వర్గ
సులు దోతెచ్చిన పుణ్యశేషమన భూమిన్ కాంతిమత్ఖండమై.

దివసోషస్సుల విచ్చు తామరల పుష్పాళ్ళఁ సుగంధంబులై
కలహంసీమదమంజు కూజితములఁ దూరంబు గొంపోవుచుఁ,
రతులఁ సొక్కిన భామినీ సుభగ శోభాంగానుకూలంబులై—
ప్రియ యాచ్ఞా చతురోక్తులట్టు—లోలయుఁ శిప్రా సరిద్వాతముల్.

విపణి శ్రేణుల రాసులై మెఱయు సచ్ఛంబైన ముత్యాల చి
ప్పలు—శంఖంబులు—మధ్యరత్నమయ ముక్తామాలికల్—నీలి ప
చ్చిక నిగ్గుల్ వెదజల్లు పచ్చలు—ప్రవాళచ్ఛేదముల్—చూడ తో
యధులఁ చిక్కిన శేష మొక్క జలమంచుఁ సందియం బయ్యెడిఁ.

ఇట ప్రద్యోతుని ముద్దుబిడ్డను హరించెఁ వత్సరాజిందె యా
తని బంగారపు తాటితోట పెరిగెఁ, దేవేంద్ర దత్తేభ మి
చ్చటనే స్తంభము పెల్లగించి తిరిగెఁ దర్పంబుతో, నంచు వే
త్తలు గాథల్ వినిపింత్రు చుట్టములు నాగంతుల్ వినోదింపఁగఁ.

అచలోత్తుంగము లాడ యేనుగులు దానాసారముల్ నీవలెఁ,
రవిగుఱ్ఱాలను మచ్చరించు హరితచ్ఛాయాహయంబుల్, దశా
స్యుని యుద్ధంబున మాఱుకొన్న మగ లేతత్ చంద్రహాస క్షత
వ్రణముల్ కాయలుగాయ నాభరణ లీలఁ దాల్తు రవ్వీటిలోఁ.

కిటికీ లూదెడి కేశధూపముల పుష్టిం జెంది— చుట్టంపు విం
దుగ పుట్టింటి నెమిళ్లు సల్పెడి సపర్యానాట్యముల్ చూచి—సౌ
రభముల్ నిండిన సుందరీచరణలాక్షాచిహ్నహర్మ్యాళి ను
జ్జయినీ సజ్జిత శోభలఁ తనియు మధ్వక్లేశముల్ తీఱెడిఁ—

శివకంఠద్యుతిగా భ్రమించి ప్రమథుల్ నిఁ జూతు రత్యాదృతిఁ,
త్రిజగత్పూజ్యుని—చండికాధవుని—పుణ్యస్థానముఁ చేర పో
మ్మట—కల్హారరజోభరంబయి జలక్రీడావతీ స్నాన గం
ధిలమా 'గంధవతీ' సమీరము కదల్చుఁ మందిరోద్యానముఁ.

ఎపుడీ వచ్చట చేరితేనియు మహాకాళంబునందే పయో
ధర! నిల్వుము ప్రొద్దు కానబడుదాకన్, శూలిసాయంత నీ
బలివేళఁ సమయోచిత స్తనిత, మామంద్రంబుగానల్పి, తత్
పటహావాద్య సమర్పణాఫలము పొందన్ వచ్చు పూర్ణంబుగన్.

చరణన్యాసముతోడ మేఖలలు మ్రోఁగన్, గ్లాంత హస్తాలతో
రతనంపుంబిడికట్ల చామరము లొయ్యారంబుగా వీచు వే
శ్యలు వక్షోనఖరక్షతంబుల సుఖస్పర్శంబుగా వాన చి
న్కులు సోఁకన్ నినుచూడ చాచెద రళీమాలాయతాపాంగముల్.

అటుపై తాండవవేళ కొప్పిన జపారక్తప్రసూతచ్ఛిదా
రుణ సంధ్యావరణంబు దాల్చి, భుజశాఖారణ్యమున్ మండలా
కృతిగాచుట్టి గజాసృగార్ద్ర వసనేచ్ఛన్ శూలికిన్ దీర్చు ని
న్నరయున్ గౌరియు, దృష్టభక్తిని, ప్రసాదప్రీతినేత్రంబులన్.

ప్రియవాసంబుల కేఁగు కాంతలకు రేలన్ తత్పురీ రాజమా
ర్గము కన్పట్టదు—సూదిసందిడని పెంజీకట్లు కన్నావ నీ
కనకస్నిగ్ధ తటిత్ప్రభాకలల దారిన్ జూపుమీ! కుండపో
తల గర్జింపకు మాకృశోదరలు శాలీనత్రపాభీరువుల్,

చిరదీప్తంబయి ప్రాలుమాలిన తటిత్తన్వంగితో—పావురం
బులు నిద్రించెడి మేడ యుప్పరిగ నెందే—రేయి పోబుచ్చి, సూ
ర్యునితో లేచి ప్రయాణశేషమును సాగింపందగున్—మిత్రకా
ర్యమునకై యొప్పినమాన్యు లెమ్మెడను మందారోహకుల్ కారుగా!

ఘనుడా! ఖండితలైన నాయికల నోదార్పన్ వలెన్ ప్రొద్దు ప్రొ
ద్దుల తన్నేత్ర జలంబులన్ తుడిచి, కానన్ వేగమే వీడుమీ
రవిరథ్యన్, నలినీముఖాంచల తుషారాశ్రుల్ ప్రమార్జింప క్ర
మ్మరి రా భానుడు నీకరంబు లెదురొడ్డన్ క్రుద్ధుడౌ నీసునన్.

అల "గంభీరకు" లభ్యమౌ నవల నీ ఛాయాప్రవేశంబు స్వీ
యపయోధారను—తేటలారు హృదయంబందున్ వలెన్—ఛాయగా
నయినన్, కాన తిరస్కరింపకుము ధూర్తస్ఫూర్తి, శుక్లోత్పలా
యిత మీనేక్షణమాలనై తదనురాగోత్కంఠ వ్యంజించెడిన్.

సఖుడా! ఇంచుక జాఱు నా తటకటీ నీలాంశుచేలంబు వే
తసశాఖాకర మూది పట్టుకొన, దానిన్ పట్టి పైద్రోచి, పై
బడి వ్రేలాడుచునున్న, నీ పయన మెట్లో సాగులే! త్రావనే
ర్చినవా డెవ్వ డనావృతాంబర నితంబన్ వీడిపో నోపెనో!

కదలన్ జో లటుమీద 'దేవగిరి', కీ వందందు వర్షింప పా
క్కిన భూగంధముతో ప్రియంబులయి—యేన్గుల్ తొండముల్ లేపి పీ
ల్చు కిలారంబుల నింపులై—అడవి మేళ్లన్ పెల్లు పండించు—శీ
తల వాతంబులు వీచు నీ జిగమిషాభిజ్ఞానుకూలంబులై.

కల డా 'దేవగిరిన్' సదాశ్రయుడు—స్కందస్వామి—పుష్పాల మే
ఘుడవై దివ్యసరిత్ జలార్ద్ర కుసుమాసారాభిషేకంబు న
ల్పు, మతం డుద్భవ మందె నగ్నిముఖమం దాదిత్య తేజుండు—ఇం
ద్రచమూసంచయ రక్షణార్థము మహాదేవాత్మసంకల్పుడై.

పలువన్నెల్ గిఱికొన్న యే నెమిలిఱెక్కల్, జాలిగా, గౌరి తా
ల్చెను కర్ణంబున కల్వ చెంగట కుమారప్రీతి—ఆడింపు మా
తరుణస్వామి మయూరముల్—హరశిరశ్చంద్ర ప్రభాపాంగముల్
పిదపన్ తద్గిరి మాఱుమ్రోతలను ఘూర్ణిల్లంగ గర్జింపుమీ

శరజన్ముండగు దేవునిన్ గొలిచి, సిద్ధద్వంద్వముల్ వీణెలన్
చినుకుల్ రాలను భీతితో నససరిల్లన్, మార్గమున్ దాటి గో
తనయాలంభ వినీత పుణ్యపరిపాకఖ్యాత నారంతి దే
వుని కీర్తి ప్రసృత స్రవంతిని—సమారాధింపగా నాగుమీ!

హరి మైచాయల నాచికొన్న భవదీయాకారముల్ వంచి యే
టిజలంబానగ చూచి ఖేచరులు సంప్రేక్షింత్రు నీరూపు—భూ
సతి కై సేసిన మధ్యనీలమణి ముక్తామాలికాభాతి—నా
పృథుకూలంకషయున్—సుదూరగతి—కన్యాకుల్యగా కానరాన్—

అది దాటన్, "దశ పత్తనం"బున నెలంతల్ నిన్ను దర్శింత్రు భ్రూ
లత లంకింపగ కల్కి చేష్టలను—కుల్కన్ చారుశారప్రభల్—
కనుఱెప్పల్ పయికెత్త—మల్లికల నయ్యాడించు ఇందిందిర
ద్యుతులన్ దోచిన వారి చూపుతమికిన్ పాత్రంబవై పోవుమీ!

చొరనా పిమ్మట ఛాయమాత్రముగ 'బ్రహ్మావర్త' దేశంబు, నం
దు కురుక్షేత్రతలిన్ భజింపు మది క్షాత్రాయోధనాభ్యంకితం—
బట గాండీవి సహస్రశాతశరముల్ వర్షించె రాజన్య రా
జముఖ శ్రేణిని—పద్మపంక్తిపయి ధారాపాతమున్ నివలెన్—

కురుకౌంతేయుల బాంధవంబున సమీకత్యాగమున్ జేసి—రే
వతి కన్ సన్నలతో ప్రియంబగు సురన్ వర్జించి—సారస్వతీ
రసనంసేవనమున్ వరించె హాలి; నీవున్ బాహ్యమాత్రాసితుం
డవు—తత్తీర్థ నిషేవణంబున నిజాంతశ్శుద్ధినిన్ బొందుమా!

వినతిం బోదగు నావలన్ కనఖలోపాంతాద్రి రాజావతీ
ర్ణకు—జహ్నుప్రియకన్య—కానగరపుత్ర స్వర్గసోపాన—; కా
యమ గౌరీవదన భ్రుభంగికి నురుంగుల్ పొంగగా నవ్వి ధూ
ర్జటి కేశంబులు చుట్టిపట్టె శశిసంవృత్తోర్మికాహస్తయై.

అపరాంగంబు నగంబు దేవగజమట్టుల్ మింట ద్రేలాడ, త
ద్విమలస్ఫాటికనీర, మడ్డముగ, త్రావన్ నీవు చింతింపగా;
అపుడా తెల్లనియేట నీ నలుపునీడల్ ప్రాకుటల్ శోభిల్లున్;
యమునాగంగల సంగమోత్సవము అస్థానంబునం బైనటుల్.

తుహినాచ్ఛాదవితానధౌతమయి—శయ్యాసుప్తసారంగ నా
భిమదామోద శిలామనోజ్ఞమయి—గంగాజాతకా పావనం
బగు శైలంబున నెత్తమెక్కి అలతల్ తీఱంగ కూర్చున్న ని
న్నుపమింపందగు శూలిశుక్లవృషభోత్ఖాతార్ద్రి పంకంబుతోన్—

సరళస్కంధ నికర్షణన్ విపినవాతక్షుబ్ధమై పుట్టి, తత్
చమరీవాలములన్ దహించు గిరిపీడాగాఢ దావాగ్నులన్
పెనుధారల్ దిగబోసి తాపమడగింపన్ యుక్తమా నీకు—ఉ
త్తమసంపన్నుల కార్తలోకశమనంబే సత్ఫలంబయ్యెడిన్—,

కటియేనుంగను భ్రాంతితో సరభసోద్వేగంబునన్ నీపయిన్
శరభంబుల్ దుముకన్ తొలంగుము పథంబున్ శీఘ్ర మా జంతువుల్
చరణంబుల్ తెగకూలు—నంత వడగండ్లన్ కార్చి పోద్రోలు—మె
వ్వ రశక్తోద్యమ ధూర్తులై పరిభవంబున్ పొందకే దక్కిరో!

కల దర్ధేందువతంసు దివ్యచరణన్యాసాంకమై ఒక్క ప్ర
స్థర మా శీతగిరిన్—ప్రదక్షిణము పొమ్మా నమ్రతన్—దాని సి
ద్ధు లుపాసింత్రు సతంబు—దర్శనము మాత్రన్ పాపముల్ పాయ భ
క్తులు ప్రాపింతురు ముక్తదేహులయి కైలాసోర్ధ్వలోకంబులన్.

మధురస్వానము నింప వేణువులు గాలిన్ నిండి నిబ్రంబుగా,
అమరస్త్రీన్ త్రిపురీజయాంకపద మాలాపింపగా కిన్నరుల్,

దరులన్ నీస్తనితప్రతిధ్వని మృదంగావర్తమై యొప్పినన్;
శివపూజా రచనాసమగ్ర మగు సంగీతార్థ మాసుస్థలిన్.

హిమవత్ప్రాంత మతిక్రమించి కనుచున్ తత్తత్ దర్శనీయంబులన్,
భృగురామప్రథమైన క్రౌంచబిలహంసద్వారమున్ జొచ్చి వె
ల్వడు; మడ్డంబుగ సాగు నీమెడ బలిత్యక్త స్వరాక్రాంతి క
త్తిన శ్రీ వామన విష్ణుపాదమన శ్యామాయామమ్మై శోభిలున్.

అల పౌలస్త్య భుజచ్ఛిదా శిథిల సంధిప్రస్థముల్ కానరాన్,
త్రిదశస్త్రీలకు మించుటద్ద మగు శుద్ధస్నిగ్ధ కైలాస మం
దతిథి స్వామివి కమ్ము; తత్ కుముద ధాతోచ్చైశ్శిర శ్శృంగముల్
చదలన్ ప్రాకు శివాట్టహాసములు గుబ్బల్ కట్టెనా నిత్యమున్.

నునుపుం గాటుకవంటి నీవు గిరిసానూత్సంగమం దుండగా,
అపుడే చీల్చిన దంతిదంతముల ఛాయల్ తేలు నా శైల రా
జము శోభల్ వహియించు సుస్తిమిత చక్షుః ప్రేక్షణీయంబుగా,
అతసీ శ్యామలచేల మంసములపై జీరాడు సీరిన్ బలెన్.

వలయవ్యాళము లుజ్జగించి విభు డంసాలంబనంబీయ, కా
ల్నడ, క్రీడాద్రిపయిన్ చరించు ఉమకున్—ముందేగి—సేవింపుమీ;
భవదంత స్సలిలంబు పేరి సమసోపానంబుగాన్ ఆమెకున్
మణిసానుప్రకరాధిరోహణ సుఖోపాయంబు సిద్ధించెడిన్.

తమవజ్రాల కడానిగాజు మొనలన్ గీటాడి, పైకుబ్బు జ
ల్లులతో కూర్తురు నిన్ సురాంగనలు ధారాయంత్రగేహంబుగా;
తపనావశ్యముగాగ చిక్కిన నినున్ పోవీడరేనిన్; భయం
పడ గర్జింపుము—వారు కేళివశలౌ వేళన్ కఠోరంబుగన్.

కనకాబ్జంబులు పుట్టు మానసములో నీరాను, ఐరావతం
బునకున్ ప్రీతిగ నెమ్మొగంబుపయి ఛాయాచ్ఛత్రమున్ బట్టి, క
ల్పకశాఖాకినలాంశుకంబుల చెఱంగుల్ తూలగా వీచి, మి
త్రమ! భోగింపుము తన్నగేంద్రమున నానానర్మచేష్టారతిన్

విమలోదాత్త విమానమైన - విచలద్గంగాదుకూలాంచలన్
అలకన్ - గుర్తిడలేకపోవు సఖ! కైలాస ప్రియోత్సంగమం;
దది మీరాకల శోభిలున్ జలకణంబుల్ చిమ్ము మేఘాలతో—
తెలి ముత్యాలుపెనంగు ముంగురుల ముద్దుంగుమ్మ చందంబునన్

ఇది పూర్వమేఘము

# మన్వంతరం

శ్రీ యస్వీ జోగారావు

**1957** డిసెంబరు 31
అర్ధ రాత్రి

ఏకాంతంలో —
అమాంతంగా
ఆకాశవైహాయస వీధుల్లో
అగాధ స్వప్న సమాధుల్లో
విరహాగ్ని మహీధ్ర శృంగాల్లో
శృంగారఘనీ తరంగాల్లో
లేనిపోని ఊహావిహారాలు చేసి చేసి
విసుగెత్తి, ఇటీవలే కాస్త
చిత్తం స్థిమితపడ్డ
భావకవి అంతరాత్మ శిరస్సు
అంతర్ముఖుడై
దివినుండి దిగివచ్చి
భువి భవిష్యత్తు చిత్రిస్తున్నాడు —
దృష్టి తీవ్రంగా సారించాడు
ముప్పైయేళ్లు ముందుకి లగెత్తేడు.

* * *

అతను పైలా పచ్చీసులో కేవలం భావకవిగానే
ఉన్నప్పుడతని దర్శనం అస్పష్టంగా వున్నా
భూతం భూతంలా, భావి దేవతలా కనిపించేది.
ఆ భావకవి కట్టిన ఊహాకలాపంలో
భామ వేష మెప్పటికీ తెర వెళ్ళకపోడంతో
ఈమధ్య కాస్త స్థిమితపడ్డాడు.
క్రాంతిదర్శనుడుకూడా అయ్యేడు
అతని కిప్పుడిప్పుడే
ఉత్తుత్తి ఊహాపోహాలు తగ్గి
ఉన్నదున్నట్టు కన్నులకు పొడగడుతోంది లోకం.
తనబుద్ధిని అనుభూతిలో పుటంపెట్టి స్ఫుటంచేశాడు.
అవశ్యం భావిజగత్పరిణామ స్వభావం కూడా
అతని కిప్పుడిప్పుడే
లీలగా గోచరిస్తోంది.
లీలగా కాదు అవలీలగా —
పరిణామ స్వభావమే కాదు
పరిణామ పరమార్థం
పరమార్థ పరిణామం
పరిణామ పరిమాణం
పరకోటి ముట్టిన పరిస్థితికూడా గోచరించేసింది.
అతను పరమాణువు పగులుతుందని,
'మహాప్రళయం జగంనిండా ప్రగల్భిస్తుం'దనీ
ఎప్పుడో జోస్యం చెప్పేశాడు.
సృష్టికి
సుఖపుష్టికి
అసంతుష్టి తనుయష్టికి
పాపిష్ఠికి
పరమేష్ఠికి
తగిలిందట
  వికటభ్రుకుటీ ప్రకట
  విరూపాక్ష రూక్షదృష్టి !
రగిలిందట
  ప్రళయరౌద్ర రసహాసంతి !
పగిలిందట పరమాణువు !
పగిలిందట పరమాణువు !
అణువణువున వణికిందట
కుడియెడమల నడిమింటను
మృత్యుంజయుడు ముందెకన్న !
హాలాహల కోలాహల
మదిగదిగో !
అదిగదిగో !
  వృషభధ్వజ భుజకీర్తుల
  విషనాగులు —
శివుని పదమె చీమకుట్టె
శివునికె నిషమెత్తెను
తిప్పటడుగు తాండవమె
థకిట థకిట ధిధిగినతోం
లయపడ్డది
నవబ్రహ్మ నడ్డిమీద —

భయపడ్డది
భవతాండవ రవభైరవ
లయ భ్రాంతిపై లోకము
ఆ లోకాలోకార్థము
ఆకస్మిక వికస్వరత
సవసరించె పథివుని మూ
డవ నేత్రము——
ఎటుచూచిన నిటాలాక్షీ
హుతాశపటుచ్ఛటాచ్ఛటలు!
పటాపంచలైపోయెను!
పంచభూత సంచారము!
భూతావని భూతద్దము
భూతేశ్వర ప్రతిబింబ
ద్యోతకమై
పడె నివురై ఫాలాక్షుడు!
నివురు నివురు నిటాలాక్షీ!

అని ఆరోజుల్లో అనుపద పల్లవితో ప్రళయలయ
లంపట ఝటితిస్ఫూర్తితో గీతాలాపం చేశాడు.
ఆటంబాంబులు హైడ్రోజను బాంబులు
పరీక్షశాలికలలో ప్రాణప్రతిష్ఠలూ,
రాబట్లు, రాడార్లు, రాకెట్లు
ఫ్లయింగు సాసర్లు, స్పుట్‌నిక్లూ
మొదలైన వాటన్నిటిగురించీ కలలు కనేవాడు,
జాంబవంతుని స్వప్నాలు!
అయితే అన్నిటిగురించీ ఆలాపనలు చెయ్యలేదు——
'గుండె గొంతుకలో కొట్లాడుతూ' వుండిపోయింది.

* * *

ఈ వాడు మళ్ళా అంతరిక్షంలోకి
తన బుర్రని రాకెట్‌లా వదిలేసి
బుద్ధి భూతద్దంలోంచి
భూతకాల వైతరణిని దాటి
భూలోకం భవిష్యత్తుని
తనిఖీ చేస్తున్నాడు.

ఇటీవల అతను దేనిగురించి ఆలోచించినా జరగబోయేదంతా అతిస్పష్టంగా గోచరించేది. అంత దూర్మఖత్వం వహించిన అతని మనస్సులో అన్ని సంగతులూ వరసగా——
త్రీడీ సినిమాలో ఫిల్మురీలు తిరిగినట్లు తిరిగేవి.

కాని యివాళ——
ఆసలే మసాలు వేసిన మునిమాపు వేళ
అడివిలో దూరంగా తాటితోపు మలుపుల్లో
బొమ్మచెముడు డొంకలను పెనవేసుకున్న
కోరింత జీబులు
గుడిసెల్లా కనిపించినట్లు
అంతా మసక మసకగా వుంది
భూలోకం భవిష్యత్తు అతని కళ్ళకి.
అతని ఆత్మాంతరాళంలోంచి చూస్తే
భూగోళం
కొత్త బల్ల పరపుగా కనిపిస్తోంది.

* * *

ఇప్పుడతనికి ముప్ఫయ్యేళ్ళు——ఇంక ముప్ఫై.
అప్పటికతనికి షష్టిపూర్తవుతుంది.
కాని పాపం కవే గాని సన్మానం కాదు
సరికదా రిటైరు అవుతాడు
ఉద్యోగంనుంచి కాదు
లోకంనుంచే!

* * *

1987 డిసెంబరు 31
రాత్రి పన్నెండు గంటలు.
తెల్లవారితే - ఆ
కాదు——
ఆ గంట గడిస్తే
1988 జనవరి ఫస్టు!
కాని తెల్లవారదు.
ఆ పన్నెండు గంటలు దాటే గడియారం,
చిన్నముల్లు సరేసరి,
పెద్దముల్లు కూడా
అరసెకండు అవతలకి జరగదు.
అంతే!
అప్పుడే అక్కడే
అంతర్వాణి శర్మ భావవాడి
తక్కున ఆగిపోయింది.
అది 1987 వ సంవత్సరానికే కాదు
ఈ లోకానికే ఆఖరి రోజు!
మానవ కాలమానానికి ఫులిస్టాపు!
కాదు కాదు
ఆ వాడు మానవుడు
మృత్యువును హత్య చేశాడు!

ఆనాడే లోకాంతరంలోకి మానవుని మహాప్రస్థానం!
ఆనాటినుండే భూదేవికి మారుమనువు
అదిగో! ఆ 1987 డిసెంబరు 31 తేదీ అర్థరాత్రే
ఈ భూలోకం తీరంలోనే
సముద్రుడి బొడ్డులాగున్న ఆ దీవిలోనే
ఆ బొడ్డుమీద పొటమరించిన పుండులాగున్న
ఆ కొండమీదే
అటూ ఇటూ అణుశక్తి పరిశోధనాగారాలు
ఆ ఆవరణలోనే
ఆ భూలోకపు కైమారే
నలువైపులా
అస్థిపంజరాలూ,
కుహానామానవ మసిపొక్కాలూ,
కృతక శిసువిశిష్టశోధన నాళికలూ
చిందర వందరగా పడివున్న
ఒక గదిలో
ఒంటరిగా ఒక సైంటిస్టు!
సృష్టి సంకల్పంతో సమాధిగతుడైన పరమేష్ఠిలా
ప్రాణాయామం పట్టిన మృత్యుంజయమూర్తిలా
వెలిగిపోతున్నాడు.
అతనిముందు క్రమంగా దిగజారిపోతున్న దీపశిఖ
ఒక్కసారి అతని ఊపిరికి రెపరెపలాడి
ఉజ్జ్వలంగా ఒక జ్వాలగా లేచింది.
ఉన్నట్టుండి హఠాత్తుగా
ఏదో సాధించినవాడిలా లేచాడతను.
లేచి కట్టెదుటనున్న మంచుపెట్టె తలుపు తెరిచాడు.
తెరిచి దీర్ఘనిద్రాముద్రితమైన ప్రియురాలి ముఖంవైపు
తదేక దీక్షగా చూశాడు.
చూచి సన్నగా నిలకడగా వెలుగుతూ వున్న
దీపజ్వాలమీద ఏదో సాసిచల్లి పొగ అణగారక
ఆవిర్భవించిన ఆవిరిని
ఆమె ముకుపుటాలద్వారా ముమ్మారు
ఊపిరితిత్తులలోపలికి ఊదేడు.
క్రమక్రమంగా
ఆమె ఉచ్ఛ్వసించింది.
నిశ్వసించింది
దీపం రెపరెప లాడింది.
ఆమె రెప్ప లల్లార్చింది
తెప్పరిల్లింది.
కన్నులర విచ్చింది

ఆమె పాల బుగ్గలమీద నవ్వు పక్కుమంది.
బుగ్గలు లొత్తలు పడ్డాయి.
ఆ లొత్తల్లో నవజీవకళాలావణ్యపు లోతులు స్ఫురించాయి.
మగత వదలి మంత్రదేవత లేచినట్లు లేచింది.
మృతిచెందిన ప్రియురాలు బ్రతికిందన్న సంతోషంతోటీ
అసలు మృత్యువునే సాధించానన్న సంతోషంతోటీ
ఆ రెండు సంతోషాల ఏకాంతపు మైకంతోటీ
సరిగా అదే వేళకి ఆ ప్రక్కనుంచి రివ్వున వచ్చిన ఆటోమిక్ షాక్ తోటీ
అతను ఉక్కిరిబిక్కిరయ్యాడు
బిక్కచచ్చిపోయాడు
చచ్చిపోయాడు.
ఆమె బ్రతికిందికాని పాపం?
అతను చచ్చిపోయాడు!
అతని ప్రాణజ్యోతి
ఆమె చూస్తూ వుండగానే
అణుశక్తి పరిశోధనాగారాభిముఖంగా
పయనించింది.
అందులో ప్రవేశించింది.
ఆ ఏకాంతంలో
ఎవరినో ఆవేశించింది.
అంతే
మళ్లా మసక మసక.
మరుక్షణంలో—

ఏదో మీటనొక్కిన సవ్వడి.

కర్ణకఠోరమూ, హృదయ విచ్ఛేదకమూ అయిన

ఒక భయంకరధ్వని!

పరమాణు గర్భంలోంచి ప్రాదుర్భవించిన

ప్రళయార్భటి!

ప్రళయకాలాఖిల పర్జన్యగర్జ!

'యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బుచాటున ఖణేల్మన్నాయ్!'
భూగోళం అంతా రెండు చిప్పలుగా విడిపోయి
ఆ చిప్ప లొకదానొకటి ఢీకొన్నాయి
ప్రళయ రుద్రుడిచండతాండవంకి
సృష్టి చేసి చేసి విసుగెత్తిన విరించనుడే
తాళం వేస్తున్నట్లుంది.
అహో! కన్నులు మిరుమిట్లుగొల్పే

దుర్నిరీక్ష్యమహోజ్జ్వలతేజఃస్ఫులింగాలు!
లయకాలుని అభయహస్త శుభముద్రలు!
కాదు కాదు అవి
చెచ్చెరసమాధిలోంచి లేచి
చెండాముండా శివు డిచ్చిన చపేటాలు తిన్న
సిసృక్షాబుభుక్షువు బ్రహ్మదేవుడి దవడవాపులు!
అహో కుంభవృష్టి!
అహో ప్రళయఝంఝాప్రభంజనస్వామి విజృంభణము!
జలియలికట చెంగున లంఘించి
నిరవధికమై నీరవనిర్భరమై
ఘూర్ణిల్లుతూవున్న
అర్ణవపు ప్రమిదలో
లయకారుడికి కాలపురుషుకు పెట్టిన
అఖండ దీపవర్తి
ప్రళయకాల కరాళబడబానలజ్వాలా కకుద్మం!
ఎటు చూసినా
పంచభూతాల ప్రళయావేశం!
విలయదేవతా వికటాట్టహాసం!
ఉరుములు! మెరుపులు!
పొగలు! సెగలు!
ఆవిరులు! కావిరులు!
ఏదో గుండ్రనిపదార్థం చూర్ణం చూర్ణమైపోయి
ఆచూర్ణం ఆకాశాన్ని మలామా చేసింది.
మళ్ళీ మసక మసక —
అంతర్వాణి శిర్క్ క్రుళ్లు మిటకరించాడు.
చుట్టూ నిశితంగా పరికించాడు
కనపడింది ఏమీ లేదు.
ఎక్కడా కించిత్ప్రాణిప్రచారం లేదు;
అంతా నిశ్చేతనం!
కనీసం ఒక బండలాంటి మూర్తపదార్థమన్నా
స్థూలంగా కనిపించ లేదు!
అలవోకగా గలగలమను
ఒక సెలయేటి పారుదల పొలకువ లేదు!
ఒక గాలికెరట వీచిన జాడ లేదు!
ఒక కాంతిరేఖ ప్రసరించినవైనం కానరాదు!
ఆకారం - కాంతి - శబ్దం అంతా మిథ్య!
అంతా గాఢాంధకార బంధురం?
నిశ్శబ్ద నీరవం!
అసలింత భూగోళ మంతా ఏమైపోయింది!
దాని గోళాకృతి అంచులకొసలైనా కనిపించవేం!
సర్వంసహా సర్వనాశనమైపోయింది!
సైంటిస్టు చిల్లంగి పెట్టేశాడు!
అతను మృత్యువును సాధించడానికి ముందే
పరమాణువును ఛేదించాడు!
ప్రళయరహస్యం కనుగొన్నాడు
అంతులేని అశాంతితో బాధపడే
భూప్రపంచాని కింక శాశ్వతమైన శాంతి!

* * *

అదిగో మళ్లా
ఏదో ఎర్రనిగోళం
గిర్రున తిరుగుతూవుంది
జేవురించిన శాంభవాంబకంలా
అదే తిరుగుతూవుందో!
అంతర్వాణి శిర్క్ నేత్రగోళాలే తిరుగుతున్నాయో!
ఆ గోళం గాజు బెజ్జాల్లోంచి
ఏవో రెండు చిన్నగోళాలు,
ఒక మానవుడి నేత్రాల్లా వున్నాయి.
శూన్యంలోకి చూస్తున్నట్లున్నాడు.
ఏమిటా గోళం?
అది భూగోళమేనా?
కాదు కాదు
అది ఆ వేళ
పరమాణుశక్తి ప్రకోప పరమావధిని
పరీక్షించిన సైంటిస్టు
తన ప్రాణరక్షణకోసం
శూన్యం ప్రాకారంలో గిరిగీసి నిర్మించుకొన్న
ఏకాంత హర్మ్యం!
అమాంతం లోకాంతకమైన
అణుశక్తి గర్భిణ్యరిష్టం!
భూతజగత్తు జగత్తంతా భగభగమండి
భస్మీభూతమై పోయింది!
ఎంపైరుస్టేటు బిల్డింగ్సు పేక మేడల్లా పడిపోయాయి!
ఎవరెస్టులు కరిగినీరై ఆవిరు లైపోయాయి!
కాని ఏకాంత హర్మ్యం మాత్రం
చెక్కు చెదర లేదు.
అందులో
భీతావహ భూతావిష్టుడై
అర్ధరాత్రి

సౌప్తికపర్వం నిర్వహించిన అశ్వత్థామలా
ప్రళయకాల విశ్వ విశ్వంభరాదేవి
గర్భస్రావ జీవసార నిర్ఝర మహాప్రవాహంలో
వటపత్రశాయిలా
క్షుద్ర జగద్భస్మావశేష వాఖిల
ముద్రాయితమూర్తి ప్రళయరుద్రుడిలా
పరమాణుశాస్త్రి!
ఒక్కసారి లోకంమీద తనకక్క సంతాతీర్చుకున్నాడు
కాదుకాదు పాపం, ఎందుకేనా మంచిదని అలాంటి
ఏకాంతహర్మ్యం నిర్మించుకున్నాడుగాని ముందుగా-
ఇంతముప్పు మూడుతుందన్నమాట
అతని ఊహాకే అందలేదేమో—
పాపం పాపగాడికి ప్రయోగం తెలిసింది కాని
ఉపసంహారం తెలీలేదు.
తెలీకేం! లోకోపసంహారం!

* * *

మంటలూ చప్పుళ్లూ
క్రమక్రమంగా
ఉపశమిల్లుతున్నాయి.
అణుశాస్త్రి పరిస్థితి గమనించాడు.
అతని కిప్పుడేం చెయ్యడానికీ తోచలేదు.
బయటికి రావడమా?
వచ్చి ఏంచెయ్యాలి?
అని తటపటాయిస్తున్నాడు.

* * *

ఇంతలో సమీపంలో
కొనవూపిరితోవున్న భూదేవత
మూలిగినట్లు
సన్నగా ఒక చిన్న చప్పుడి.
అణుశాస్త్రి వలుకంకలా కలయజూచేడు.
సమీపంలో ఒకమూల
ముడ్చుకుడిగి మూలుగుతువున్న ఒక స్త్రీమూర్తి!
తాను మినహా ఎక్కడా
ఒక్క సప్రాణ పరమాణువు
కనిపించని వేళ
ఎవరామనిషి!
బహుశా బలవన్మరణం పాలైన
భూలోకం ఎత్తిన పిశాచావతారమా!
ఆలోకోత్తరసౌందర్యం చూస్తే
ఆమె పిశాచి యనిపించదు.
ఆమె కాస్త కదిలింది, మెదిలింది
మైకం వదిలింది.
కళ్ళుతెరిచి తేరిపారజూచింది.
వణుకుతూ, తడబడుతూ
ఎలాగో గొంతు సవరించుకుని
'ఎవరునువ్వు పిశాచివా?'
అని గొణిగేడణుశాస్త్రి.
ఆమె బల్లనానుకుని లేచింది.
ముందుకో అడుగు వేసింది.
అణుశాస్త్రికి ముఖాముఖిగా నిల్చింది—
'నీకు నిజంగా పిశాచాన్ని చూడాలనివుంటే
అదిగో ఆ అద్దంలోకి చూసుకో!
నేనెవరివా?...ఆ హ్హ హ్హ!...
నీ ప్రియురాలిని—
మృత్యువును.
మృత్యుంజయుని ముద్దుచెమ్మను
ఆఁ! నేనింకా బతికేవున్నానా!
అవును నేనెందుకు బతికివుండను!
నే నే మృత్యువును
నాకు చా వేమిటి!
అయినా నిన్ను చంపకుండా చస్తానా!'
అని మొలలోంచి చిన్న పిస్తోలు తీసింది.
అణుశాస్త్రి గజగజ వణికిపోతున్నాడు.
అతనికి పరిస్థితి ఏమీ అర్థంకాకుండావుంది.
గాభరాపడిపోతున్నాడు.
'ఎవరు నువ్వు? ఎలా వచ్చావిక్కడికి?'
అని యింకా ఏదో అనబోతున్నాడు.
'ఒక్క క్షణం ఆలస్యమైపోయింది!
లేకపోతే అమీట నొక్కడాకా
నిన్నుంషెవిచ్చేదాన్నా?
నేను చచ్చిపోయాననుకున్నా
నువ్వూ చచ్చిపోయావనుకున్నా'

అణుశాస్త్రి తాను నిజంగా చచ్చిపోయి మరేదో లోకంలో ఎవరితోనో మాట్లాడుతున్నానేమో అనుకున్నాడు.

ఎదురుగావున్న అద్దంలోకి ఎగాదిగా చూసుకున్నాడు.
ఓసారి గట్టిగా ఒళ్ళు తడుముకున్నాడు.
ధైర్యం కాస్త చిక్కబట్టుకున్నాడు. కాని

'నే నేం చేశాను!... నే నేం చేశాను' అని నీళ్ళు నములుతున్నాడు.

'ఛీ హంతకుడా! కాదు కాదు నిన్నలా పిలవడానికి ఆ మాటకి అర్థం చాలదు. ఒక సజీవలోకానికి లోకాన్ని దుంపనాశనం చేశావు. ప్రకృతి పవిత్రమండి నీకు కావలసినంతా విజ్ఞానస్తన్యం గుంజుకొని తల్లి రొమ్మే గుద్దేవు. ఆమె ప్రాణాలాపోశనం పట్టేవు.'

'ఇంతలా జరుగుతుందని నేననుకోలేదు'

'అనుకోని వుండకపోతే ఇంత గటి లోకాంతకమైన ఏకాంతిహర్మ్యం ఎందుకు నిర్మించుకున్నావు?' ఆమె గద్దరించింది.

'ఎందుకేనా మంచిదని. అయినా అనంత బ్రహ్మాండకోటిలో ఎంత ప్రయత్నించినా ఎప్పటికీ సుఖసమగ్రం కాని అశాంతిమయమైన యీ భూగ్రహం ఒక్కటీ నశిస్తే నేం?'

అప్పుడే కొంచెం తెగించి శాస్త్రవాదం మొదలెట్టేడు.

'అంతగా ఈలోకపు టశాంతి నీ హృదయంలో సానుభూతిని ప్రకోపింపజేస్తే, నిజంగా ఆ అశాంతిని చూడలేని దయాళుడివైతే ఆత్మహత్య చేసుకోవలిసింది నువ్వు. అంతేకాని లోకాన్నంతా ధ్వంసం చెయ్యడానికి నీకేం హక్కుంది?'

'లోకంలో అందరికీ పిల్లలను కనడానికి యోగ్యత వుందా? యోగ్యత లేకపోయినా పిల్లలను కనడానికి వాళ్లకా హక్కెవ్వరిచ్చారు? పిల్లలు తమను కనమని తలిదండ్రులకు దరఖాస్తు పెట్టేరా?'

'ఆలోచిస్తే ఆత్మహత్యవినా మానవుడికి ఏ హక్కూ లేదు. అదొక్కటే అతని జన్మహక్కు. ఎవరూ తమ హక్కుగదా అని పుట్టరు, పుట్టించరు. తలిదండ్రులు మాత్రం పిల్లలను పుట్టమని బతిమాలేరా? బలవంతం చేశారా? ఆ పిల్లలు సహజమైన సృష్టికర్మలో యాదృచ్ఛికంగా సంభవించే ఫలితాలు. చావు పుట్టుకలు సర్వప్రాణికోటికి స్వాభావికాలు.'

'పుట్టుకవున్నదానికి చావు తప్పదుగదా! మరి...'

'ఎంత చచ్చుమాటన్నావు! నేనసలు చచ్చినదాన్నే. ఇప్పుడే మళ్లా బ్రతికాను. నువ్వు పరమాణుశక్తి పరిశోధకాగ్రేసరుడివి. గొప్ప సైంటిస్టువి. కాని మావంటి పామరుల హృదయాలకు తట్టే వూహాలు నీ మెదడుకి తట్టవు. తట్టినా పట్టించుకోరు మీరు. నువ్వు తలుచుకొంటే లోకాన్నంతా ఏకధాటిగా నాశనం చేసెయ్యగలవు. చేశావుకూడా. కావలిస్తే చావకుండా వుండగలవు. చచ్చినవాళ్లను బతికించడానికూడా ప్రయత్నం చెయ్యగలవు. సృష్టిలోని యాదృచ్ఛిక సంభవాలను అరికట్టగలవు. కాని నీకుంతట నువ్వు స్వతంత్రంగా ఒక్క చిన్నక్రిమిని సృష్టించగలవా?'

అణుశాస్త్రి కాస్సేపు మౌనంవహించి ఆలోచనలో పడ్డా అతనిలో ఏదో కుతూహలం చెలరేగుతూ వుంది.

'ఏమిటీ! నువ్వు చచ్చిబతికినదానివా? మా మిత్రుడు ఏడమ్సు ప్రేయసి ఇవనోవావా నువ్వు!'

'అవును. పరమాణుశక్తి పరిశోధనాభినివేశంలో పరవశుడివైపోయిన పరమశివుడివి నీకు వెంటనే గుర్తెలా వస్తుంది!

చిత్రం! ఇద్దరూ ఇక్కడే ప్రక్కప్రక్కలనే పరస్పర విరుద్ధాలూ, అత్యంత విశిష్టాలూ అయిన రెండు అపూర్వ విజ్ఞానశాస్త్ర ప్రక్రియల్లో పరిశోధన ప్రారంభించారు. అతనిది ప్రవృత్తిమార్గం. నీది నివృత్తిమార్గం! పాపం అతను నన్నెంత గాఢంగా ప్రేమించాడో గాని చచ్చిపోయిన నాకోసం తన ప్రాణసారం ధారపోసి బతికించాడు. ఈ కాలపు సైంటిస్టులు తమకేవో ప్రత్యేకం యిలాంటి వ్యక్తిగత సమస్యలుంటేనే కాని అందరికీ పనికివచ్చే సంగతుల గురించి ఆలోచించరేమో!

ఏమైతేనేం ఆయన మృత్యువును జయించాడు నన్ను బ్రతికించాడు. కాని మృత్యువు తన రహస్యం లోకానికంతటికీ తెలియకూడదని కాబోలు అతన్నే బలికోరింది.

ఆయన చచ్చిపోయినా మృత్యుంజయుడే. జగత్తంతా చచ్చి నువ్వొక్కడివే మిగిలివున్నా జీవన్మృతుడివి నువ్వు. మానవుడు మృత్యువును జయించిన మరుక్షణంలో ప్రపంచానికే ప్రళయం వస్తుందని నువ్వు అనుకోకుండా రుజువుచేశావు. బహుశా కారణం మానవుడు పుట్టుక గుట్టుగూర్చి ఎరుక సంపాదించడానికి ముందే చావును సాధించడానికి పూనుకోవడం, మృత్యువును జయించడానికి ముందే ప్రపంచాన్నంతా

ప్రళయంలో ముంచెత్తగల శక్తిని సంపాదించి వుండడమే అనుకుంటాను. ఈ దృష్టితో చూస్తే మృత్యువును సాధించడంలో నీదే ముందంజ అని చెప్పాలి!'

'ఒక్కమాట. సృష్ట్యాదినుండీ మానవుడు ప్రకృతి రహస్యం తెలుసుకోవాలని నిరంతరం ప్రయత్నిస్తూనే వున్నాడు. ఆ ప్రకృతి తత్త్వంయొక్క గాంభీర్యం, వైచిత్రి, రామణీయకం చూసి భయవిస్మయానందాలు పొందేడు మానవుడు. ఆ అనుభూతుల నుంచే అతని మనస్స్వరూపం క్రమావిష్కృతమైంది. భగవంతుడు జగత్తును సృష్టించడం కాదు ఆ ప్రాక్తన మానవుడి ప్రకృతి గంభీరతత్త్వ ప్రభూతాలైన భయ భ్రాంతులే భగవంతుడిని సృష్టించాయి. ఆవాటి అతని ఆనందమే కవిత్వంగా పరిణమించి నానాభూత కల్పనలతో సృష్టి రహస్యపరిజ్ఞానం మరింత క్లిష్ట సమస్య అయిపోయింది.

అతని విస్మయాకులతే తర్కసహమైన తత్త్వ మీమాంసకు ప్రస్తావన అయింది. తరతరాల దేశదేశాల తాత్త్వికు లెందరో ఎన్నో తర్కవితర్కనలు చేశారు. దృశ్యమాన పదార్థ ప్రపంచ యథార్థస్వరూపంగురించి ఆయా విజ్ఞాన శాస్త్రవేత్తలెందరో మహత్తర పరిశోధనలు జరిపారు. ఎవరూ సృష్టిరహస్యం ఇదమిత్థమని తేల్చలేక పోయారు. అది ఎవరికీ అంతుపట్టలేదు.'

'నువ్వు తేల్చావుగా ఇప్పుడు. ఇప్పటికంతు పట్టిందిగా.'

'ఇదంతా తలమునుష్ములు చాలావుంది తత్త్వ మీమాంసకు లన్నట్లు ఈశ్వరసృష్టే అయితే, అయన ఎలా వూడిపడ్డాడని నేను ప్రశ్నించి లాభం లేదు గనక ఆ ప్రశ్న అడగను కాని, మరి ఆయన తన సృష్టి అంతా ఇలాగ ఒక మానవమాత్రుడిచేత నాశనమైపోతూ వుంటే చూస్తూ వూరుకుంటాడేం? అతనే వుంటే నాశనం కావటం అతనికీ యిష్టమే నేమో! నేను నిమిత్తమాత్రుడిని.'

ఆమె కేమి జవాబు చెప్పడానికీ తోచలేదు. క్షణంసేపు మౌనం వహించింది.

'ఇదేనా నీ మరణ వాత్సల్యం! ఇదిగో ఈశ్వర సంకల్పం నెరవేర్చి చూపిస్తాను' అంటూ పిస్తోలుతీసి,

'ఎప్పటికీ ముక్కోటిసంఖ్య పెరగకుండా, తరగకుండా వుండడానికి మనం దేవతలం కాము కష్ట సుఖాలూ, మంచీ చెడ్డా, చావూ పుట్టుకా ఇంకా అవీయివీ గల మానవులం. మన లోకానికొక పరిమితి ఉంది. ఏ సైంటిస్టూ ఆ పరిమితిని పెంచలేడు. మనకి పుట్టుకమాత్రమే వుండి చావు లేకపోతే మన ఉనికికి ఎన్ని లోకాలన్నా చాలవు. నువ్వన్నట్లు పుట్టుకవున్న దానికి చావుతప్పదు గదా మరి నేను ఒకసారి చచ్చి బతికిందాన్ని, మళ్ళా ఇప్పుడు చావగలనో లేనో తెలీదు కాని నిన్ను చంపగలను. తప్పకుండా చస్తావు నువ్వు. చంపేస్తా' అని హుంకరించింది.

ఇంతలో ఏదో పెద్ద చప్పుడు.
పెద్ద చప్పుడే గాని శ్రవణపేయంగా వుంది.
అల్లంత దూరాన అభిముఖంగా
ప్రచండ వేగంతో పయనిస్తూ
కన్నులు మిరుమిట్లు గొల్పే
ఒక కాంతిచక్రం
క్షణంలో అణుశాస్త్రి హర్మ్యం వాకిట దిగింది.
ఇద్దరూ ఖంగారుపడ్డారు.
చక్రాకారం లోనుంచి సుళ్లు మిటకరిస్తున్న గోళాకారాలు కొన్ని అవతరిస్తున్నాయి.
ఆ గోళాకారాలు పొడవుగా దొన్నెలాగున్న తమ కాళ్లూ చేతులూ అణుశాస్త్రి హర్మ్యంవేపు చాపుతున్నాయి.
దాని గోడల నానుకున్నాయి.
ఎవరూ తలుపు తెరవకుండానే లోపల ప్రవేశించాయి.
ఆమె నిశ్చేష్ట అయినా నిర్భయంగా ఆ వింతను గమనిస్తోంది.
అణుశాస్త్రి వొణికిపోతున్నాడు.

'భయపడకండి మేము మీ సోదరులమే. కిన్నరులం. కుజగ్రహవాస్తవ్యులం. గంధర్వనగరంలో ఏదో ఉత్సవం జరుగుతూ వుంటే వెళ్లాం. ఇంతలో భూగోళంలో ఏదో ప్రళయం సంభవించిందని మాకు తెలిసింది. ఇప్పుడక్కడనుంచే మీ లోకాన్నొకసారి పరామర్శిద్దామని బయల్దేరి వస్తున్నాం' అని ఆ వచ్చిన గోళాల్లో ఒక పెద్దగోళం మాట్లాడటం మొదలుపెట్టింది.

'చాలాకాలంబట్టి మిమ్మల్ని మేం పరిశీలిస్తూనే వున్నాం. దఫదఫాల మా చక్రవాహనాలతో మీ లోకంమీద విహరించాం. వింత వింత యంత్రాల ద్వారా ఎప్పటికప్పుడు మీ నడతలు కనిపెడుతూనే

వున్నాం. అయితే యింత మూడిన తరవాతగాని ఇక్కడికి రావటం పడలేదు. మీరూ గ్రహాంతర ప్రయాణాలకి ప్రయత్నించారు. కాని మీ గ్రహాచారం మరోలా మారింది.

ఏమిటలా తెల్లబోయి చూస్తారు. మా వాలకం వింతగా వుందనా! అవును మాకు పనిచేసే ఉపకరణాలు కాళ్లూ చేతులూ, ఆలోచించే బుర్ర మాత్రమే వున్నాయి. కడుపు లేదు. మా బుర్ర యింతింత వుండటానికి కారణం ఒక పెద్ద మెదడు, ఆ పెద్ద మెదడు పక్కనే ఒక విశాల హృదయమూ అమర్చబడి వున్నాయి. మేము మీతో అసలీ కువలయంనుంచే విడిపోయి చాలా కాలమైంది. అప్పటినుంచీ మీలాగే అనేక విషయాల్లో పరిశోధనలు చేశాం. చేస్తున్నాం. బాహిరమైన ఏ విషయంగురించి ఎంత పరిశోధన చేస్తున్నా ఎప్పటికప్పుడే అంతరంగ శోధన కూడా చేసుకుంటూ వుంటాం. కాబట్టి అసలు మేము మీకు అనుజులమే అయినా సాధించిన అభివృద్ధి విషయంలో మాత్రం అగ్రజులమనే చెప్పాలి. ఇదంతా స్వోత్కర్ష అనుకోకండి. యథార్థాన్ని ఉద్ఘాటించటం మాత్రమే మా ఉద్దేశం.

మా ఎరుకనూ, అనుభవాన్నీ పురస్కరించుకొని మేమే కోరి కొన్ని సలహాలివ్వదలిచాం మీకు. ఇంత మూడిందిగదా అని—మీరు పాటించినా పాటించక పోయినా క్ష—మించండి మా మాటలు గాని కటువుగా వుంటే.

నైతికబలంలేని వట్టి పోరంబోకు నాగరికత మీది. ఆత్మవిశ్వాసమూ అపారనైతిక బలమూ, సత్య నిష్ఠగల నాగరికత మాది. మీరు బతుకు చివరిభాగమైన చావును సాధించడానికి చూస్తారుగాని ముందుగా దాని కుదురుపట్టైన పుట్టుక గుట్టు తెలుసుకోవడానికి ప్రయత్నించరు.

అహంకార మమకారా వేశాభినివేశాలతో మీ జీవయాత్ర ముగుస్తోంది. సృష్ట్యాది మూలసూత్ర రహస్యజిజ్ఞాస మా ఊపిరి. ఇచ్ఛాశక్తి సాధన మా జీవితం. అదేదో ఇంత దాకా మాకూ అంతుపట్టక పోయినా అద్భుత ఫలితాల నిచ్చింది. మాకు ఆ జ్ఞాన సాధన, శక్తిసాధన తప్ప మరి సమస్యలు లేవు. మేము ఏది ఆలోచించినా, పనిచేసినా మెదడుతో పాటే హృదయాన్ని కూడా వినియోగిస్తాం.

మీలో కొందరు ఈశ్వరు డెక్కడో ఉన్నా డనుకుంటారు. అసలు కొందరు లేనేలేడంటారు. మేమంతా ఏకగ్రీవంగా ఈశ్వరుడు మాలోనే వున్నా డనుకొంటాం. అలా గనుకొనేవాళ్లు మీలోనూ కొద్ది మంది వున్నారులెండి. కాని ఒక్క ముఖ్యమైన సద్భావంలోనైనా లోకంలో వున్నవాళ్లంతా ఏకీభవించకపోతే లాభంలేదు. అలాంటి ఏకీభావం ఏ ఒక్క విషయంలోనూ, ఏ కాలంలోనూ మీలో కుదరలేదు.

కోరికలకోసం మీరు దేవుణ్ణి ధ్యానిస్తారు.
దేవత్వం పొందాలన్నదొక్కటే మాకోరిక
మీ ఊహకీ, చేష్టకీ, అనుభవానికీ
చాలా తేడాలుంటాయి
మా కన్నిట్లోనూ ఏకవాక్యత వుంటుంది.

మీకు ఆకలి వేస్తుంటే తినాలని బుద్ధి పుడుతుంది. మాకు తినాలని సరదా పుట్టినప్పుడే ఆకలి వేస్తుంది. ఈమాటలు మీకు వింతగా కనిపిస్తాయి అర్థంకావు. మీబుద్ధి చాలా పరిమితమైనది. అది యీ మాటల అర్థం ఊహించలేదు. మేం చెప్పినా మీకిప్పు డప్పుడే బోధపడదు.

వాలములూడి వానరులే నరులైవారని విన్నాం. తోకలూడినా మీ కౌగుణాలు మాత్రం పూర్తిగా పోయినట్లు లేదు. కొన్ని విషయాల్లో కోతులుకూడా మీకన్నా చాలా నయమనిపిస్తాయి. వాటిలో ఎంత చక్కని సంఘీభావం ఏర్పడివుందని! మీరు గమనించారో లేదో కాని తోటి జీవి ఒక్కడు కాస్త కష్టపడుతూ వున్నట్టు అవి కాని గుర్తించడం తటస్థిస్తే పాపం ఎంతగానో విలవిలలాడిపోతాయి. కత్తులతోటే కావేషీలతోటే ఒకరి నొకరు నరుక్కోడానికి కూడా వెనుకాడరు మీమానవులు. ఒకజాతికి చెందిన జంతువులు కూడా మీలాగ తమని తాము చంపుకోవటం ఎరగం. అథవా అలాంటి దేమన్నా జరిగివున్నా మీ మానవుల్లో కొందరిలాగ రాక్షసులు కూడా తమజాతి మాంసం తాము తినివుండరు. ఆమధ్య అంటే నేటికి సరిగా ముప్పై యేళ్ళ క్రితం 1957 సం॥ నవంబరు ప్రాంతంలో మీలోకం లోకమంతా అతి నాగరక దేశం అని అనుకొనే ఒక గొప్ప దేశంలో ఒకపెద్ద విశ్వవిద్యాలయంవున్న పట్టణంలో నరమాంసభక్షకులుండేవారని విన్నాం. ఇంకా ఎన్నెన్ని అఘాయిత్యాలు చేశారని మీ మానవులు!

మీలోకం సుఖసమగ్రం కావటానికి అవకాశాలు లెక్కువే. కాని అవకాశాలన్నవి కొన్ని అసలే లేకపోలేదు. ఉన్నంతలో వాటిని సద్వినియోగం చేసుకోలేకపోయారు. దానికి కారణం మీలో చాలా మందిలో గూడుకట్టుకొని వున్న స్వార్థం, ఆశ, అసహనం, అసంతృప్తి. సుఖానుభూతికి నాగరికతతో నిమిత్తంలేదు. కొత్తగా సౌకర్యాలు పరిశోధన చేసి కనిపెట్ట నవసరంలేదు. సంతృప్తి వుంటే శాంతి, సౌఖ్యం అన్నీ వున్నట్టే. మిగతాకన్నీ సమస్యలే. అందులో అనేకం మీరు కోరి తెచ్చిపెట్టుకొన్నవే. మీ మానవసంఘమంతా దురదృష్టకరమైన ఆర్థిక సూత్రాలపై అంధవిశ్వాసాలపై, జాతిమత భాషాదిక బహుళవైవిధ్యంపై ఆధారపడివుంది. మీలోకంలో చాలా మందికి ప్రపంచపరిణామం, జీవిత వైఖరుల గురించి ఆలోచించే శక్తిలేదు. శక్తివున్న వాళ్ళకి ఆ అలవాటు లేదు. అందులోనూ ఈ యిరవయ్యో శతాబ్దిలో మరీ మితిమీరి పోయింది మీలోకం. ఏ విషయంలోనూ మీ జీవితాల్లో ఒక నియతీ, విలువ, విశ్వాసం, ప్రమాణం లేకుండా పోయాయి.

ఇంకా ఏమని చెప్పను! ఎంతని చెప్పను మీ లోకం వింతలగురించి! ఇంతకీ అణుశాస్త్రి, ఈలోకం లోకమంతటినీ ఒక్క మాటతో చేతిమీదుగా చక్కబెట్టిన అసాధ్యుడివి నీకు మేం చెప్పేదేముంది! పాపం నువ్వు ఏదో సదుద్దేశంతోనే యీ పుణ్యం కట్టుకున్నా నంటావు కాబోలు! పోనీలే ఇదీ ఒకందుకు మంచికే వచ్చిందేమో! అనేకవిధాల అశాంతిమయమైన లోకానికి ఎప్పటికీ ఓ గత్యంతరం కనిపించక అది నీ బాధ్యతే అయినట్లుగా ఒక పరిష్కార మార్గం చూపించావు. అయితే ఆ మీట నొక్కడంతో నీ పరిష్కార ప్రక్రియంతా అంతమై పోయిందనుకోకు. ఒక నవ్యమార్గంలో పునస్సృష్టి సంకల్పించు.

నువ్వు మహా మేధావివి. ఈమె లోకోత్తర సౌందర్యవతి. ఈ నవ్యసృష్టి మహాయాగంలో మీరుభయులూ ప్రధాన భాగస్వాములయితే ఒక అఖండ మేధావి, పరమశాంతుడు, ధీరోదాత్తుడు, అనుత్తమ మనస్వి, మహాతేజస్వి అయినపుత్రుడు పుడతాడు. ఇది మా ఆశయం. శాస్త్రీయమైన విశ్వాసం. మాకు అనుభూతపూర్వమైన విషయం. అతని అవతారం భూలోకానికి మరో సరిక్రొత్త, మహోజ్వలమైన, అన్వర్థ మన్వంతరం—కాగలదు.

కావలిస్తే మా లోకంతో మీరు రాకపోక లేర్పరచుకోవచ్చు. సంబంధబాంధవ్యాలుకూడా పెట్టుకోవచ్చు. ఆ నవమనువుకి ప్రియమైన వధువును మాలోకం నుండి తీసుకువస్తాం. ఒక క్రొత్తలోకం, క్రొత్తజాతి, అంతా సరిక్రొత్త అయిన ఒక ఉదాత్త వ్యవస్థ ప్రసాదిస్తాం. ఇతర లోకాలతో రాకపోకలు, ఇతోధిక బాంధవ్యాలూ ఏర్పరుచుకొని అందరం కలిసి కట్టుగా దేవత్వం సాధిద్దాం. ఈ మహోద్యమంలో మేమూ హృదయపూర్వకంగా మీతో సహకరించగలమని హామీ యిస్తున్నాం. ఇదే మీ ఉభయులకీ మాఆహ్వానం. మా లోకం ఎంత మధురంగా, ప్రశాంతంగా, ఉల్లాసంగా వుంటుందో స్వయంగా చూద్దురుగాని, ఒకసారి దయచెయ్యండి. అక్కడే ఆత్మసాక్షికంగా మీ వివాహం అతి వైభవోపేతంగా జరిపిస్తాం. సిద్ధచారణ గంధర్వ విద్యాధరాదు లంతా అతిథులుగావచ్చి శుభాశీస్సు లిస్తారు. పదండి' అని గోళస్వామి ఉపన్యాసం ముగించాడు.

ఇవనోవా, అణుశాస్త్రి—ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూచుకున్నారు. ఇవనోవా సిగ్గులో పరమాణుశాస్త్రి చిరునవ్వు నిగ్గు ప్రతిఫలించింది. ఇద్దరి హృదయాలూ పరస్పరం పలకరించుకునిస్పందించాయి.

ఇద్దరూ హృదయపూర్వకంగా కుజగ్రహవాస్తవ్యుల ననుసరించి చక్రవాహనారోహణం చేశారు.

చక్రవాహనం గంధర్వ నగరం మీదుగా పయనిస్తూ అంతర్థానమైంది.

ఆ వేళ భూలోకంఖాళీ అయిపోయింది పూర్తిగా. ఒక మహా మన్వంతరం గడిచింది.

అనంతర యుగభావనలో అంతర్వాణి శీర్మకు మగత పట్టింది. మగతలోనూ ఏవో మంచి మంచి కలలే కన్నాడు, కలకల నవ్వేడు, కలవరించాడు. పలపల తెల్లవారింది. పంచాంగం మారింది. ప్రపంచం మారుగాక!

# మధ్యధరాప్రాంత బలాబలాలు

శ్రీ పి. వి. ప్రసాదరావు

మానవ చరిత్ర మొత్తంమీద, మధ్యధరా సముద్రం వలె మరో సముద్రం ఏదీ అంత ప్రాధాన్యత వహించలేదు. పైగా ప్రపంచ వ్యవహారాలలో మధ్యధరా సముద్రతీరాన గల రాజ్యాలు చరిత్ర ప్రసిద్ధమైన పాత్ర వహించినవి. ఈనాడు అవి అటు రష్యాకు, ఇటు పాశ్చాత్యరాజ్యాలకు చాలా ప్రధానమైన స్థానంలో ఉన్నవి. అందుకే వాటి విషయంలో ఈ అగ్రరాజ్యాలు ఆసక్తిని గనబరుస్తున్నవి. మూడవ ప్రపంచయుద్ధమే వస్తే, ఈ అగ్రరాజ్యాలలో ఏదైనా సరే వానిమీద ఆధారపడవచ్చునా అనేది ఈనాటి పెద్ద సమస్యలలో ఒకటి.

ఈనాడు అనేక కారణాలవల్ల మధ్యప్రాచ్య రాజకీయాలకు ఎంతో ప్రాధాన్యత ఉన్నది.

రెండవ ప్రపంచయుద్ధం జరుగక పూర్వం అమెరికా మధ్యధరాసముద్రంలో రాజకీయ, వర్తక వ్యాపార కారణాలవలన ఒక సైనికదళాన్ని నిల్పింది. కాని క్రమేణా బ్రిటను, అమెరికాలు రెండూ—ఫ్రాన్సుతో సహా—మధ్యధరాసముద్ర రాజ్యాలలో ఒకటిగా చేరిపోయినవి. రష్యాకు వ్యతిరేకంగా టర్కీకి మద్దతు ఇచ్చి మధ్యధరాసముద్ర ప్రాంతంలో ఒక బలవత్తరమైన రాజ్యంవలె టర్కీని నిలబెట్టినవి. ఇక స్పెయిన్, ఇటలీ, ఆస్ట్రియా హంగరీలు స్థానికంగా మాత్రమే పాత్రవహించినవి.

మొత్తంమీద, రెండు ప్రపంచయుద్ధాలలో మధ్యధరాతీరంలో అనేక సంఘటనలు జరిగినవి. ఫ్రాన్సు సిరియానుండి వైదొలిగింది. ఉత్తర ఆఫ్రికాలో అది అసంతృప్తికి గురిఅయినది. బ్రిటను ఇప్పటికీ జిబ్రాల్టర్, మాల్టా, సైప్రస్, ఏడెన్ మొదలైన ప్రాంతాలలో కీలకస్థానాలను నిల్పుకోగలిగినా-దూరదూరంగా ఉన్న భారతదేశంవంటి రాజ్యాలనుండి తప్పుకొని బయటపడినది. ఈ విధంగా ఏర్పడిన ఒకరకమైన ఖాళీలో రష్యా, అమెరికాలు ప్రవేశించటానికి ప్రయత్నిస్తున్నవి.

ఇది ఇలా ఉండగా మధ్యధరాసముద్రతీరం వెంబడి ఉన్న రాజ్యాలు వస్తుతః బలవత్తరమైనవిగాల గనుక, స్వశక్తిమీద నిలబడలేనివిగనుక అటు బ్రిటను అమెరికాలవైపో, లేక ఇటు రష్యావైపో మొగ్గుతున్నవి.

పైకి బ్రిటను, అమెరికాలు రెండూ ఒకటిగానే కనిపించినా, 20 శతాబ్ది ఆరంభంవరకేగాక ఈ నాటి వరకూగూడ, మధ్యధరాసముద్రంమీద ఒకరిని మించి ఒకరు, అధిపత్యం, సంపాదించుకోవాలని కృషి చేస్తున్నారు. అలా చేస్తున్నా రష్యా విషయం వచ్చేటప్పటికి అవి రెండూ తమ కత్తులను కట్టిపెట్టి ఒక త్రాటిమీద నడుస్తున్నవి. లేకపోతే మధ్యధరా సముద్రంమీద రష్యా అధిపత్యం సంపాదిసుందని భయం. ఈభయమే గనుక లేకపోతే ఈ రెండూ ఏ నాడో ఒకదాన్ని ఒకటి నాశనం చేసికొనేవే.

కాని చిత్రం ఏమిటి అంటే, మధ్యధరాసముద్రం చుట్టూ అనుకొనిఉన్న రాజ్యాల విషయం ఎలా ఉన్నా ఎక్కడో వేలకొలది మైళ్ళదూరాన ఉన్న బ్రిటను, అమెరికా, రష్యాలు, ఈ సముద్రంమీద పెత్తనం సంపాదించుకోవాలని తాపత్రయపడుతున్నవి. ఈ ఒక్క అంశాన్నిబట్టి, మన భారతప్రధాని నెహ్రూ ప్రవచించిన సహజీవన సిద్ధాంతానికి అక్కడ ఎట్టి అవకాశమూ, ఎన్నడూ లేదని చాలా సులభంగా అర్థమయిపోతున్నది. అందుకే అక్కడ అశాంతి. ఈ అగ్నిపర్వతం ఎప్పుడో ఒకప్పుడు బ్రద్దలయి తీరుతుంది. తప్పదు.

ఇక మధ్యధరాసముద్రం చుట్టూవున్న రాజ్యాల విషయం తెలుసుకొందాము. నిజానికి ఆ రాజ్యాలు ఆ సముద్రంచుట్టూ గనుక లేకపోతే వానికి ప్రపంచ

రాజకీయచరిత్రలో చెప్పుకోదగినస్థానం ఉండేదేగాదు.

కాగా ఆ రాజ్యాలు ఏమిటి?

అవి: స్పెయిన్, ఫ్రాన్సు, ఇటలీ, ఆల్బేనియా, యూగోస్లావియా, గ్రీస్, టర్కీ, సిరియా, అరేబియా, లెబనాన్, ఇజ్రాయిల్, ఈజిప్టు, లిబియా, అల్జీరియా, మొరాకో, టునీషియాలు. ఈరాజ్యాలు మధ్యధరా సముద్రం ఆనుకొని దానిచుట్టూ ఉన్నవి.

వీనిలో మొదటి ఏడురాజ్యాలు మధ్యధరా సముద్రానికి ఉత్తరదిక్కుగా ఉన్నవి. ఇక తరువాతి నాలుగురాజ్యాలు తూర్పుదిక్కుగా గలవు. ఇవి చాలా బలహీనమైనవి. మిగిలినవి దక్షిణముఖంగా ఉన్నవి. ఈ మొత్తం అన్నిరాజ్యాలలోకలిసి 25 కోట్ల జనాభా ఉన్నది.

ఈ రాజ్యాల భద్రతమీద, మధ్యధరాసముద్ర రక్షణ ఆధారపడి ఉన్నది. కాగా ఈ రాజ్యాలలో ఏవి బ్రిటన్, అమెరికాలకు అనుకూలంగా ఉన్నవి, ఏవి లేవు అనేవిషయాలనుకూర్చి తెలిసికొంటే మధ్యధరాసముద్ర రక్షణ ఎవరిచేతుల్లో ఉన్నది తెలిసిపోతుంది.

ఈ పైచెప్పిన రాజ్యాలలో ఒక్క ఆల్బేనియా పూర్తిగా రష్యా అధీనంలో ఉన్నది. సిరియాలో రష్యా ప్రాబల్యం ఉన్నది. అలాగే ఈజిప్టుకూడా కొంతవరకు రష్యా పక్షమే. బ్రిటన్ అమెరికాలకు ఈజిప్టు పూర్తిగా వ్యతిరేకి. మొరాకోలో మొరాకో సైనికులకు స్పెయిన్ సైనికులకు పోరాటం తగ్గలేదు.

అల్జీరియాలో ఫ్రెంచిప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవం జరుగుతున్నది. టునీషియాకు నామమాత్రంగా స్వాతంత్ర్యాన్ని ప్రసాదించింది ఫ్రాన్సు.

ఇది అలాఉండగా సైప్రెస్‌దీవి విషయంలో బ్రిటన్, గ్రీస్, టర్కీలకుఘర్షణ ఉండనేఉన్నది. సిరియాలో రష్యాప్రాబల్యంఉన్నది.

యూగోస్లావియా రష్యాతో సంబంధం తెంపుకున్నది. టర్కీలో అమెరికాప్రాబల్యం ఉన్నది. గ్రీస్‌లో విప్లవాగ్నిని చల్లార్చటం జరిగింది. లిబియా స్వాతంత్ర్యం పొందింది.

ఈవిధంగా ఏర్పడిన ఒకరకపు అంచనావలన, మధ్యధరాసముద్రంలోగల రాజ్యాల భద్రతకుగానీ, లేక ఆసముద్ర పరిరక్షణకుగానీ, అటు బ్రిటను అమెరికాల పాత్ర ఇటు రష్యాపాత్ర ఎలాఉన్నదో సులభంగా అర్థంచేసికోవచ్చు.

ఆయారాజ్యాల భద్రత అనేది ఆయారాజ్యాల ఆంతరంగిక వ్యవహారాలమీద ఆధారపడిఉన్నది. ఈ ఆంతరంగిక వ్యవహారాలలో ఏదోవిధాన బ్రిటన్, అమెరికా, రష్యాలు వర్తకవ్యాపారసంబంధాల ద్వారాగానీ, లేక మిలిటరీ, ఆర్థికసహాయం ద్వారాగాని జోక్యం గలుగజేసికోవటానికి ఒకదాన్నిమించి ఒకటి ప్రయత్నం చేస్తుంటవి స్వశక్తిలేని కారణంగా, ఆరాజ్యాలు ఏదో పెద్దరాజ్యంమీద ఆధారపడకతప్పదు. కనుక అవిసంగా వాటంతటఅవే పెద్దరాజ్యాల ప్రవేశానికి అవకాశం ఇస్తున్నవి. అని అర్థంఅవుతున్నది. కాగా పెద్దరాజ్యాలే మధ్యధరాసముద్ర పరిరక్షణ విషయంలో శ్రద్ధవహిస్తున్నవని సులభంగా తేలిపోతున్నది.

ఇకపోతే మధ్యధరాసముద్రం ప్రధాన్యం ఎలాంటిది అనే విషయం తెలిసికొందము.

ఈ ప్రాధాన్యం మూడుకారణాలమీద ఆధారపడిఉన్నది.

1. అటు హిందూమహాసముద్రంలోకి పోదలచినా లేక దక్షిణ ఆసియారాజ్యాలతో వర్తకవ్యాపారాదులు జరుపుకోదలచినా ఈ పాశ్చాత్య ప్రపంచ రాజ్యాలు మధ్యధరాసముద్ర మార్గాన్నే పోవాలి. ఇదే దగ్గరదారి. చాలా తక్కువకాలంలో ప్రయాణం జరగటంవలన రాకపోకల ఖర్చులు తక్కువ అవుతవి. కాని సర్వదా ఇది సురక్షితమైన దారిమాత్రంగాదు. ఈమధ్య ఈజిప్టు సూయజుకాలవను మూసివేయటంతో పాశ్చాత్యరాజ్యాల ఓడలు ఆఫ్రికాచుట్టూ తిరిగి రావలసివచ్చినది. ఇది చాలా దూరప్రయాణం. ఎంతో ప్రమాదం అంటూ ఉంటే తప్ప ఓడలు ఆ మార్గాన వెళ్లవు. మొత్తంమీద ఈమధ్యధరాసముద్ర మార్గమే వాంఛనీయం.

2. మధ్యప్రాచ్యరాజ్యాలయిన ఇరాన్, ఇరాక్ అరేబియాలలో నూనెగనులు బ్రిటన్, అమెరికా దేశాలవారికి ఎంతో ఆర్థికంగా లాభాలు సంపాదించిపెడుతున్నవి. అలాంటి వాటిమీద రష్యా ఎప్పుడైనా దాడిచేస్తే ఆదాడిని ఎదుర్కొనటానికి మధ్యధరా సముద్రమార్గం ఒకటే ఈ పశ్చిమ రాజ్యాలకు దగ్గరదారి.

3. రష్యాకు చెందిన కాకసస్ ప్రాంతాలలోని నూనె గనులనుగాని, యూరల్ ప్రాంతాలలోని బ్రహ్మాండమైన పారిశ్రామిక స్థావరాలనుగాని ధ్వంసం చేయాలంటే తూర్పు మధ్యధరాసముద్రంలోని ఆయా నౌకా, విమాన ఆశ్రయాలనుంచి సులభంగా బ్రిటన్, అమెరికాలు దాడి చేయగలవు.

ఉదాహరణకు ఒక సంగతి: కెనడాలోని అలాస్కాలోగల విమానాశ్రయంనుంచి మాస్కో మీదకు దాడిచేయాలి అంటే బాంబర్లు సుమారు 5 వేలమైళ్ళ పైగా ప్రయాణం చేయాలి. కాని ఏ టర్కీలోని విమానాశ్రయంనుంచో, ఏ సైప్రెస్‌లోని విమానాశ్రయంనుంచో మాస్కో మీదకు దాడిచేయాలంటే బాంబర్లు సుమారు 1500 మైళ్ళ ప్రయాణం చేస్తేచాలు. కనుక ఈ మధ్యధరాసముద్రం ప్రాధాన్యం ఈవిషయం వలన మరీబాగా అర్థం అవుతున్నది, ఈమార్గం గాని, ఈ మార్గంలోగల ఆయా నౌకా, విమానాశ్రయాలు గాని పశ్చిమరాజ్యాలకు చాలా లాభదాయకం. అందుకే మధ్యధరాసముద్ర రాజ్యాల యోగక్షేమాల పట్ల అచ్చటి రాజకీయాలపట్ల పశ్చిమరాజ్యాలు అత్యంత శ్రద్ధాసక్తులు గనబరుస్తున్నవి. వాని భవిష్యత్తు విషయంలో శ్రద్ధవహిస్తున్నవి అంటే మధ్యధరా సముద్ర రక్షణ విషయంలో శ్రద్ధ గనబరుస్తున్నవి అని తాత్పర్యం. ఈ ప్రధానాంశం మాత్రం ఎన్నటికి విస్మరించరాదు.

ఈ ప్రధానాంశం ఒక్క పాశ్చాత్యరాజ్యాల విషయంలోనే గాక రష్యా విషయంలోనూ వర్తిస్తుంది. ఆ రాజ్యాలు మధ్యధరా సముద్రతీరంలోగలరాజ్యాల రాజకీయాలపట్ల, మధ్యధరా సముద్రరక్షణపట్ల ఏ ఆశయంతో, ఏదృష్టితో ఆసక్తిని గనబరుస్తున్నవో, రష్యా గూడా అదే ఆశయంతో, అదేదృష్టితో ఆయా రాజ్యాల రాజకీయాలపట్ల, మధ్యధరాసముద్ర సంరక్షణపట్ల ఆసక్తిని గనబరుస్తున్నది.

ఎక్కడో దూరానగల అలాస్కా మీదకిగాని, వాషింగ్‌టన్, న్యూయార్కు నగరాల మీదకిగాని దాడి చేయాలంటే మాస్కో లెనిన్‌గ్రాడ్‌ల నుంచి కన్నా, అల్బేనియా, సిరియా, ఈజిప్టులనుంచి తక్కువ వ్యయంతో తక్కువ కష్టంతో, తక్కువ కాలంలో ఆపని పూర్తిచేయవచ్చు.

కనుక రష్యా ఒకవైపు, బ్రిటను అమెరికాలు వేరొక వైపు మధ్యధరా సముద్రం మీద ఆధిపత్యం వహించడానికి నిరంతరం కృషిచేస్తున్నవని సులభంగా గ్రాహ్యం అవుతున్నది.

కాగా మధ్యధరాసముద్ర రక్షణకు పాశ్చాత్య రాజ్యాలకు అనుకూలంగా ఉన్న రాజ్యాల బలాబలాలు ఎలా ఉన్నవి. మిగతా రాజ్యాల బలాబలాలు ఎలా ఉన్నవి, అనే విషయం గమనించాలి.

పాశ్చాత్య రాజ్యాలకు అనుకూలంగా ఉన్న రాజ్యాల విషయం ఆలోచిద్దాం.

వాటికి స్పెయిన్, ఇటలీ, టర్కీ, గ్రీస్, ఇస్రాయిల్-ఇవి ముఖ్యంగా అనుకూలంగా ఉన్న రాజ్యాలు. స్పెయిన్ 1953 సెప్టెంబరులో అమెరికాతో చేసికొన్న ఒప్పందం కారణంగా చాలా వరకు పురోగమిస్తున్నది. పశ్చిమ యూరపు మీద గానీ, ఇటలీ సింధు శాఖ మీదగానీ మధ్యధరా సముద్రంలో ఏ ప్రాంతం మీదగానీ రష్యనులు దాడి జరిపితే, స్పెయిన్ కోస్తా తీరమందలి విమాన, నౌకాశ్రయాలనుంచి ఆ దాడిని పాశ్చాత్యరాజ్యాలు సులభంగా ఎదుర్కొన గలవు.

పశ్చిమ దిక్కుగా మధ్యధరాసముద్రంలోకి రావాలి అంటే మున్ముందు స్పెయిన్ దేశాన్ని దాటాలి. ఇంతకూ అది అత్యంత కీలక స్థానంలో ఉన్న రాజ్యం.

స్పెయిన్ సైన్యం చెప్పకోదగినంత బలవత్తరమైనది కాదు. వారిలో గొరిల్లాలు అధికం.

ఇక ఇటలీ విషయం. మధ్యధరా సముద్ర తీరమందలి అన్ని రాజ్యాలలో కన్నా ఇటలీలో జనాభా అధికం. ఫ్రాన్సు తరువాత పారిశ్రామికంగా ఉన్నతి పొందిన రాజ్యం ఇటలీ ఒక్కటే. అమెరికా మిలిటరీ నిపుణులు ఇక్కడ సైనికులకు శిక్షణ ఇస్తుంటారు. పాశ్చాత్య రాజ్యాలకు ఇది అనుకూలంగా ఉన్నా, ఇక్కడ కమ్యూనిస్టుల ప్రాబల్యం గూడా ఉన్నది. తత్కారణంగా పాశ్చాత్య రాజ్యాలకు దీనివలన రాగల సాయం అనుమానాస్పదంగానే ఉన్నది కొంతవరకూ.

ఇక, టర్కీ సంగతి: టర్కీ జనాభా 2 కోట్లు. సైన్యం 300,000. అమెరికా సహాయంతో, దేశం ఎంతో ముందంజ వేసింది. మంచి మిలిటరీ బలంగల

దేశం, టర్కీ కూడా మంచి కీలకస్థానం ఉన్న రాజ్యం.

గ్రీస్, టర్కీ కన్నా చిన్నదే అయినా దానికి ఆరితేరిన మిలిటరీ బలం మాత్రం ఉన్నది. దీనికి కూడా అమెరికా అండదండలు ఉన్నవి.

ఇజ్రాయిల్ కూడా అమెరికా సాయం మీద ఆధారపడిన రాజ్యం. పాలస్తీనా పోయి దాని స్థానంలో ఇటీవలగా ఇది ఏర్పడింది. ఇది పూర్తిగా పాశ్చాత్య రాజ్యాలకు అనుకూలం.

పాశ్చాత్యరాజ్యాలకు కొంతవరకు అనుకూలంగా ఉన్న రాజ్యాలలో యుగోస్లావియా ఒకటి. దీనికిగల మిలిటరీబలం చెప్పుకోదగినది. ఈ బలానికి కారణం అమెరికా సాయమే అని చెప్పాలి.

కాని ఇది కమ్యూనిస్టు దేశం. అంతమాత్రం చేత రష్యా అండదండల మీదనే ఆధారపడిన దేశం గాదు. రష్యా విదేశాంగ విధానం అంటే మార్షల్ టిటోకు ఇష్టం లేదు. టిటో స్వతంత్రభావాలు గల వ్యక్తి.

ఈమధ్య ప్రపంచంలోని కమ్యూనిస్టు రాజ్యాలన్నీ ఏకంగావాలి అని రష్యా, మిగతా 11 కమ్యూనిస్టు రాజ్యాలు ఒక కరపత్రాన్ని ప్రకటించినవి. దానిమీద అన్ని కమ్యూనిస్టు రాజ్యాలు సంతకం పెట్టినవి గాని యుగోస్లావియా మాత్రం సంతకం పెట్టలేదు. కనుక దీనినిబట్టి రష్యాపట్ల టిటో వైఖరి ఎలాంటిదో స్పష్టం అవుతున్నది. ఇక వేరొకవిషయం. పోనీ పాశ్చాత్య రాజ్యాలకే పూర్తిగా అనుకూలంగా ఉంటుందా అంటే, అదీ సంశయాస్పదమే, దానికి ఒక నిదర్శనం కనిపిస్తున్నది.

10-12-57 నాటి వార్తప్రకారం, అమెరికా ఇస్తున్న మిలిటరీ సహాయాన్ని ఇక ఆపివేయమని యుగోస్లావియా కోరినట్లు తెలుస్తున్నది. కనుక దీనిని బట్టి యుగోస్లావియా భవిష్యత్తులో పాశ్చాత్య రాజ్యాల పట్ల ఎలాంటివైఖరి అవలంబించనున్నదీ అవగతం అవుతున్నది. నిజానికి, అది యుగోస్లావియా మీద మధ్యధరాసముద్ర రక్షణకు ఆధారపడి ఉంచటం దూరాలోచనతో కూడినట్టి పని గాదు.

ఇక ఫ్రాన్సు సంగతి. ఫ్రాన్సు వస్తుతః మిలిటరీ బలం గలదేశమే అయినా రాజకీయంగా స్థిమితంలేని రాజ్యం.

ఇది అలా ఉండగా బ్రిటను, అమెరికాలతో గల సంబంధాలు ఇటీవల చెడిపోయినవి. అవి ఇప్పట్లో బాగుపడతవనే నమ్మకం కూడా ఏమంత కనపడటం లేదు.

మొన్న మొన్నటివరకు ఫ్రాన్సు అధీనంక్రింద ఉండి ఈనాడు నామమాత్రంగా స్వాతంత్ర్యం అనుభవిస్తున్న టునీసియాకు బ్రిటను అమెరికాలు ఆయుధాలు సప్లయి చేసినవి.

తనొక్కతే ఆయుధాలు టునీసియాకు సప్లయి చేయాలని ఫ్రాన్సు అభిమతం. అంతేగాక, బ్రిటను, అమెరికాలు టునీసియాకు పంపిన ఆయుధాలు టునీసియా ప్రక్కనే ఉన్న అల్జీరియాలోని విప్లవకారుల చేతులలో బడతవని ఫ్రాన్సు భయం.

ఫ్రాన్సు భయం ఇది అయితే, బ్రిటను, అమెరికాలకు మరోభయం ఉన్నది. తాము గనుక టునీసియాకు ఆయుధాలను సప్లయిచేయకపోతే రష్యా టునీసియాకు ఆయుధసామగ్రిని అందజేస్తుందనీ, అపుడు రష్యా మధ్యధరాసముద్రం మీద ఉత్తర ఆఫ్రికామీద ప్రాబల్యం సంపాదించుకొంటుందని బ్రిటను అమెరికాల భయం.

ఈ పరిస్థితులలో ఫ్రాన్సు మధ్యధరా సముద్ర రక్షణకు ఏవిధంగా బ్రిటను, అమెరికాలకు తోడ్పడుతుందీ అనేది చెప్పలేం.

పైగా బ్రిటను, అమెరికాల చర్యలపట్ల ఫ్రాన్సుకు ఒకప్రక్క అనుమానం, వేరొకప్రక్క ఆందోళన ఏర్పడినది.

ఉత్తర అట్లాంటిక్ రక్షణవ్యవస్థలోగల సభ్యత్వ రాజ్యాలన్నింటికన్నా—అమెరికా తరువాత తనదే పైచెయ్యి అనిపించుకోవాలని బ్రిటను ఆశిస్తున్నదని, అంతేగాక అల్జీరియాలో ఫ్రెంచివారు సాగిస్తున్న పోరాటంపట్ల బ్రిటను తన పూర్వపు వైఖరిని మార్చుకొన్నదని ఫ్రాన్సు అనుమానపడుతున్నది. అంతేగాక ఉత్తరఆఫ్రికాలోగల టునీషియా, మొరాకో, అల్జీరియాలలో బ్రిటను, అమెరికాలు క్రమేణ తమపెత్తనం చెలాయించాలని చూస్తున్నవని కూడా ఫ్రాన్సు ఆందోళన పడుతున్నది.

ఇలాంటి పరిస్థితిలో, మధ్యధరాసముద్ర రక్షణ విషయంలో పాశ్చాత్యరాజ్యాలతో ఫ్రాన్సు ఎంత వరకు తోడ్పడుతుందీ అనేది సందేహాస్పదం.

ఇక బ్రిటను అమెరికాల సంగతి వీటి రెండింటికీగల బలం, మధ్యధరాసముద్ర పరిరక్షణకు, బందోబస్తుకు చాలావరకు తోడ్పడుతుంది. ఏ క్షణంలో ఏ దూరప్రదేశానికి తమ సేనలను తరలించాలన్నా, అవి సులభంగా, త్వరితంగా ఆపని చేయగలవు. స్పెయిన్, గ్రీస్, టర్కీ, ఇటలీ, అరేబియా, ఇరాక్, లిబియా, జోర్డాన్ ఈ ప్రాంతాలన్నింటిలో వాటికి నౌకా, విమానాశ్రయాలు గలవు.

కాని ప్రస్తుత పరిస్థితులలో, రష్యా బ్రిటను, అమెరికాలకన్నా పైచెయ్యిగా ఉన్నది. ఈమధ్య రష్యాలో బయలుదేరిన రాకెట్ల ఫలితంగా, బ్రహ్మాండమైన శాస్త్రవిజ్ఞాన పరిశోధనల ఫలితంగా, బ్రిటను, అమెరికాలు రెండూ కలవరపడినవి. ఈ కలవరపాటు ఇంకా కొంతకాలంవరకు ఉంటుందనే చెప్పాలి. దానికి కారణం అమెరికా, రష్యావలె ఇప్పట్లో అటు అలాంటి రాకెటునుగాని, ఇటు బ్రహ్మాండమైన ఇతర ఆయుధాలను అంత అధికంగా బాంబర్లు, జెట్ ఫైటర్లను తయారుచేయలేదని తేలిపోయింది.

కనుక ఇలాంటి పరిస్థితులలో మధ్యధరాసముద్ర తీరానగల రాజ్యాలలో చాలావాటికి రష్యాతో స్నేహం చేయాలనే అభిలాషవున్నది. ఈ సంగతి ఇప్పుడిప్పుడే బాగా అవగతం అవుతున్నది. ఈ ప్రమాదాంశాన్ని బ్రిటను అమెరికాలు తెలిసికొని తదనుగుణంగా వ్యవహరిస్తున్నవి. అవి అలా తెలిసికొన్నట్లు అటు రష్యా, రష్యాతోపాటు సిరియా, ఈజిప్టు, ఉత్తరఆఫ్రికాలో కొన్ని రాజ్యాలు తెలిసికొని తదవసరమైన విధంగా వాటి భవిష్యత్కార్యక్రమానికి రూపురేఖలు దిద్దుకొంటున్నవి.

ఏది ఎలా జరిగినా అటు బ్రిటను, అమెరికాలుగాని, ఇటు రష్యాగాని తొందరపడి ఎలాంటి తెలివితక్కువపని చేయవు. సాహసానికి దారితీసే ఎలాంటి నిర్ణయాలను చేయవు.

నిజానికి ఇంచుమించుగా రెండుపక్షాలు సమానఉజ్జీలుగా ఉన్నవి. తిరస్కారంగానే పైకి ఎన్ని అవాకులు చెవాకులు పలికినా, తీరా కార్యరూపంలోకి వచ్చేటప్పటికి వెనుకంజ వేస్తున్నవి. ఇరువురిలో ఏ ఒకరు అధికంగా బాగా పైచెయ్యిఅయినా, ఈ నాడు ప్రచ్ఛన్నయుద్ధం అంటూ ఉండేదే గాదు. మధ్యధరా సముద్రతీరానగల రాజ్యాల రాజకీయ వాతావరణం సంక్షుభితంగా ఉండేదే గాదు.

ఏది ఎలా జరిగినా మూడవ ప్రపంచయుద్ధంవస్తే మాత్రం ఈసారి మధ్యధరాసముద్ర రక్షణ ఎవరి చేతుల్లోకి పోయేది లేకపోగా సర్వనాశనం సంప్రాప్తించుతుంది. పైవిషయాలను సరిగా అవగతం చేసుకుంటే, భారతదేశం ప్రతిపాదించుచున్న సహజీవనవిధానంతప్ప అగ్రరాజ్యాలకు గత్యంతరం లేదని సులభంగా బోధపడుతుంది.

# రాత్రించరులు

శ్రీ అంగర సూర్యారావు

పాత్రలు: అవతారం, భద్రం, భూషణం, రామస్వామి, రంగయ్య, చంద్రం, తార.

** ధర్మసత్రం; హాలు మధ్య సిమెంటు అరుగు ఒకటి వుంది. అరుగుకు ఎడమ వైపున ఒక పొడవైన బల్ల వుంది. దూరాన్నుంచి ఎలక్ట్రిక్ దీపపుకాంతి హాలులోకి ప్రసరిస్తోంది. ఎడమవైపు గదిద్వారం మూయబడివుంది. కుడి వైపు వీథిలోకి వెళ్లే ద్వారం తెరిచి వుంది. కుడివైపు నుంచి బెడ్డింగు భుజం మీద వేసుకొని అవతారం ప్రవేశిస్తాడు. చుట్టూ పరికించి చూస్తాడు. అరుగుమీద బెడ్డింగు పరుస్తాడు. ఒక నిట్టూర్పు విడిచి అరుగుమీద కూర్చుంటాడు. ఈసారి ఎలక్ట్రిక్ దీపపు కాంతి అతని ముఖంమీద పడుతుంది. అతను కట్టుకున్న పరాయి, లాల్చీ మాసిపోయివున్నై. ముఖంలో నిరాశ కనిపిస్తోంది. వయస్సు 35 సంవత్సరాలు. కుడివైపునుంచి తొందరగా భద్రం వస్తాడు. బొమ్మలు వున్న అమెరికన్ జాకెట్, ఫుల్ఫాంట్ వేసుకున్నాడు. షోగ్గా తల వెనుకకు దువ్వాడు. వయస్సు సుమారు 28 సంవత్సరాలు.

భద్రం: (ప్రవేశిస్తూ) అహహ, చలి, చలి, ఏమిచలిరా బాబూ యిది. ఇంగ్లండుదేశం కంటే అన్యాయంగా వుంది. (అవతారాన్ని సమీపించి) ఒక సిగరెట్ యిలా పారెయ్యరా! రామస్వామి!

అవతారం: నేను రామస్వామిని కాను.

భద్రం: (విసుగా) రామస్వామివి కాకపోతే రంగయ్యవు. చలికి ప్రాణం పోతోంది. ముందు సిగరెట్ యిచ్చి మాట్లాడు.

అవ: (జేబులోనుంచి సిగరెట్టు పెట్టె తీసి భద్రానికి యిస్తూ) నేను రంగయ్యనుకూడా కాదు.

భద్రం: (సిగరెట్టు వెలిగించి గట్టిగా పీల్చి ఆశ్చర్యంతో) అరే! నువ్వు రామస్వామివీ కాక-రంగయ్యవీ కాక మరి ఎవరవయ్యా? మహానుభావా! [యీ సారి అవతారంకేసి తేరిపార చూస్తాడు]

అవ: నేను అవతారాన్ని.

భద్రం: (నిరుత్సాహంగా) దగా! దగా! రంగయ్యగాడు రామస్వామిగాడు నన్ను నిలువునా దగాచేసి పారేశారు. సరిగ్గా రాత్రి పదకొండు గంటలకు రమ్మన్నారు. అలాగే తగులడ్డాను. అందులోను సరికొత్త పేక కొనుక్కొని మరీ వచ్చాను. (జేబులోనుంచి పేకతీస్తూ) మరేం చేస్తాం! పాములేని పాములాడు బురదపామును పట్టుకున్నాడట! రండి అవతారంగారు! మనం ఒక ఆటవేద్దాం (పేక కలుపుతాడు.)

అవ: నాకు పేకాట చేతకాదు.

భద్రం: (ఆశ్చర్యంతో) అరే! పేకాటే చేతకాదూ? ఏ వూరయ్యా నీది?

అవ: (నిస్పృహతో) ఏ వూరైతే నేమి? నావూరినుంచి నేను గెంటివేయబడ్డాను.

భద్రం: దారిదోపిడిలో ఏమైనా భుజం వేశావా?

అవ: లేదు.

భద్రం: అయితే నీకు ఓ చిన్న ఉపాయం చెబుతాను. విను. మన రౌడీరంగయ్య వున్నాడు మాశావా?

అవ : నాకు తెలియదు.

భద్రం: నీకు తెలియదులే వాడు యిప్పుడే వస్తాడు. వాడి చేతిలో ఒక పదిరూపాయలు కాగితం పెట్టు. అంతే. నిన్ను నీ పూరినుంచి గెంటేసిన వాళ్ళని పచ్చడిచేసి వదిలేస్తాడు.

అవ : నన్ను మనుషులు గెంటివెయ్యలేదు. పరిస్థితులు నన్ను జీవితిమ్మరిని చేసినై.

భద్రం: (తాపీగా అతని ప్రక్కను కూర్చుని) ఎందుకయ్యా యీ డొంకతిరుగుడు సమాధానం! అసలు సంగతేమిటో చెప్పకూడదూ?

అవ : నాకు చిన్నప్పటినుంచి బొమ్మలు వెయ్యడం అంటే ఎంతో యిష్టం.

భద్రం: నాకు చిన్నప్పటినుంచీ పేకాట అంటే ఎంతో యిష్టం ఏం చేస్తాం? ఎవడి యిష్టానిష్టాలు వాడివి. ఊ! తరవాత......

అవ : మా నాన్నగారు బడిపంతులుగా పనిచేసి రిటైర్ అయ్యారు.

భద్రం: మా నాన్నగారు బతికివున్న రోజుల్లో సర్కిల్ ఇనస్పెక్టర్ అఫ్ పోలీసు. అందుకే మనకి మొదటి నుంచీ కేడీలతోను, రౌడీలతోను దోస్తీ ఎక్కువ. ఊఁ! ఆ తరవాత.........

అవ : నన్ను కూడా బడిపంతులుగా పని చెయ్యమన్నారు. అప్పటికే చిత్రలేఖనంలో నాకు కొంచెం చెయ్యితిరిగింది.

భద్రం: నాకు చిన్నప్పుడే పేకాటలో చెయ్యి తిరిగినట్టు—మన యిద్దరి జీవితకథలకూ దగ్గర పోలికలున్నాయి. నీకథ వింటుంటే నాకథ అంతా జ్ఞాపకం వస్తోంది. ఊఁ! ఆ తరవాత...

అవ : మా నాన్నగారి కోరికను నేను మన్నించలేదు. అయినా ఆయన వూరుకున్నారు.

భద్రం: పాపం! ఆయన ఎవరో మహానుభావుడు! అదే మా నాన్నగారయితేనా? ఆయనమాట మన్నించకపోతే నన్ను తన్నేవారు.

అవ : మా నాన్నగారు, రిటైరయిన ఒక సంవత్సరంలోనే, జీవితం చాలించారు. ఆయన మిగిలించిన కొద్ది ఆస్తి నేను చిత్రలేఖనంకోసం ఖర్చు పెట్టేశాను.

[ఈ సమయంలో పడినైపునుంచి భూషణం వస్తాడు. లావుగా, పొడవుగా వున్నాడు. వయస్సు 30 సంవత్సరాలు. జరీ అంచులపంచె, సిల్కుచొక్కా వేసుకున్నాడు. గడ్డం మాసి వుంది. ముఖంలో విషాదం కనిపిస్తుంది. చేతిలో లెదర్ సూట్ కేస్ వుంది.]

భూషణం: (అవతారాన్ని భద్రాన్ని సమీపించి) మీకు ఎవరైనా అందమైన ఒక అమ్మాయి కనిపించిందా? ఆమె సన్నంగా, తెల్లగా, పొడుగ్గా వుంటుంది వయస్సు...

భద్రం: (మగ్గలో అందుకొని) ఒకరే అన్నమాటయేమిటయ్యా మహానుభావా? కొన్ని వందలమంది అమ్మాయిలు కనిపించారు. చూడాలని సరదాగా వుంటే నీకు చిన్న ఉపాయం చెబుతాను. విను.—తిన్నగా బీచి రోడ్డున నడిచి వెళ్లు. అందమైన అమ్మాయిలు, రకరకాల సుందరాంగులు, పొడవుపైటలవాళ్లు, అసలు పయిటే లేనివాళ్లు, చిరునవ్వులవాళ్లు, చిలిపిచేష్టలవాళ్లు, వాలుమాపులవాళ్లు, వంకర నడకలవాళ్లు—అమ్మాయిలు వందలు, వేలు కనిపిస్తారు. నవనాగరికత అంతా బీచిరోడ్డునే తాండవమాడుతోంది.

భూష : (నిష్పృహతో) నేను వెతుకుతున్నది ఒక్క అమ్మాయికోసమే. ఆమె నా జీవితానికి వెలుగు.

భద్రం : అయితే వెలుగువచ్చేవరకూ యిక్కడే కూర్చో, యీ అర్ధరాత్రివేళ తిరిగేవంటే మనబంధువులు-అనగా పోలీసులు—నిన్ను మర్యాదగా తీసుకుపోయి ఆతిథ్యం యిస్తారు.

[భూషణం అటుప్రక్కవున్న బల్లమీద జాగ్రత్తగా లెదర్ సూట్ కేస్ పెట్టి తను కూడా కూర్చుంటాడు.]

అవ : (తనకథను కొనసాగిస్తూ)వున్న కొద్దిడబ్బు చిత్రలేఖనానికి ఖర్చయిపోయిందని చెప్పానుకదూ?

భద్రం : (బిగ్గరగా నవ్వుతూ) అహాహా! మనం యిద్దరం ఒకేదారిలో నడుస్తున్నాం. నువ్వు వున్న డబ్బంతా ఖర్చుపెట్టేసి బొమ్మలుగీశావు. నేను నాయావదాస్తినీ—అనగా స్థిరచరాస్తులను—రూపాయలలోకి కరిగించి రెండుచేతులతోను పేకాడేశాను.

అవ: వ్యసనంకోసం డబ్బు ఖర్చుపెట్టడం అధమం. నువ్వు చేసినది మంచిపనికాదు.

భద్రం: (కోపంతో) ఏమమ్మోయ్ కొంచెం మర్యాదగా మాట్లాడు. పేకాట అద్భుతమైన గొప్ప కళ! కాదనేవా దెవడైనావుంటే ముందుకు రమ్మను. 'రన్ మోర్' అటగాడు మిస్టర్. భద్రంఅంటే యీ పట్టణం మొత్తంమీద పేరు.

భూష: (జేబులువెతికి చూసుకొని) జేబులో ఒక సిగరెట్ కూడా లేదు. (భద్రంతో) భద్రంగారూ! చీటపేక కళలజాబితాలో—ఏస్థానంగా చేరుతుంకో సెలవిస్తారూ?

భద్రం: (ఉత్సాహంతో) ఓ యస్! అలా అడుగు చెబుతాను. నువ్వు సినిమాచూస్తావు. నాటకం చూస్తావు. డాన్సు చూస్తావు. ఎందుకు చూస్తావు?

భూష: కొంతసేపైనా ఆనందించడంకోసం.

భద్రం: అవునా?—కాబట్టి తెలివతేటలున్నా అంటే ఆనందాన్ని కలిగించేవన్నీ కళలు. అదుు! చేతులు నొప్పిపెట్టేవరకూ పేక ఆడు. ఆటలోఒకసారి పడ్డావా—నిన్ను నువ్వు మరిచిపోయేవన్నమాటే! చీట్లపేక, విదేశీ సర్బత్, స్వదేశీ డాన్సు—యీ మూడూవుంటే చాలు యిక జీవితంలో—ఏమీ అక్కరలేదు.

భూష: ప్రణయరంగంలో అనుభవం లేక నువ్విలా మాట్లాడుతున్నావ్. స్త్రీ వలపులో స్వర్గసీమ దాగివుంది. సుందరాంగుల చూపులలో నిజమైన ఆనందం యిమిడివుంది.

భద్రం: (సిగరెట్ పొగ గట్టిగా పీల్చి—తాపీగా ఒక క్షణం ఆలోచించి) నీ పేరేమిటి?

భూష: భూషణం అంటారు.

భద్రం: (నాటిగా) మిస్టర్ భూషణం, నీ అభిప్రాయం శుద్ధ తప్పు. స్త్రీల ప్రేమలో ఆనందం ఎంతమాత్రం లేదు. వలపువల్ల చివరకుమిగిలేది విలాపం ఒక్కటే. మహామహులు భర్తృహరివంటివాళ్లే వలపులవలలో చిక్కుకొని నిలువునా దగాపడి శోకులూ వైరాగులూ అయిపోయారు.

అవ: ఇంతకూ మనదేవూరు భద్రంగారూ?

భద్రం: (విచారంతో) ఏమనిచెప్పను? నేను పుట్టడం కర్నూలులో పుట్టాను. గుంటూరులో పెరిగాను. హైదరాబాద్ లో చదువుకున్నాను. డబ్బంతా విశాఖపట్నంలో ఖర్చుపెట్టేశాను. ఒకవూళ్లోనూ నాకు వోటువేసే హక్కు లేదు. నాకు ఒక వూరు లేదు. ఒక వోటు లేదు.

భూష: నీకేమీ ఉద్యోగం లేదా?

భద్ర: మన పూర్వీకులు ఉద్యోగం పురుషలక్షణం అన్నారు. ఆరోజులు వెళ్ళిపోయాయి. ఇప్పుడు ఆడవాళ్ళు వేలకొద్దీ ఉద్యోగాలకోసం ఎగబడుతున్నారు. ప్రిఫరెన్సు వాళ్ళకే. యీ పరిస్థితులలో నాలాంటి పౌరుషవంతుడైన మొగవాడు చెయ్యవలసింది యేమిటయ్యా అంటే ఖుషీగా రోడ్లమీద తిరగడం.

అవ: నువ్వూ నిరుద్యోగివేనా?

భద్రం: రోజు ఒక్కంటికే ఆటలో పాతికరూపాయలు సంపాదించగలను. ఖర్చుపెట్టగలను. కాబట్టి నిరుద్యోగిని అవడానికి వీల్లేదు.

భూష: నీకు యీ వూళ్ళో ఎవరైనా బంధువులున్నారా?

భద్రం: లేరు.

అవ: ఉద్యోగమూ లేదు. బంధువులూ లేరు. మరి యీ వూళ్ళో నువ్వు ఎందుకు వుంటున్నావు?

భద్రం: ఈవూరికి దక్షిణాన్ని డాల్ఫిన్స్ నోస్ వుంది.

అవ: అంటే?

భద్రం: అనగా ఒకపర్వతం—దట్టమైన నల్లటిమబ్బులు అందమైన మెరుపుతీగలు ఆ కొండశిఖరం మీద ఆడుకొంటూవుంటాయి. జీవితంలో ఆనందాన్నంతా అనుభవించిన తరవాత ఒకసారి ఆ కొండ యెక్కి చూడు. యీ మహాపట్నం అంతా చిన్న బొమ్మరిల్లులా కనిపిస్తుంది. ఆ సమయంలో యీ సంకుచిత ప్రపంచంతో నీకు ఋణానుబంధం తీరిపోయిందనుకో. మరికొంత ముందుకు వెళ్లి. అలా—అలా నడిచి కొండకొనకు వెళ్ళు. అక్కడ నిలబడి ముందుకు చూడు. కొండచుట్టూ మహాసముద్రం విలయతాండవం చేస్తూ కనిపిస్తుంది. నీకు దూరంగా కనిపిస్తున్న సంకుచిత ప్రపంచానికి వీడ్కోలు చెప్పు. ఒక్కసారి కళ్ళు మూసుకొని ముందుకుదూకు. దానితో నీజీవితం సుఖాంతం అవుతుంది.

అవ : (ఆశ్చర్యంతో) ఆత్మహత్య చేసుకోవడం కోసమా నువ్వు యిక్కడ వుంటున్నది?

భూష : అబ్బాయ్ భద్రం నువ్వింకా చిన్నవాడివు. అలాంటి ఘోరానికి ఒడిగట్టకు.

భద్రం : (నవ్వుతూ) అహాహ, మాటవరస కన్నాను. అంత తేలిగ్గా చస్తాననుకున్నావా! మరోపది నిము షాలు మీరు యిక్కడ వుంటేచాలు. నాకు యీ వూళ్లో ఎంతపలుకుబడివున్నది మీకు తెలిసి పోతుంది.

భూష : నువ్వు నాకో చిన్న ఉపకారం చేసిపెట్టాలి.

భద్రం : (తేలికగా) ఓ! అదెంతపని! తప్పకుండా చేస్తాను.

భూష : (జాగ్రత్తగా పెదర్ నోట్ కేస్ తెరిచి ఫొటోతీసి) చూడు. యీమె ప్రస్తుతం యీ వూళ్లోనే వున్నట్టు తెలిసింది. నీకు ఎక్కడైనా కనిపిస్తే నాకు చెప్పాలి నీకు బహుమతి యిస్తాను.

భద్రం : (ఫొటోను పరిశీలించిచూస్తూ) అందమైన ముఖం, పోగకళ్ళు. పెదవులమీద చిరునవ్వు— యీమె నిస్సందేహంగా అందమైన స్త్రీ— యింతకూ యీమె నీకేమౌతుంది?

భూష : (గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ) ఆమెను తొలిసారి చూడగానే నా మనసు చలించింది. చివరకు పెళ్లి చేసుకున్నాను: ఈ బాహ్య ప్రపంచాన్ని మరిచి స్వర్గంలో విహరించాను.

భద్రం : స్వర్గాన్ని విడిచిపెట్టి యిలా ఎందుకు వచ్చి నట్లు?

భూష : నా ప్రియురాలిని వెతికేఅందుకు.

భద్రం : (బిగ్గరగా నవ్వుతూ) అహాహా! ఆమె పలాయనం చిత్రగించిందన్నమాట! అలాగ చెప్పు!— ఇదుగో ఒకమాట చెబుతాను విను ఆడదాని ప్రేమ ఆకాశం. నేను నేటికీ బ్రహ్మచారిగా వుండిపోవడానికి కారణం అదే !— నీకు శాశ్వతమైన ఆనందాన్ని యిచ్చేది (జేబులోంచి పేకతీసి చూపిస్తూ) యిది యీ పేకపేక-ఒక్కటే. యిల్లుపోనియ్, యిల్లాలు పోనియ్, నీ ఆస్తి సర్వస్వంపోనియ్.(పేక చూపిస్తూ) యిది మాత్రం నిన్ను వదలదు. యింతకంటే విశ్వాస పాత్రమైనది ప్రపంచంలో మరొకటి లేదు. (పేక కలుపుతూ) రండి భూషణంగారూ, ఒక ఆట వేద్దాం.

భూష: (నిస్పృహతో) ఆడలేను. నా మనసు వికలమై పోయింది.

భద్రం: (నిరాశతో పేక జేబులో పెట్టుకొని) ఏమి రాత్రిరా భగవాన్ యిది? పేకాడ్డానికి ఒక మానవప్రాణి అయినా దొరకలేదు. (లేచి) ఆఁ! జ్ఞాపకం వచ్చింది. రాజయ్యగాడి యింటికి పోతాను. అక్కడ యిప్పుడు మాంచి ఆట సాగుతూవుంటుంది.

[తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు.]

అవ : చిత్రమైన కుర్రవాడు.

భూష: నువ్వు యీ వూరు ఎందుకువచ్చావు?

అవ : ఏం చెప్పను భూషణంగారూ? ఈవూరేకాదు, అన్ని వూళ్ళూ తిరిగాను. నాకు తగిన ఉద్యోగం యెక్కడా దొరకలేదు.

భూష: ఉద్యోగంకోసం తిరుగుతున్నావా? ఏం చదువు కున్నావ్?

అవ : నాకు వచ్చిన విద్య చిత్రలేఖనం ఒక్కటే. తెలుగుభాషలోవున్న ఉత్తమ కావ్యాలన్నీ చది వాను. ఫలితం ప్రపంచజ్ఞానంతోపాటు నిస్పృహ కూడా పెరిగింది. ఉన్న డబ్బు ఖర్చయి పోయింది. దేశంమీదికి బయలుదేరాను.

భూష: యీ రోజులలో కవిత్వం, చిత్రలేఖనం నిన్ను పోషించలేవు.

అవ : కళాకారుడు కళాకారుడుగా బ్రతకలేడన్న విషయం తెలుసుకున్నాను. ఒక కంపెనీలో గుమాస్తాగా చేరాను.

భూష: అది తెలివైనపని.

అవ : నాయందు రాసులుగాపడివున్న కోర్కెలు నన్ను వెక్కిరించేవి. నా మనసును నెర్రెత్తించేవి. రకరకాల ప్రకృతి దృశ్యాలు, చిత్రాలు నా మస్తిష్కంలో చలిస్తూ నన్ను కలవరపరిచేవి కాగితంమీద కలం నడిచేదికాదు.

భూష : గుమాస్తాకు వుండవలిసిన లక్షణాలు కావవి.

అవ : నన్ను నా అధికారి గొంగళి పురుగును చూచి నట్లు చూచేవాడు.

భూష : అది సహజమే.

అవ : నా హృదయం నాపై తిరుగుబాటు చేసింది. 'నిన్ను జంతువుగాను, యంత్రంగాను మార్చే

యీ ఉద్యోగాన్ని విడిచిపెట్టు' అని నన్ను అనుక్షణం హెచ్చరించసాగింది.

భూష: వెంటనే ఉద్యోగం విడిచిపెట్టి రోడ్డు యెక్కావా ?

[కుడివైపునుంచి రామస్వామి భజనకీర్తన పాడుకుంటూ — చలికి వణుకుతూ — వస్తాడు. వయస్సు 40 సంవత్సరాలు. సైకిలుపంచెకట్టు, గళ్ళచొక్కా, సన్నని మీసం, తలపాగ— చేతిలో కర్ర వుంది.]

రామస్వామి: రామా నామము రామనామము రమ్యమైనది రామా నామము—

[పాట ఆపుచేసి అవతారాన్ని, భూషణాన్ని చూసి] మనది యేవూరుసామీ ? ముందు నా మామూలు నాకు పారెయ్యండి. తరవాత మాట్లాడుకుందాం.

భూష: ఎవరు నువ్వు ?

రామ: నేను యీ సత్రానికి కాపలామనిషినండి. నన్ను రామసామంటారు.

అవ: నువ్వు రామభక్తుడిలావున్నావ్ !

రామ: ఏదో మీలాంటి ప్రభువుల్ని నమ్ముకుని 'రామా కృష్ణా' అని బతుకుతున్నాను. (అవతారాన్ని చూసి ఏదో ఆకస్మికంగా జ్ఞాపకంవచ్చినట్లు) ఏవండోయ్ బాబూ! ఇది రంగయ్యగాడిసోటు. ఆడొచ్చేసెంటే తిన్నగైనమనిషి కాడు. అవతలకేసి బల్లమీద పడుకోండి.

అవ: అతను వచ్చినతరవాత లేస్తానులే.

రామ: నా మామూలుమాటేం సెప్పేరుకాదు.

అవ: రామస్వామీ, నువ్వు రామభక్తుడవు. నన్ను ఆశపెట్టకు. నాదగ్గర రాగిడబ్బుకూడా లేదు.

రామ: (కోపంతో) ఒహోహో! అలాంటి యవహారం మాదగ్గర సాగదండి. నా డబ్బులు నాకివ్వకపోతే మీరు మరోసోటు సూసుకోవచ్చు.

అవ: (జాలిగా) ఈ అర్ధరాత్రివేళ యెక్కడికి పోగలను ?

రామ: నన్ను యెందుకు సంపుతావ్ ? పోయి యే అరుగుమీదో పడుకో !

అవ: ఈ మహాపట్నంలో యిళ్ళకు అరుగులు లేవు. యిప్పుడు నేనుపోయి యే 'షేవ్ మెంటు' మీదో పడుకోవాలి.

రామ: డబ్బు లేనోడే ముందు సోటుయెక్కిండంట, (కోపంతో) దర్జాగా యెత్తరుగెక్కి మరీ పడుకున్నావ్. దిగు, దిగు.

భూష: రామస్వామి, ముందు యిలారా, ఆయన డబ్బులు కూడా నేను యిస్తాను. ఆయన్ని కదపకు.

రామ: (భూషణాన్ని సమీపించి) బాబ్బాబు, మీలాంటి మంచి బాబులు లేకపోతే మాలాంటోళ్ళం ఎలా బతగ్గలం బాబూ?

భూష: (ఐదు రూపాయల నోటుతీసి రామస్వామికి యిచ్చి) నా దగ్గర చిల్లరలేదు. ఒక కేప్స్టన్ సిగరెట్టుపెట్టె కొని చిల్లర మార్చుకురా.

రామ: ఓ! అలాగే వస్తానుబాబూ, మీలాంటిమారాజులుంటే మాకేం లోటు ఒకో బాబున్నాడంటే కళ్ళు మూసుకుని అన్ని కర్నాలూ సేస్తాడు. కాపలా మనిషికి పావలాడబ్బు లివ్వడానికి కొట్టుకుంటాడు. అందులోను యిలాంటి సత్రం కావాలంటే దొరుకుతాదా?—సాయిబ్బ దగ్గర ఆకు మడిలాగ—రైలు టేసన్కి తిన్నగావున్న సత్రం. యిక్కడ సుకంగా పడుకుని బండి టేసనుకి వచ్చి ఆగిం తరవాత ఒబ్బిడిగా యెళ్ళి యెక్కొచ్చు. వస్తాను బాబు! (కుడివైపు వెళ్ళిపోతాడు.)

అవ: భూషణం గారూ! యివేళ మీరు నా మర్యాద నిలబెట్టారు.

భూష: ఆఁ! దానికేముంది!

అవ: ఈ రోజుల్లో డబ్బులేని మనిషి బ్రతికి వుండీ చచ్చినవాడిక్రింద జమ. డబ్బువున్నవాడికే గౌరవం, అధికారం అన్నీ వుంటాయి. అందుకే "...సర్వేగుణాః కాంచనమాశ్రయన్తే" అన్నాడు మహాకవి.

భూష: (రిస్టువాచీ చూసుకొని) అప్పుడే పదకొండున్నరయ్యింది.

అవ: దూరప్రయాణంచేసి అలిసిపోయినట్లున్నారు. నిద్రపోండి.

భూష: కలతలూ, కష్టాలూ లేనివాడికి యిట్టే నిద్ర వస్తుంది. నాకు అటువంటి అదృష్టం కలగలేదు.

కన్ను మూసినా తెరిచినా ఆమె రూపం నా కనుల ముందు కనిపిస్తోంది

[కుడివైపు నుంచి ముందు 'చంద్రం', వెనుక 'తార' వస్తారు. చంద్రం సన్నంగా, పొడవుగా వున్నాడు. వయస్సు 30 సంవత్సరాల లోపు. ఫుల్ ఫాంట్, ట్వీడ్ కోటు, చేతిలో లెదర్ బేగ్ — గౌరవమైన కుటుంబానికి చెందిన మనిషిలా కనిపిస్తాడు. తార ముఖం సుంద్రంగా, అందంగా వుంది. ఆమె కళ్ళల్లో ఆకర్షణతో పాటు విషాదం కూడా కనిపిస్తోంది. తెల్లటి ఆమె శరీరానికి అమ పచ్చ వెల్వెట్ జాకెట్, జార్జెట్ చీర మరింత సోయగాన్ని కలిగిస్తున్నాయి. చంద్రం ముఖం ధుమధుమలాడుతూ వుంది.]

చంద్రం : (వస్తూనే కోపంతో) నీతో నాకు ఎక్కడ లేని చిక్కు వచ్చిపడింది. నన్ను ఒక్క క్షణం దూరంగా వెళ్ళనివ్వవు. చివరకు యేమయ్యిందో చూడు. ట్రైన్ కాస్తా దాటిపోయింది. తెల్లవారిన దాకా యిక్కడ తగలడాలి.

తార : (వినయంతో) నేనేం చేశానండీ? ట్రైన్ బయలుదేరేముందు కాఫీకోసం వెళ్ళారు. ఆలస్యమయ్యింది. ట్రైన్ వెళ్ళిపోయింది.

చంద్రం : (గద్దించి) ఆలస్యం ఎందుకయ్యింది? నీ గురించి? అవునా? కాదా? (చుట్టూ చూస్తూ) యిదేదో దెయ్యాల సత్రంలా వుంది. (భూషణాన్ని గుర్తించి ఆశ్చర్యంలో) హాలో, మీరు కూడా యిక్కడే వున్నారే!

భూష : (యింతవరకూ మైమరచి తారకేసి చూస్తూ వున్నవాడు ఒక్కసారి తేరుకొని చంద్రంతో) ట్రైన్ దాటి పోయిందా?

చంద్రం : అవునండి. ఈ సత్రానికి మేనేజరు ఎవరూ లేరా? ఈ రాత్రికి యిక్కడ వుండిపోవడం కంటే యిక చేసేదేమీ లేదు.

భూష : కాపలా మనిషి వున్నాడు. అలా వెళ్ళాడు. ఇప్పుడే వస్తాడు.

చంద్రం : (తారతో) చూడు తారా! వీరు నీకు జ్ఞాపకం వుందా?

తార : (భూషణం కేసి చూస్తూ) ఎక్కడో చూసి నట్లుంది.

చంద్రం : ఉదయం మన కంపార్టుమెంటులో ప్రయాణం చెయ్యలేదూ?

తార : అవును, జ్ఞాపకం వచ్చింది.

చంద్రం : మీ పేరు భూషణం అన్నారు కదూ?

భూష : అవును. (సగౌరవంగా) మీరు నిలబడి పోయారు. ఈ బల్లమీద కూర్చోండి.

[అనంతరం ఒకసారి తారకేసి చంద్రం కేసి చూసి కళ్ళుమూసుకుని పడుకొంటాడు.]

చంద్ర : (బల్లమీద కూర్చుంటూ) థేంక్ యూ! (తారను భూషణానికి పరిచయం చేస్తూ) ఈమె మిస్. తార. (పొరబాటు దిద్దుకుంటూ) శ్రీమతి తారాదేవి. ఈమెకు కొన్ని ఆధునిక పద్ధతుల మీద గౌరవం లేదు.

తార : (కోపాన్ని అభినయిస్తూ) లేకపోతే ఆడవాళ్లు కూడా క్లబ్బుల్లో తిరగాలంటారా? (బల్లమీద కూర్చుంటుంది.)

చంద్ర : (భూషణంతో) అదుగో! చెప్పాను కాదూ?

భూష : మనం ఆడవాళ్ళ అభిప్రాయాలను కూడా మన్నించాలి.

చంద్రం : అంతకంటే మనం ఏమిచెయ్యగలం గనక! అలాగే మన్నిస్తాం. — ఇక యెటొచ్చీ విపరీతమైన అభిప్రాయాల దగ్గరే చిక్కు వస్తుంది.

భూష : మీకేమీ అనుకోకపోతే ఒకమాట అడుగుతాను.

చంద్ర : అబ్బెబ్బె! దానికేముంది! అడగండి.

భూష : మీకు పెళ్లిఅయి ఎంతకాలం అవుతుంది?

చంద్రం : ఈమధ్యనే, పూర్తిగా ఆరు నెలలు కూడా అవదు.

భూష : అలా చెప్పండి. అందుకే అభిప్రాయాలదగ్గర ఘర్షణ వస్తోంది. మరికొంతకాలం గడిస్తే అంతా కుదుటపడుతుంది. అప్పుడు ఒకరి అభిప్రాయాలతో మరొకరు తేలికగా సర్దుకుపోగలరు.

చంద్రం : (నవ్వుతూ) బాగా చెప్పారు.

రాము : (కుడివైపునుంచి వస్తూ — తారాచంద్రులను చూడగానే ఆకస్మికంగా) ఒహోహో! పెద్ద మారాజు లెవరో దయచేశారు. సీకట్లో కూర్చున్నారు. లైటేస్తాను. (ఎడమవైపువెళ్ళి 'స్విచ్' నొక్కుతాడు, మెర్క్యురీదీపం ఒక్కసారిగా హాలును నీలికాంతిలో ముంచుతుంది.)

భూష : (రామస్వామితో) ఏదీసిగరెట్టు పెట్టె తెచ్చేవా?

రామ : అమ్మ! ఎంతమాట! లేకుండా వస్తావా?

[సిగరెట్టు పెట్టె, చిల్లర భూషణానికి యిస్తాడు.]

భూష : (రూపాయినోటు రామస్వామికి యిస్తూ) యిదిగో! నీ మామూలు.

రామ : (వినయంతో) బాబ్బాబు! (నోటు భద్రంగా మొలలో దాచుకుంటాడు.)

తార : తలనొప్పి వస్తోంది.

చంద్రం : అసలు దూరప్రయాణమే పెద్దతలనొప్పి. పడుకొని హాయిగా నిద్రపోతే అదే పోతుంది.

రామ : బాబూ! యిదిగో! యిది శుభ్రమైనగది. ఈ రాత్రి మీరిక్కడ సుఖంగా నిద్రోవచ్చు.

[మొలలోంచి తాళంచెవి తీసి ఎడమవైపు కనిపిస్తున్న గదితలుపులు తెరుస్తాడు.]

చంద్రం : (తారతో) తారా! నువ్వు గదిలోకి వెళ్ళి పడుకో. నాకు యింకా నిద్రరావడం లేదు.

[తార ఒకసారి చంద్రంకేసి దీనంగా చూసి—అతని చేతిలోని బేగ్ తీసుకొని—గదిలోకి వెళ్ళిపోతుంది. చంద్రం కోపంతో ఆమె వెడుతున్నవైపు చూస్తాడు. ఇది అంతా భూషణం గమనిస్తాడు.]

రామ : (చంద్రానికి తిన్నగా నిలబడి చేతులు నలుపుతూ) బాబూ! మరి నామాటేం చెప్పేరు కాదు.

చంద్రం : (జేబులోంచి పర్సుతీసి చూసి) వంద రూపాయల నోట్లేనోయ్. చిల్లర లేదు.

రామ : (నిరుత్సాహంతో) ఒకో రోజు అలాంటిది. వచ్చిన మారాజులందరి దగ్గిరా చిల్లరుండదు. మర్నాం తర్వాత ఇవ్వండి బాబూ! ఈ గదిలో వుంటాను. (కుడివైపు వెళ్ళిపోతాడు.)

భూష : మీ ఉద్యోగం గురించి ఏమిటో ఉదయం చెప్పారు. మరిచిపోయాను.

చంద్రం : మీరు వుండబట్టి ఉదయం ప్రయాణం హాయిగా సాగిపోయింది. మనం చాలా విషయాలు మాట్లాడుకున్నాం. మీరు చిక్కులలో వున్నారు గనుక అవన్నీ అప్పుడే మరిచిపోయినట్లున్నారు.

భూష : కొందరు—తెలియక—డబ్బున్నవాడికి అన్ని సుఖాలు వుంటాయి అనుకుంటారు. నేను కోరి పెళ్ళిచేసుకున్న స్త్రీ నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోయింది.

చంద్రం : ఆమెకు మతిభ్రమించి వెళ్ళిపోయిందని మీరు ఉదయం చెప్పారు.

భూష : అవును.

చంద్రం : ఇల్లు విడవకపూర్వం ఆమె నడకలో మీకేమైనా మార్పు కనిపించిందా?

భూష : చెప్పుకోతగిన మార్పేమీ కనిపించలేదు. నా స్నేహితుడితో ఎక్కువగా చనువుగా వుండేది.

చంద్రం : ఇప్పుడా స్నేహితుడు ఎక్కడ వున్నాడు?

భూష : ఆమె మాయమైన తరువాత నాలుగు రోజుల వరకూ అతను నాకు ధైర్యం చెప్పాడు. ఆ తరవాత ఆమె జాడ తెలుసుకునేవరకూ ఇంటికి తిరిగి రానని ప్రమాణంచేసి వెళ్ళిపోయాడు.

చంద్రం : మీకు ఇటువంటి విషయాలలో అనుభవం వున్నట్లు కనిపించడం లేదు. చూడండి, భూషణంగారూ! నేను ఒక ఫారన్ కంపెనీకి ఏజెంటునని—నెలకు ఐదువందలు రూపాయల జీతమనీ మీకు ఉదయం చెప్పాను.

భూష : అవును. మీ పేరుకూడా ఏదో చెప్పారు. మరిచిపోయాను.

చంద్రం : నా పూర్తిపేరు చంద్రశేఖరం. అందరూ నన్ను చంద్రం అంటారు లెండి. యిప్పుడు నేను చెప్పబోతున్న దేమిటి? (ఒక క్షణం ఆలోచించి) నేను దేశం నాలుగుమూలలూ తిరిగాను. రకరకాల మనుష్యుల్ని చూశాను.

తార : (ఎడమవైపు గదిలోనుంచి వచ్చి చంద్రాన్ని చూసి) హమ్మయ్య వున్నారా?

చంద్రం : (కోపంతో ఏం? ఎక్కడికైనా పారిపోయాననుకున్నావా?

తార : (వినయంతో) లేదండీ పైకి ఎక్కడికో వెళ్లేరనుకున్నాను.

చంద్రం : (చిరాకుతో) అబ్బబ్బ అంత అనుమానం అయితే ఎలా తారా?

తార : అనుమానం కాదండి. నాకు తలనొప్పి ఎక్కువగా వుంది. మీకు చెబుదామని వచ్చాను.

చంద్రం : నన్ను చంపక—హాయిగా నిద్రపో, అదే పోతుంది.

తార : నిద్ర పట్టడం లేదండీ.

చంద్రం : (లేచి) వూళ్ళోకి వెళ్ళి మందు తెస్తాను. సాయంత్రం భోజనం చెయ్యకుండా తొందరగా బయలుదేరాం. నీకు ఆకలిగా వుంది కూడా. ఎక్కడైనా కాఫీతాగి నీకు మందు తీసుకు వస్తాను.

తార : (ఆత్రుతగా అతనిని సమీపించి) వద్దు. వద్దు. మీరు ఎక్కడికీ పైకి వెళ్ళకండి. ఈ అర్ధరాత్రి వేళ మందు ఎక్కడ దొరుకుతుంది? మీరు తిరిగొచ్చేవరకూ నాగుండెలు భయంతో కొట్టుకుంటూ వుంటాయి.

చంద్రం : (నిస్పృహతో తిరిగి బల్లమీద కూలబడి) ఓరి భగవంతుడా! ఇదెక్కడి గొడవ, నన్ను బయటకు పోనివ్వవు. నీకు మందు తేనివ్వవు. నన్ను కాఫీ తాగనివ్వవు. నువ్వు బ్రతకవు. నన్ను బ్రతక నివ్వవు.

తార : అంత చిరాకయితే ఎలాగండి, నిద్రపోవడానికి ప్రయత్నిస్తాను (తిరిగి గదిలోకి వెళ్ళి పోతుంది.)

చంద్రం : (భూషణంతో) చూశారు కదూ! చదువూ వుంది. సంస్కారం వుంది. అన్నీ వున్నాయి కాని ఏం లాభం? వట్టి అనుమానం మనిషి.

భూష : అటువంటి భార్య దొరకడం నిజంగా మీ అదృష్టం చంద్రంగారూ.

చంద్రం : ఏమి అదృష్టమో! నాకర్మ! యిటువంటి ఆడదాన్ని కట్టుకున్నవాడికి కాళ్ళకు సంకెళ్ళు తగిలించుకున్నట్లే వుంటుంది.

[కుడివైపునుంచి రంగయ్య ధూమకేతుగా వస్తాడు. వయస్సు సుమారు ౪౫ సంవత్సరాలు, బలమైన దండలు పెద్ద బుట్టతల, పైకి మెలితిరిగిన మీసం లుంగీ, పొట్టిచేతుల చొక్కా, చేతిలో కర్ర— చూడగానే దుర్మార్గుడిలా కనిపిస్తాడు.]

రంగయ్య : (వస్తూనే అరుగుమీద పడుకున్న అవతారాన్ని చూసి కోపంతో) యెవడ్రా అక్కడ? ఆ అరుగుమీద పడుకున్నోడెవడు? ఒరేయ్ రాంసామి ఎక్కడ సచ్చావ్?

రామ: (తొందరగా కుడివైపునుంచి వస్తాడు) ఏరా రంగయ్యా ఇంత ఆల్సెంగా వచ్చావ్?

రంగ : ముందు జవాబు సెప్పరా రౌడివా— యీ అరుగు మీద పడుకున్నోడెవడు? యిది రంగయ్యగాడి సొంతసోటు. ఆమాట పడుకున్నోడికి తెలకపోతే నువు సెప్పొద్దూ?

రామ : బాబ్బాబు, వూరుకో నేను లేపేస్తానులే (అవతారాన్ని లేపుతూ) లేవవయ్యా బాబూ, నేను ముందు సెబితే యిన్నావ్?

రంగ : (బిగ్గరగా) ఒరేయ్! మరియాదగా లేస్తాడో లేకపోతే తోటకూర కాడ లాగ బయటికి యిసిరెయ్యమంటాడో కనుక్కోరా!

రామ : (రంగయ్యను బతిమాలుతూ) నా నాయన! వూరుకోర! నేందింపుతాను.

అవ : (కళ్లునలుపుకుంటూ లేచికూర్చుని) ఎవరూ నన్ను లేపినది?

రంగ : (కోపంతో ముందుకొచ్చి) నేనంటే నేనే. యింకా కదల్లేకపోతివా నేం? (అవతారాన్ని రెండు భుజాలు పట్టుకొని కిందికి దించేస్తాడు)

రామ : (అవతారంతో) ఇప్పుడైనా యెల్లి అవతలకేసి పడుకోవయ్యా సామీ!

భూష : (రంగయ్యతో) ఏరా రంగయ్యా? ఏమిటీ వేషం?

రంగ : (భూషణాన్ని గుర్తించి) బాబ్బాబు! నువ్వా భూషణం బాబూ! యీనడిరాత్రికాడ యిక్కడెందుకున్నావ్?

భూష : నాకర్మం కొద్దీ యిక్కడ కొచ్చాను. అసలు నువ్వీ వూళ్ళో ఏం చేస్తున్నావ్?

రంగ : నేనా? ఇక్కడా? యేం చేస్తన్నా నంటావా ((బిగ్గరగా నవ్వుతూ) హహ్హహ్హ! బుర్రలు కొట్టుకు బతుకుతున్నాను (మీసం దువ్వుతూ) యీబస్తీ మొత్తంమీద రంగయ్యగాడి పేరు సెబితే హడల్!

రామ : మన రంగయ్యగాడి అవసరం పెద్ద పెద్ద మారాజులికే వస్తావుంటాది. సిన్నా పెద్దా, సన్నాసులు బైరాగులు, సారంటులూ, పోలీసులూ--ఒక్క లేమిటి అందరికీ రంగయ్యగాడితో పనివుంటాది.

రంగ : ఇంతెందుకు? మన వూరు యెప్పుడైతే వదిలేసినో అప్పుడే నా పీసంతా యిరిగిపోయింది.

భూష : ఇప్పుడు నువ్వు గడుపుతున్నదే మర్యాదైన బ్రతుకంటావా?

రంగ : ఒకటోరకంగా అంటాను. మావూళ్లో నేను పెళ్లాం పిల్లల్ని పోగొట్టుకున్నాను. కష్టపడ్డాను. వొళ్లొంచాను. పనిచేశాను. పూట తిండికి టికానా లేకపోయింది.

భూష : నువ్వు కష్టపడిన మాట నిజమే...

రంగ : (మధ్యలో అందుకొని) 'ఏం చెయ్యాలి?' అని ఆలోచించాను. కళ్ళెర్రచేసి చుట్టూ చూశాను. వెంటనే బరితెగి పట్నం మీద పడాను-ఇయ్యేళ్లో యీ రంగయ్య - యీ బస్తీకి-కిరీటంలేని రాజు.

భూష : ఇలా బ్రతకడమే నీకు దర్జాగా వుందంటావా?

రంగ : ఒకటో రకంగా అంటాను. ఇలాంటి బతుకు వస్తే దొరకదు. పొగలంతా దర్జాగా నిద్రపోతాను. రాత్రి ఎనిమిదింటికి లేస్తాను. రాత్రంతా ఒక వెలుగు వెలిగించేస్తాను.

రాము : ఈ బాబుదీ నీదీ ఒక వూరే నేటి రా రంగయ్యా?

రంగ : భూషణం బాబంటే మావూరి మొత్తంమీద పెద్దరైతు - ఒరేయ్ రాంసామి - యీ బాబు కంలోటురా కుండా నాడు. నేను బద్రయ్యని లాక్కొస్తాను. (భూషణంతో) బాబూ! యీ అరుగుమీద సుకంగా పడుకో. అసలేయిది పట్నం. యెవడిని నమ్మితే ఆడే గోతిలో దించేస్తాడు.

[కుడివైపు తిరిగి వెళ్లి పోతాడు]

చంద్ర : వాడు యెవడో నిశాదరుడిలా వున్నాడు. మీకు పరిచయ ముందన్నమాట.

భూష : ఒక గౌరవ మైన •రైతుకుటుంబానికి చెందిన వాడు, యీ రంగయ్య. చివరకు యిలా తయారయ్యాడు.

రామ : (భూషణంతో అతివినయంగా) బాబూ! మీకీయరుగుమీద పక్కేస్తాను. యింకే మన్నా కావాలంటే చెప్పండి.

ఆద : (యింకా నేలమీద కూర్చునే వున్నాడు) దాహం దాహం.

రామ : (విసుగుతో) వూరుకోవయ్యా! దిక్కుమాలి దాహకం నువ్వూను.

భూష : (రామస్వామితో) ముందు అవతారం గారికి మంచినీళ్ళు యిచ్చిరా.

రాము : (అవతారంతో చిరాకుగా) రావయ్యా బాబూ! వంపేస్తున్నావ్. (ముందు రామస్వామి వెనక అవతారం కుడివైపు వెళ్ళిపోతారు)

చంద్రం: ట్రైన్ లేటయితే చిరాగ్గా వుంటుంది. ఇక రైలుబండి తప్పిపోయినప్పుడు కలిగే చిరాకు యింతా అంతా కాదు.

భూష: హైదరాబాద్ కు పోయేబండి మళ్ళీ ఎన్ని గంటలకు వుంది?

చంద్రం: ఉదయం తొమ్మిదింటలకు.

భూష: అంతవరకూ మీరు యిక్కడ వుండిపోవలసిందేనా?

చంద్రం: మంచి లాడ్జింగ్ హోమ్ కుపోతే డబ్బు ఖర్చయినా హాయిగా వుండేది. అర్థరాత్రివేళ యిక్కడ వృథాగా చిక్కుకుపోయాం.

భూష: ఇలాంటి సమయంలో మనకంటే ఆడవాళ్ళకు మరీ యిబ్బందిగా వుంటుంది.

చంద్రం: మీరు చెప్పింది నిజం. అందులోను పాపం-తారకు—యిలాంటి అనుభవం యెప్పుడూ కలగలేదు. ఆమె యీ రోజంతా భోజనం చెయ్యలేదు. ఒకసారి వూళ్లోకిపోయి వద్దామంటే వెళ్ళనివ్వదు.

భూష: వూళ్లోకి వెళ్ళడం అంటే మైలు దూరం పోయి రావాలి.

చంద్రం: నిజమే. అవసరమైనప్పుడు వెళ్ళక యేం చేస్తాం. మీరు చిన్న ఉపకారంచేసి పెట్టాలి భూషణంగారూ.

భూష: ఏమిటో చెప్పండి.

చంద్రం: తార యీసరికి నిద్రపోయివుంటుంది. నేను ఒకసారి వూళ్ళోకిపోయి యేమైనా పళ్ళూ, బిస్కట్లూ తీసుకువస్తాను. నేను వచ్చేలోగా ఆమె లేస్తే మీరు కొంచెం సర్దిచెప్పాలి.

భూష: చెబుతానులెండి. కాని మీరు వూళ్ళోకివెళ్లేకంటే స్టేషనుదగ్గరవున్న స్టాల్ లో యేమైనా తీసుకోకూడదూ?

చంద్రం: అక్కడ అంతా నిలవసరుకే వుంటుంది. పోనీ యేదోవిధంగా శ్రమపడదామనుకున్నాను. ఈ చలికి తట్టుకోలేక వాళ్ళు స్టాల్ మూసే

కారు. తెల్లవారేవరకూ మీరు యిక్కడే వుంటా రుగా—యిప్పుడే వస్తాను. ఎందుకో యివేళ నాకు మరీ విపరీతమైన ఆకలి వేస్తోంది.

ధూమ: వెళ్ళిరండి. నాకు నిద్రరావటంలేదు. మీరు వచ్చేవరకూ మెలకువగానే వుంటాను.

చంద్రం: మీకు శ్రమకలిగించినందుకు విచారిస్తున్నాను. ఇప్పుడే వస్తాను. యిది మర్యాదస్తులు తిరిగే చోటులాలేదు, భద్రం.

[ఒక అడుగు ముందుకు వేస్తాడు. అకస్మాత్తుగా భద్రం కుడివైపునుంచి వస్తాడు.]

భద్రం: (చంద్రంతో) ఎందుకయ్యా పిలిచావ్? నా కీర్తి నీదాకా వచ్చినట్లుందే!

చంద్రం: (చిరాగ్గా) నిన్నెవరు పిలిచారు పోవోయ్.

[కుడివైపు వెళ్ళిపోతాడు.]

భద్రం: (చంద్రం పోతున్నవైపు చూస్తూ) ఇతగాడెవరు చెప్మా, నేనే అనుకుంటే నా తాతలా వున్నాడు.

ధూమ: ఆయన ఒక ఉద్యోగి. కుటుంబంతో ప్రయాణం చేస్తున్నాడు. రైలు దాటిపోయింది.

భద్రం: ఓహో! రైలు దాటిపోయిన ప్రయాణీకుడా? ఆలాచెప్పు. (బిగ్గరగా నవ్వుతాడు.)

ధూమ: ఉష్! అల్లరిచెయ్యకు. అక్కడ ఆయన భార్య నిద్రపోతోంది.

భద్రం: సుఖంగా నిద్రపోయేవాళ్ళకు ఢంకా బజాయించి దప్పుడుచేసినా మెలకువరాదు. ఉదాహరణకు మన రంగయ్యగాడిని చూడు. వాడు కలియుగ కుంభకర్ణుడు.

ధూమ: నీతో ఆడ్డానికి యింకా మనిషి దొరకలేదా?

భద్రం: ఒకడేమిటి? అరడజనుమంది ఒకేసారి దొరికారు. ఒకే ఒక ఆటవేశాం. (జేబులు గలగల లాడిస్తూ బిగ్గరగా) చూశావా? జయంమనదే, (తారతొందరగా ఎడమవైపునుంచి వస్తుంది. భయంగా చూస్తుంది. భద్రం ఆమెను నఖశిఖ పర్యంతం చూస్తాడు.)

తార: (ధూమపానంతో) ఏరీ? చంద్రం ఎక్కడికి వెళ్లారు?

ధూమ: ఆయనకు ఆకలిగావుందట. హోటల్కి వెళ్లారు. యిప్పుడే వస్తారు.

తార: (భయంతో) హోటల్కా?

ధూమ: యిక్కడ మీకేమీ భయంలేదు. నాతో చెప్పి మరీ వెళ్ళారు. నేను మెలకువగా వుంటాను లెండి. మీరువెళ్లి పడుకోండి.

తార: (విచారంతో) చివరకు నేను అనుమానించినంతా అయ్యింది.

ధూమ: హోటల్కి వెళ్ళినంతమాత్రానికి మీరు ఇంత భయపడ్డందేనికి?

తార: (వస్తున్న దుఃఖాన్ని అపుకొంటూ) మా సంగతి మీకు తెలియదు. ఏంచెప్పుకోవడానికీ వీల్లేదు.

[కుడివైపునుంచి తిరిగి రామస్వామి, అవతారం వస్తారు. వాళ్ళకేసి ఒకసారిచూసి తార గదిలోకి వెళ్లిపోతుంది.]

రామ: (వస్తూనే అవతారాన్ని ఉద్దేశించి) అక్కడ పడుకోవయ్యా సామీ అంటే మళ్లీ యిక్కడికొస్తున్నాడు.

అవ: (వణుకుతూ) యీ చలికి రక్తం గడ్డ కట్టుకుపోతోంది. ధూమపానం గారూ! ఒక సిగరెట్ యిచ్చి పుణ్యం కట్టుకుంటారూ?

[ధూమపానం అవతారానికి సిగరెట్ యిస్తాడు.]

భద్రం: (వెంటనే చెయ్యిచాపి) పనిలో పని, నాకు కూడా ఆ చేతితోనే ఒక సిగరెట్ పారెయ్.

ధూమ: (భద్రానికి సిగరెట్ యిస్తూ) చూడు! అనవసరంగా కేకలువేసి తారాదేవి నిద్ర పాడు చేశావు.

భద్రం: (సిగరెట్ పొగ గట్టిగా పీల్చి) ఆమె పేరు తారా? ఆకాశంనుంచి తెగిపడిన చుక్కలాగే వుంది.

రామ: (ధూమపానంతో) బాబూ తమరికి పక్క రొక్క డెయ్యమన్నారో-సెలవిచ్చారు కాదు.

ధూమ: (బల్లమీద చేరబడి దీర్ఘంగా ఆలోచిస్తూ) ఏమీ అక్కర్లేదు. నీ పనిచూసుకో. (సిగరెట్ వెలిగించి తీవ్రంగా ఆలోచిస్తున్న వాడిలా కూర్చున్నాడు. రామస్వామి కుడివైపు నిష్క్రమిస్తాడు. అవతారం తిరిగి అరుగు రొక్క కూర్చున్నాడు.)

భద్రం: (అరుగుకు చేరబడి తారవున్న గదికేసి చూస్తూ పాడతాడు.)

చిలుక చిలుకా రామచిలుకా
పలుక వంటుంగీ!

అత్తెచ్చిన కొత్త చీర
కట్టనంటుంది!

అవ : అబ్బాయి! పానుగంటివా రేమన్నారో తెలుసా?

భద్రం : ఆయన పేక ఆడడంలో గొప్పవాడా?

అవ : కాదు. సుప్రసిద్ధ తెలుగు నాటక కర్త.

భద్రం : ఏమన్నా రేమిటి?

అవ : పద్దెనిమిది పురాణాలూ రాసిన వ్యాసమహర్షి అంతటివాడే పరస్త్రీని చూసి పళ్ళికిలించాడట!

భద్రం : (బిగ్గరగా నవ్వుతూ) ఒహోహో! చాలా గొప్ప మాట! అక్షర లక్షలు!

అవ : భూషణం గారూ! మీరు స్థితిపరులు, గొప్పవాళ్లు అని తెలిసినప్పటినుంచీ నేను ఆనందం పట్టలేకుండా వున్నాను.

భద్రం : మరొకడి ఆస్తి చూసి మనం ఆవేశ పడడం ఆరోగ్య లక్షణం కాదు అవతారం గారూ!

అవ : (భద్రాన్ని వారిస్తూ) నువ్వూరుకోవయ్యా బాబూ! ఒక క్షణం. (భూషణంతో) మీరు నిరాడంబరులు, ఉదార స్వభావులు అని తెలిసిపోయింది.

భద్రం : 'కోయ్‌రా నా రాజా!' అన్నాడు.

అవ : (భద్రంతో) పెద్ద వాళ్ళ మాటలలో నువ్వు కలగ చేసుకోకూడదు. (తిరిగి భూషణంతో) మన దేశంలో కళలుసమస్తం నేడు శిథిలావశేషాలైలా వున్నాయి.

భద్రం : కాలూ చెయ్యీ విరిగిపోయిన శిల్పసుందరిలా అనా మీ భావం?

అవ : (కోపంతో) అవును. (భూషణంతో ప్రాధేయపూర్వకంగా) ధనమూ సంస్కారమూ వున్న మీవంటివారు ఉదాసీనంగా వుండవలసిన సమయం కాదిది.

భూష : ఏం చెయ్యాలి?

అవ : మీ పేరుమీద ఒక చిత్రకళాశాల స్థాపించండి. మీ కీర్తి చిరస్థాయిగా నిలిచిపోతుంది. నాబోటి దరిద్ర కళాకారులకు బ్రతుకు తెరువు దొరుకుతుంది.

భద్రం : అదీ అసలు సంగతి.

భూష : అవతారం గారూ! మీ అభిప్రాయం మంచిదే. కాని యిది యంత్రయుగం. కళలగురించి ఆలోచించే తీరిక ఎవరికీ లేదు.

భద్రం : (మధ్యలో అందుకుని) ఆమాట నేనెంత మాత్రం ఒప్పుకోను. పేకాటవంటి ఉత్తమకళలు ఈనాటివరకూ నిలిచివుండడానికి కారణం యెవరు? రంగయ్యలాంటి కాడీలు లేకపోతే యీకళలన్నీ యేమైపోయేవి?

అవ : (విసుగుతో) హరి భగవాన్! యిదెక్కడిగొడవ.

భూష : (తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ) అష్టకష్టాలు పడుతున్న ప్రజలు కళలమీద ఆసక్తి చూపిస్తారనుకోవడం వ్యర్థం.

అవ : మీవంటివారు మావంటివాళ్ళను యీ విధంగా నిరుత్సాహపరచకూడదు. కళలమీద ప్రజలకు అభిరుచి కలిగేటట్లు కృషి చేయాలి.

భద్రం : (పేకతీసి కలుపుతూ) యిప్పుడు నేంచేస్తున్న పని అదే.

భూష : ఈ పరిస్థితులలో చేతినిండా డబ్బు వున్నవాడు చెయ్యవలసినపని ఒకటే. హాయిగా తిను. తాగు. ఖులాసాగా తిరుగు. ప్రియురాలి వాలుచూపులలో సమస్తం మరిచిపో. చివరకు సుఖంగా నవ్వుతూ చచ్చిపో. అప్పుడు జన్మ తరిస్తుంది.

భద్రం : (ఉత్సాహంతో) హాయిహోయి! అక్షరలక్షలు ఈ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

అవ : (నిరుత్సాహంతో) హరిభగవాన్! నాది అరణ్యరోదనం. నా మొర వినే ప్రాణి ఒకటీ లేదు.

[నిరాశతో కుడివైపు వెళ్లిపోతాడు.]

భద్రం : (అవతారం వెళుతున్నవైపు చూస్తూ) పాపం! మానవుడు నిరుత్సాహంతో నీరైపోయాడు. మెట్లమీద పడుకుంటున్నాడు.

రంగయ్య : (నేపథ్యంలోనుంచి బిగ్గరగా) ఒకేయ్. కదిలితే కాలిరగ్గొడతాను. అక్కడే కూర్చో. (కుడివైపునుంచి ప్రవేశించి నేపథ్యంలోకి చూస్తూ) దొంగబుద్ధి కెంగుకురా యెదవా. పౌరుషం వుంటే పల్లిగా ఆడు, గెల్చుకో, తలెగరేసుకు తిరుగు.

భద్రం: (నవ్వుతూ) ఆహాహా! యేం మాట చెప్పావురా నా సామి రంగా! (రంగయ్య భుజం తట్టుతాడు.)

రంగ: (భద్రంకేసి తిరిగి కోపంతో) రాజయ్యగాణ్ణి దగా సేశావంట. అదుగో అడొచ్చి కూర్చున్నాడు ఏం సెబుతావో సెప్పు.

భద్రం: (కోపంతో) తెలుపు తెలుపే! నలుపు నలుపే! ముక్కు మూసించి మరీ డబ్బు పుచ్చుకున్నాను. దగా అంటే దవడ యిరగ్గొడతాను. యేడీ?

[తొందరగా ముందుకు అడుగు వేస్తాడు. రంగయ్య అతనిని రెక్క పట్టుకొని నిల బెడతాడు.]

రంగ: ముందు నీ దగ్గరున్న డబ్బు చూపించు.

భద్రం: (చూపించకుండా) ఫరవాలేదు. ఆటకు లోటు రాదు.

[రామస్వామి కుడివైపునుంచి హుషారుగా పాడుకుంటూ వస్తాడు.]

రామ: రాత్తేరి వచ్చినాడు,
బాలుడమ్మా గోపాలుడమ్మా!

భద్రం: (యీలేసి హుషారుగా) అద్గదీ! వెయ్యరా! ఒక అడుగు వెయ్.

భూష: (కోపంతో) గోలచెయ్యొద్దంటే వినిపించడం లేదూ?

భద్రం: గోలచెయ్యకపోతే హుషారు లేదు. హుషారు లేకపోతే బ్రతుకే లేదు.

రంగ: (కోపంతో ముందుకువచ్చి) ఆయన మాట కెదురుచెబితే పెడుకాలవలో పారేస్తాను. జాగర్త! (భూషణంతో) భూషణం బాబూ! మేం ఆ కొన గదిలోకిపోయి ఆడుకుంటాంలే. నువ్వు సుకంగా నిద్రో.

భద్రం: (రంగయ్యను, రామస్వామినీ, తననూ లెఖ్ఖ పెట్టి) ఒకటే, రెండూ, మూడూ—రాజయ్య గాడితో నాలుగు. సరిపోయేం. పదండిరా! బాబా పదండి.

[రంగయ్య, రామస్వామి, భద్రం కుడివైపు నిష్క్రమిస్తారు - భూషణం దీర్ఘాలోచనలో మునిగివుంటాడు. క్షణం నిశ్శబ్దం—ఎడమవైపు నుంచి తార వస్తుంది.]

తార: (ఆత్రుతతో) ఇంకా రాలేదా?

భూష: లేదు.

తార: (కుడి చివరకువెళ్ళి వీధికేసి దీనంగా చూస్తుంది. నిస్పృహతో దీర్ఘమైన నిట్టూర్పు విడిచి) ఎక్కడా వస్తున్న జాడలేదు. (అరుగును ఆనుకొని నిలబడుతుంది.)

భూష: మీ రేమీ అనుకోకపోతే ఒక మాట అడుగుతాను.

తార: (అనుమానంగా చూస్తూ) ఏమిటి?

భూష: మీరు చంద్రంగారిని ఎందుకు అనుమానిస్తున్నారు.

తార: (కలవరపాటుతో) దయచేసి ఆ విషయంమాత్రం అడక్కండి.

భూష: మీ మనసును కష్టపెట్టినందుకు క్షమించండి.

తార: (విచారంతో) నా బ్రతుకు—దారం తెగిన గాలిపటంలా వుంది. ఏదో సవ్యమైన ఒక దారిలో—నా జీవితం సాగిపోతుందని ఆశ పడ్డాను. చివరకు నా ఆశ నిరాశ...

భూష: (చలించి) ఎంత ఆలోచించినా మీ పరిస్థితి నాకు బోధపడడం లేదు. నేను చెయ్యగల సహాయం యేమైనా వుంటే చెప్పండి తప్పకుండా చేస్తాను.

తార: (కళ్ళు తుడుచుకొని) ఆయన వెళ్లి గంట అవుతుంది కదండీ?

భూష: ఆత్రుతవల్ల మీకు అలా అనిపిస్తోంది. అర గంటకు ఎక్కువ కాదు.

తార: పోనీ అరగంటే అనుకోండి. వూళ్ళోకి వెళ్లి రావడానికి ఇంత టైమెందుకు?

భూష: ఒక పదినిముషాలు ఆలస్యం కావచ్చు. అంతే కాని వూళ్లోకి వెళ్లినవాళ్లు రాకుండా ఏమౌతారు?

తార: (పరధ్యానంగా) ఈ రోజు ఉదయంనుంచీ నన్ను తప్పించుకు పోవడానికి ప్రయత్నిస్తున్నారు. (ఆలోచిస్తూ) అవును! ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది. మధ్యాహ్నం వెయిటింగ్ రూమ్‌లో విడిచిపెట్టి పోవడానికి చూశారు. నేను ఒప్పుకోలేదు. సాయంత్రం లాడ్జింగ్ హోంలో విడిచి వెళ్ళడానికి ప్రయత్నించారు. అదీ సాగనివ్వ లేదు నేను. నెమ్మదిగా ఆలస్యంచేసి ట్రైన్ దాటిపోయేలా చేశారు. పైగా నా మూలాన్ని రైలు దాటిపోయిందన్నారు. ఎంత ప్రయత్నిస్తే ఏమి లాభం? చివరకు తప్పించుకుపోయారు. (విచారిస్తుంది.)

భూష: మీవంటి చక్కని భార్యను విడిచిపెట్టి పోవడానికి ప్రయత్నిస్తున్నారంటే—నేను నమ్మ లేకుండా వున్నాను.

తార: మా సంగతి తెలియక—మమ్మల్ని చూసిన వాళ్ళంతా—అలాగే అనుకుంటారు.

భూష : పోనీ పెళ్ళాం బిడ్డలను పోషించలేక వెళ్ళి పోయాడనుకోవడానికీ వీల్లేదు. పిల్లలు లేనే లేరు. జీతం చూస్తే నెలకు ఐదువందలు! ఇద్దరు మనుషులు. ఎంత ఖర్చుపెట్టినా తరగని జీతం.

తార : అందరూ అతని మాటలను యిట్టే నమ్ముతారు' నేనుకూడా అదే విధంగా మోసపోయాను.

భూష : (ఆశ్చర్యంతో) జీతం నెలకు ఐదువందలు కాదా?

తార : బాగా చదువుకున్నారు. దేశమంతా తిరిగారు. ఉద్యోగంమాత్రం దొరకలేదు. ఉద్యోగం లేదని చెప్పడానికి సిగ్గుపడి అలా అబద్ధం చెబుతారు.

భూష : చాలా వింతగావుంది. మనిషి వేషభాషలు చూసి నేను నిజమనే నమ్మాను.

తార : నేనూ అలాగే నమ్మాను. చివరకు నా జీవితం సర్వనాశనం అయ్యింది.

భూష : ప్రయత్నంచేస్తే ఉద్యోగం దొరకకపోదు— కేవలం డబ్బులేని కారణంవల్ల భార్యను విడిచి పెట్టిపోతాడని నమ్మలేకుండా వున్నాను.

తార : కట్టుకున్న భార్యను విడిచిపెట్టి పోవడానికి ప్రతిమనిషీ భయపడతాము. అది నిజమే. (కోపంతో) కాని నమ్మించి మాయచేసి తీసుకు వచ్చిన అమాయకురాలిని విడిచిపెట్టి పోవడానికి మగవాడు ఎంతమాత్రం జంకడు.

భూష : (మితిమీరిన ఆశ్చర్యంతో, మీ మాటలు చాలా వింతగా వున్నాయి.

తార : (పరిస్థితి గుర్తించి) అయ్యయ్యో! ఎంత పొరబాటు జరిగింది! ఆవేశంలో చెప్పరాని సంగతులు చెప్పాను.

[కలవరపాటుతో ఎడమవైపు వెళ్ళిపోతుంది. భూషణం ఆశ్చర్యంతో ఆమె వెళుతున్నవైపు చూస్తూవుంటాడు. కుడివైపునుంచి అవతారం వికలమనస్కుడై ప్రవేశిస్తాడు.]

అవ : (వస్తూనే) ఉన్నతి శిఖరంమీదనుంచి తల క్రిందులుగా జారిపడ్డాను. ముచ్చెమటలు పోశాయి. గొంతు ఆరిపోయింది.

భూష : నువ్వు చెబుతున్న దేమిటో నాకు బోధ పడడంలేదు.

అవ : (పైమరచి) ఒకగొప్ప ఉద్యానవనం కనిపించింది. అక్కడ స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు — ఉత్సాహంతో తిరుగుతున్నారు. ఉద్యానవనానికి మధ్య రమణీయమైన కళా మండపం ఒకటివుంది. జనం తండోపతండాలుగా మండపంలోనికి వెడుతున్నారు. నేనూ వారితోపాటు వెళ్ళాను. రంగు రంగుల చిత్రాలు, రకరకాల చిత్రాలు కన్నులపండువగా అలంకరించబడివున్నాయి. అహోరాత్రులు కష్టపడి నేను చిత్రించిన చిత్రాలుకూడా అక్కడ వున్నాయి.

భూష : (విసుగుతో) ఏమిటీ సోది?

అవ : (తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ) కళా మండపానికి సమీపంలో ఒక మహోన్నత శిఖరం కనిపించింది. మరింత ఉత్సాహంతో — శిఖరంమీదికి ఎగ్రబ్రాకాను. అక్కడినుంచి ప్రజలలోని నూతనోత్సాహాన్ని, చైతన్యాన్ని తిలకించసాగాను. ఇంతలో కాళ్ళు తేలిపోయినై. ఆకాశాన్ని అంటే ఆ శిఖరంనుంచి తల్లక్రిందులుగా నేల మీద పడ్డాను. భయంతో కెవ్వున అరిచి లేచాను. ఇంకా గుండెలు కొట్టుకుంటున్నాయి.

భూష: గాలిలో మేడలు కట్టేవాళ్ళకు యిటువంటి కలలే వస్తాయి.

అవ: ఇది పీడకల కాదంటారా భూషణంగారూ?

భూష: (సముదాయిస్తూ) అనవసరంగా మనసు పాడు చేసుకోకు. హాయిగా నిద్రపో.

అవ: నా జీవితంలో కలరాని రాత్రి అంటూ ఒకటీ లేదు. ఊహ తెలిసిన తరవాత ఒక రాత్రీ నేను ప్రశాంతంగా నిద్రపోలేదు.

భూష: (విసుగుతో) యిప్పుడు నీతో మాట్లాడే ఓపిక నాకు లేదు.

అవ: (నిస్పృహతో) నా స్వప్నిక జగత్తులో కళల స్వరూపం మారిపోతోంది. జూదం, మోసం, దగా—యివన్నీ కళలుగా మారిపోతున్నై. ఈ స్థితిలో నావంటి నిర్భాగ్యులు స్వప్నజగత్తులోనే ఆనందాన్ని అనుభవించాలి.

[అవతారం కుడివైపు నిష్క్రమిస్తాడు. ఒక క్షణం నిశ్శబ్దం — తార ఎడమవైపునుంచి వస్తుంది. ఆమె కళ్ళు అశ్రుపూరితాలై వున్నాయి. ముఖం ఎర్రబడివుంది.]

తార: (వీధివైపు చూచి నిట్టూర్చి) ఇక నాకు దిక్కెవరు?

భూష: మీరు భయపడకండి. నన్ను నమ్మి నిజం చెప్పండి. నాకు చేతనైన సహాయం తప్పక చేస్తాను.

తార: (దుఃఖంతో) నా కెవరూ సహాయం చెయ్యలేరు. మా కుటుంబ ప్రతిష్ఠ కాపాడాలంటే ఆత్మహత్య చేసుకోవడంకంటే — నాకు — మరోక దారిలేదు. (వెక్కి వెక్కి యేడుస్తుంది.)

భూష: (సానుభూతితో) పాపం! మీ స్థితిచూస్తే జాలి కలుగుతోంది. ఏమి చెయ్యడానికీ తోచడం లేదు. మీరుకూడా జీవితంలో చాలా దగాపడినట్లు కనిపిస్తున్నారు. ఇటువంటి సమయంలో నిజం దాచినందువల్ల ప్రయోజనం లేదు.

తార: (గాద్గదికంగా) ఎంతో ప్రేమతో — పెంచి — నామీద ఎన్నో ఆశలు పెట్టుకున్న మా నాన్న గారు — ఇప్పుడు నన్ను ఎంతగా ద్వేషిస్తూ వుంటారో!

భూష: మీరు యింట్లో ఎవరికీ చెప్పకుండా పరారి అయివచ్చారా?

తార: నేను ఎంతో తెలివైనదానినని నాకు దృఢమైన నమ్మకం వుండేది. చివరకు జీవితంలో మొదటి సారిగా తీవ్రమైన మోసానికి గురి అయ్యాను.

భూష: స్త్రీ యింటినుంచి లేచిపోవడం సమాజం దృష్టిలో ఘోరమైన నేరం.

తార: ఇల్లు విడిచినందువల్ల నా స్థితి యెన్నోరెట్లు బాగుపడుతుందనుకున్నాను. సుఖప్రదమైన — ప్రశాంతమైన సంసార జీవితం గడపవచ్చునను కున్నాను.

భూష: మీరు తొందరపడకుండావుంటే మీ తల్లి దండ్రులే మిమ్మల్ని చక్కని మార్గంలో పెట్టి వుండేవారు.

తార: మా కుటుంబంగురించి మీకు తెలియదు. మేం ఐదుగురం అక్కచెల్లెళ్లం. మాలో ఒక్కరికీ పెళ్లికాలేదు. నిత్యజీవితం గడవడమే దుర్లభంగా వుండేది. మా నాన్నగారిని చూస్తుంటే నాకు ఎంతో జాలికలిగేది. నేనే మగవాణ్ణయితే మా కుటుంబాన్ని పోషించగలిగివుండేదాన్ని కదా అని వూహించుకునేదాన్ని.

భూష: మీరైనా ఉద్యోగం చెయ్యవచ్చుకదా!

తార: అదీ ప్రయత్నించాను. మా నాన్నగారు అందుకు అంగీకరించలేదు. ఆయనకు డబ్బుకంటే కుటుంబ ప్రతిష్ఠ ముఖ్యం. (బాధతో) చివరకు మా కుటుంబానికి నావల్ల కళంకం...

[విచారభారంతో మాట్లాడలేదు.]

భూష: చంద్రాన్ని మీరు చిన్నప్పటినుంచీ ఎరుగుదురా?

తార: ఆరు నెలలక్రితం వరకూ అతడెవరో నాకు తెలియదు. (మోహజగత్తులో విహరిస్తున్నదానిలా) నాకు మొదటిసారి సరళయింట్లో కనిపించాడు. ధనవంతుడు, పెళ్లికానివాడు అనుకున్నాను. అతనిని చూచిన తొలిచూపులోనే నా హృదయంలో ఆశారేఖ మెరిసింది — ఆ రోజు మొదలు అతను నన్ను అనుక్షణం వెంటాడుతూనే వున్నాడు. మొదటిసారి — అతని మాటకు జవాబు చెప్పడానికి — నేను నిరాకరించాను. ఎన్ని అనుకుంటే యేమి లాభం? చివరకు అతను పన్నిన వలలో చిక్కుకున్నాను. నన్ను నడి సముద్రంలో ముంచి పోయాడు. (పైట చెంగుతో ముఖం కప్పుకుంటుంది.)

భూష: (కోపంతో) దుర్మార్గుడు! నాతో ఎంత తియ్యటి కబుర్లు చెప్పాడు! అతని మాటల్లో ఒకమాటకూడా నాకు అబద్ధమని తోచలేదు. పెళ్లిఅయి ఆరునెలలయ్యిందనికూడా చెప్పాడు. పాపం! మీరు కొత్త దంపతులు అనుకున్నాను.

తార: నేను కట్టుకున్న గాలిమేడలు నిలువునా కూలిపోయాయి. (ముఖం రెండు చేతులతో కప్పుకొని) ఇక యీ లోకంలో ఏ ముఖం పెట్టుకు బ్రతకను?

భూష: (ఓదార్చుతూ) విచారించకండి. మీకేమీ భయంలేదు. అతడెక్కడికీ తప్పించుకుపోలేడు. (ఆమెకేసి పరిశీలనగా చూస్తూ) మీవంటి అందమైన యువతిని అతను తేలికగా విడిచిపోతాడని నమ్మలేకుండా వున్నాను.

తార: దుర్మార్గులు ఎంతటి దుర్మార్గానికైనా వెను దియ్యరు.

భూష: నమ్మివచ్చిన స్త్రీని అర్ధరాత్రి ఒంటరిగా విడిచిపోవడంకంటే ఘోరంమరొకటి వుండదు.

తార: (దుఃఖభారంతో) నా జీవితం సర్వనాశన మయ్యింది. ఎటుచూచినా కటికచీకటి. ఎటు

పోవడానికీ దారి కనిపించడంలేదు. కష్టమంటే యేమిటో తెలియకుండా పెరిగిన నేను—యీ వసిరేయి—ఒంటరిగా—యిక్కడ (తల రెండు చేతులతో పట్టుకొని) అబ్బ! తలనొప్పి!

భూష: (సమీపించి జాలితో) మీరు వచ్చినప్పటి నుంచీ — పాపం — తలనొప్పితో బాధపడు తున్నారు. ఏమైనా కావాలంటే — సంకో చించకండి.

తార: మీరు నా కష్టాలకు సానుభూతి చూపించారు. నాకు అదే పదివేలు. నాకోసం మీరు వృథాగా శ్రమపడకండి. నా విచారాన్ని మీకుకూడా పంచి—మీకు విశ్రాంతిలేకుండా చేస్తున్నాను. దయచేసి మీరు ప్రశాంతంగా నిద్రపోండి. నేను లోనికి వెళ్ళిపోతాను. (గదిలోకి వెళ్ళి పోతుంది. భూషణం ఆమె పోతున్నవైపు చూసి ఒక నిట్టూర్పు విడుస్తాడు — కుడివైపునుంచి తొందరగా ఛిద్రం వస్తాడు.)

ఛిద్రం: (వస్తూనే భూషణంతో) ఘోరం అయిపో యిందంటె నమ్మ. రంగయ్యగాడు నన్ను నిలు వునా దోపిడీచేసి వదిలేశాడు.

భూష: ఆ చెప్పేదేదో కొంచెం నెమ్మదిగా చెప్ప కూడదూ?

ఛిద్రం: నా జేబులన్నీ ఖాళీఅయిపోతే — యింకేం నెమ్మది—నా పిండాకూడు.

భూష: నువ్వు చెప్పేదేమిటి?

ఛిద్రం: ఆలా అడుగు. అంతా పూసగుచ్చినట్లు చెబు తాను. అంతా విను. తప్పవుంటే చెప్పతీసుకు కొట్టు. ఒప్పుకుంటాను. కలుపు రాజయ్యగాడిది. అంతదాకా బాగానేవుంది. (హుషారుగా) ఆతరవాత చూసుకో నా సామిరంగా— రాజయ్యగాడు ఇస్పేటు మూడు వేశాడు. రంగయ్యరాజా వేశాడు. నేను మదాం వేశాను. మళ్ళా రంగయ్యగాడు కళావర్ వాలు గేశాడు. నేను మళ్ళీ మదాం వేశాను. వాడు ఆఠీన్ రెండు వేశాడు. నేను ఇస్పేట్......

భూష: (విసుగుతో రెండు చెవులూ మూసుకొని) అబ్బబ్బ! నన్ను చంపకు. నా కేం తెలియదు.

ఛిద్రం: (నిరుత్సాహంతో) ఏం మనిషివయ్యా? యింత అద్భుతమైన ఆటగురించి చెబుతుంటే వినడానికి బాధపడుతున్నావ్.

భూష: నామాటవిని—ఆ ఆటలో శ్రద్ధవున్నవాళ్ళెవ రికో అదంతా చెప్పు.

ఛిద్రం: చెప్పడం, తిరగడం — అదంతా జాస్తానె. ఆటకు ఆటవెయ్యడం—చెప్పు మెలేసి డబ్బు పుచ్చుకోవడం.

భూష: అలాగే చెయ్యి.

ఛిద్రం: (హుషారుగా) ఓయస్, అదేచేస్తాను. ఒక్క ఐదురూపాయలనోటు యిలా పారెయ్యి. ఐదు నిముషాలలో అసలీఫాయిదాలతో నీ డబ్బు నీ కిచ్చేస్తాను.

భూష: (విసుగ్గా) నా దగ్గరేమీ డబ్బు లేదు పోవయ్యా!

ఛిద్రం: (బతిమాలుతూ) అమ్మమ్మ! అలా అంటే ఎలాగ! నీలాంటి సోదరమానవు డొకడు పరువు పోగొట్టుకుంటూవుంటే చూస్తూ వూరు కుంటావా?

భూష: వూరుకోకపోతేవు రిపెట్టుకు చావమంటావా? నాదగ్గర డబ్బులేదని చెబితే వినిపించడంలేదా?

ఛిద్రం: చూడకపోతే నీమాట నమ్మవాణ్ణే. కాని చూసినతరవాత నమ్మేదెలా? చూడు—కేవ లం—ఐదంటే ఐదు— వృథాగా (సూట్ కేస్ చూపిస్తూ) నీ పెట్టెలో డబ్బుదాచేస్తే — పిల్లల్ని పెడుతుందా? నా చేతిలో ఒక్క ఐదురూపాయలనోటు పెట్టిచూడు. క్షణంలో ఐదు అలా అలా పెరిగి వందలుగా మారి పోతుంది.

భూష: (ఆశ్చర్యంతో) నా సూట్ కేస్ లో డబ్బు వున్నట్టు నీ కెలా తెలుసు?

ఛిద్రం: నా గొప్ప నేను చెప్పకోకూడదు గాని— డబ్బుదగ్గర నేను చాణక్య సంతతివాణ్ణి. అది ఎంతదూరంలో వున్నా యిట్టే పసిగట్టెయ్య గలను.

భూష: (కోపంతో) సంతోషించాగాని దయచెయ్.

ఛిద్రం: అసలు పూర్తిగా చెప్పనియ్. నువ్వు వచ్చిన దగ్గరనుంచీ ఆ సూట్ కేసును పట్టుకొని వదల కుండా కూర్చున్నావ్. కనక అందులో డబ్బు వుండి తీరాలి అని మొదట నిశ్చయించు కున్నాను.—తరవాత నువ్వు సూట్ కేసు తెరిచి నీ ప్రియురాలి ఫొటో చూపించావు చూడు, అప్పుడు నేను కొంచెం లోతుగా చూశా

నులే.—అన్ని నోట్లకట్టలు మూటగట్టుకొని—ఒక్క ఐదురూపాయలు అప్పుయివ్వడానికి—ఏమిటయ్యా మహా యిదవుతున్నావ్!

భూష: (మధ్యలో అందుకొని చిరాగ్గా) అబ్బబ్బ! గొడవచెయ్యకు. (జేబులోంచి ఒక రూపాయి తీసి భద్రానికి యిచ్చి) యిక నన్ను ఆట్టే చంపక—వెళ్ళిపో.

భద్రం: (రూపాయ కాసును బొటన వేలితో పైకిమీటి అందుకొని హుషారుగా) ఒక్క రూపాయితో ఎలాంటి గారడీ చేస్తానో చూసుకో.

[తిరిగి కుడివైపు వెళ్ళిపోతాడు. భూషణం తీవ్రంగా ఆలోచిస్తూ వుంటాడు. ఎడమవైపు నుంచి తార వస్తుంది.]

తార: (బాధతో) యీ తల నొప్పి భరించలేకుండా వున్నాను.

భూష: విపరీతమైన ఆలోచనలతో మీకు తలనొప్పి మరీ ఎక్కువౌతోంది.

తార: ఇటువంటి తలనొప్పి యెన్నడూ ఎరుగను. అన్ని కష్టాలు ఒకేసారి నా ప్రాణానికి చుట్టుకున్నాయి. నే నేం పాపం చేశాను భగవంతుడా! (కన్నీటిని ఆపుకోవడానికి ప్రయత్నిస్తుంది.)

భూష: కొంచెం కాఫీ తాగితే తగ్గుతుందేమో.

తార: తెల్లవారేవరకూ నేను బాధపడడం ఎలాగూ తప్పదు. మీరైనా కొంతసేపు నిద్రపొండి.

భూష: ఒక ప్రాణి కళ్ళముందు బాధపడుతూ వుంటే చూస్తూ ఎలా నిద్రపోగలను చెప్పండి! భగవంతుడు నా హృదయాన్ని పాషాణంగా తయారు చెయ్యలేదు. గ్లాసువుంటే యివ్వండి రామస్వామి పడతాడు. కాఫీ తాగిన తరవాత కొంతసేపు విశ్రాంతి తీసుకుంటే ముందు తల నొప్పిపోతుంది. తరవాత మీ భవిష్యత్తు గురించి ఆలోచిద్దాం.

తార: అసలే చిక్కులలోవున్న మిమ్మల్ని కష్టపెట్ట వలసి వస్తోంది.

భూష: నా కళ్లముందు మీకు కలిగిన ఆపద చూడగానే—నా చిక్కులన్నీ మరిచిపోయాను. పాపం! నేను చూస్తూ వుండగా మీ జీవితం—కొన్ని క్షణాలలో—తారా పథంలోని నక్షత్రంలా ఒక మెరుపు మెరిసి పతనమయింది.

తార: (అతని కళ్లలోకి ఆశగా చూస్తూ) మీరే లేక పోతే యీ సమయంలో నా బ్రతుకేమయ్యేదో!

[గదిలోకి వెళ్లి వెండిగ్లాసు తీసుకువచ్చి భూషణానికి యిస్తుంది. భూషణం గ్లాసు తీసుకొని కుడివైపు వెడతాడు. తార అతను వెళుతున్న వైపు చూస్తూ అరుగుమీద కూర్చుంటుంది. తిరిగి భూషణం ఖాళీగ్లాసుతో వస్తాడు.]

భూష: వాళ్లంతా ఆటలో మునిగివున్నారు. పిలిచినా పలికేటట్లు లేరు. నేనే స్వయంగా వెళ్ళి వస్తాను.

తార: (భయంతో) ఆ పని మాత్రం చెయ్యకండి. మీకు పుణ్యం వుంటుంది.

భూష: (నవ్వుతూ) నేను కూడా పారిపోతానని భయంగా వుందా?

తార: మీకు శ్రమకలిగించడం యిష్టంలేదు. అదీకాక నేను ఒక్కతెనూ వుండడం కష్టం.

భూష: ఫరవా లేదు. క్షణంలో వస్తాను. వెళ్ళేటప్పుడు-మీ గదికేసి చూస్తూ వుండమని—రంగయ్యతో చెబుతాను.

తార: (భయంతో) దయచేసి ఆ పని మాత్రం చెయ్యకండి. వాళ్ళను చూస్తేనే నాకు భయం వేస్తోంది. మీరు వచ్చేవరకూ తలుపులు వేసుకు కూర్చుంటాను. నేను యిక్కడ ఒంటరిగా వున్నట్టు వాళ్ళకు తెలియ నివ్వకండి.

భూష: (ఆమె మాటకు అంగీకరిస్తూ) సరే! అలాగే చేస్తాను. (తన సూట్ కేస్ ఆమెకు యిస్తూ) యీ సూట్ కేస్ లో విలువైన వస్తువులు వున్నాయి, దీనిని జాగ్రత్తగా గదిలో వుంచండి. ఇప్పుడే ఐదు నిమిషాలలో వస్తాను.

[గ్లాసు తీసుకొని తొందరగా కుడివైపు వెళ్ళిపోతాడు. తార తన చేతిలోని సూట్ కేస్ కేసి ఒకసారి చూస్తుంది. కుడివైపు ఆత్రుతగా చూస్తూ వుంటుంది. క్షణం నిశ్శబ్దం. సూట్ కేస్ చేత్తోపట్టుకొని తన గదివైపు నడుస్తూవుంటుంది. కుడి చివర చంద్రం కనిపించి సన్నగా యీల వేస్తాడు.]

తార: (వెనక్కి తిరిగి చిరునవ్వుతో) ఓ! నిర్భయంగా రావచ్చు.

చంద్రం : (హుషారుగా తారను సమీపించి ఆమె భుజం తట్టుతూ) వండర్‌ఫుల్! అద్భుతమైన నటన ప్రదర్శించావు. ఇంతకూ పడిన శ్రమకు యేమైనా గిట్టుబాటు అవుతుందా?

తార : భయంతో నా గుండెలు కొట్టుకుంటున్నాయ్.

చంద్రం : (తేలిగ్గా) ఫరవాలేదు. మొదటిసారి అలా అనిపిస్తుందిలే!—పాపం! పిచ్చివాడు. నీ కథ విని నిలువునా చలించిపోయినట్లున్నాడు. వెనక్కి చూడకుండా తొందరగా పోతున్నాడు.

తార : అతను ఎంతదూరం పోవలసి వుంటుంది?

చంద్రం : కాఫీ కావాలంటే ఏదో ఒక థియేటర్ దగ్గరకు వెళ్ళాలి. కనీసం మైలు దూరమైనా పోవాలి. మనకు అరగంట టైముంది. ముందు సూట్‌కేస్ తెరిచి చూడనియ్.

[సూట్‌కేసు అరుగుమీద పెడుతుంది తార. యిద్దరూ దానికి చెరోకవైపూనా కూర్చుంటారు తార జడుస్తూ యిరువైపులా చూస్తూ వుంటుంది. చంద్రం జేబులోంచి తాళం చెవులగుత్తి తీస్తాడు, తాళం తిప్పి సూట్‌కేసు తెరుస్తాడు.]

చంద్రం : (సంతోషంతో) పడిన శ్రమ నూటికి నూరు పాళ్ళు దక్కింది. (నోట్ల కట్టలు తీసి తారకు చూపించి తిరిగి సూట్‌కేసులో పెడతాడు.)

తార : (సూట్‌కేస్‌లోకి చూస్తూ) ఏదో చిన్న పెట్టె వుంది. (చిన్న అందమైన పెట్టె తీస్తుంది. మూత తెరిచి ఆశ్చర్యంతో) ఎంత అందంగా వుందో యీహారం.

చంద్రం : (హారం చేత్తో పట్టుకుని చూస్తూ) యిది చాలా విలువైనది. (హేళనగా) పాపం! పారిపోయిన ప్రేయసికోసం చేయించివుంటాడు.

తార : ఇక ఆలస్యం చెయ్యకు. ఎవరైనా వస్తారు. (యింతలో ట్రైన్ కూత బిగ్గరగా వినిపిస్తుంది.)

చంద్రం : (ఉత్సాహంతో) రైట్. అదుగో! ట్రైన్ కూడా వచ్చింది.

తార : అది యెటుపోయే బండి?

చంద్రం : (ఆత్రుతగా) ఎటుపోయే బండైనా ఒకటే మనకు. ఊఁ! త్వరగా కానియ్.

చంద్రం తొందరగా సూట్‌కేసు సర్దేస్తాడు. తార గదిలోకివెళ్ళి హేండ్ బేగ్ తీసుకువస్తుంది చంద్రం సూట్‌కేసు, తార హేండ్ బేగ్ పట్టుకుని కుడివైపు రెండుఅడుగులు వేస్తారు. రామస్వామి ఎదురువస్తాడు. అతనిని చూడగానే యిద్దరూ కొంచెం తొందరపడి తిరిగి సర్దుకుంటారు.)

రాము : బాబూ! వెళ్ళిపోతున్నారా? నా మామూలు మాటేం చెప్పారుకాదు.

చంద్రం : (నిర్భయంగా) మేం పోయేబండి వచ్చింది. యిదిగో నీ మామూలు. (జేబులోంచి రెండు రూపాయలనోటుతీసి రామస్వామికి యిస్తాడు. తార వాలుచూపులతో యిద్దరికేసి చూస్తుంది.)

రాము : (నోటు అందుకొని సంతోషంతో నమస్కారం పెట్టి) దండంబాబూ! మీలాంటి ధర్మప్రభువులు నూరేళ్ళు బతకాలి. సప్పున వెళ్ళండి బాబు! బండి కదిలిపోతాది.

(తారా చంద్రం యిద్దరూ ఠీవిగా కుడివైపు నిష్క్రమిస్తారు. రామస్వామి హాలుమధ్యకు వచ్చి పైమీది పంచెతో బల్ల దులుపుతూ వుంటాడు.)

రంగ : (నేపథ్యంలో బిగ్గరగా) ఒరేయ్! అడుగు ముందుకేస్తే తలకాయి తీసేస్తాను.

భద్రం : (కుడివైపునుంచి ఒక్క గెంతుగెంతి ప్రవేశించి) ఒరేయ్! రామస్వామి. నువ్వే న్యాయం చెప్పరా! వాడికి నేను ఎన్నిసార్లు అరువు ఒప్పుకోలేదు.

రంగ : (కుడివైపునుంచి కోపంతో ప్రవేశించి) ఆ యేషాలు నాదగ్గర సాగవ్. ముందు రెండు రూపాయిలు అక్కడపెట్టి కదులు.

భద్రం : లేదురాబాబూ అంటే — నమ్మకపోతే చావనా?

రంగం : లేనోడువు లేదని మెదలక ఎందుకాడేవ్?

రాము: డబ్బు లేదని ముందే చెప్పలేక పోయేవంటయ్యా.

భద్రం: నాన్నెన్నూ, డబ్బు లేకపోవడమేమిట్రా? నా డబ్బు వందలకువందలు వూరిమీద వుంది. (జేబులోనుంచి కాగితం తీసి) చూడు, నాకు బాకీ వున్న వాళ్ళందరి పేర్లూ చదువుతాను విను.

రంగ : అలాంటేషాలు నాదగ్గరా? డబ్బక్కడ పెట్టక పోతే పీక నులిమేస్తాను.

భద్రం: తెల్లవారేసరికి నీ డబ్బు అణాపైసలతో తెచ్చి నీ ముఖంమీద పారెయ్యకపోతే నా పేరు...

రంగ: (కోపంతో) లాభం లేదన్నప్పుడు లాభం లేదు అంతే. నా డబ్బు నిమిషాలమీద అక్కడ పెట్టు. అప్పుడు కదులు. డబ్బు వసూలు చెయ్యకుండా నిన్నొదిలేస్తా ననుకోకు.

భద్రం: వెధవ డబ్బుకోసం మన స్నేహం పాడుచేసు కుంటావటరా?

రంగ: (బిగ్గరగా నవ్వుతూ) అహహా! యేం మాట సెప్పావ్ రొయెదవస్నేహం, యీ రాత్రిపోనే— రేపు రాత్రి కలుస్తాది.

రామ: (భద్రంతో) ఎక్కడో చూసి అడిడబ్బు ఆడి కిచ్చెయ్యవయ్యా. ఎందుగ్గొడవ.

భద్రం: నువ్వూ ఆమాటే చెబుతావేరా? (అరుగుఎక్కి దర్జాగా కూర్చుని) ఒరేయ్, ఖచ్చితంగా చెప్పే స్తున్నాను. తన్నుకుచచ్చినా—నాదగ్గర పైసా కూడా లేదు.

రంగ: ఆకరు మాట సెబుతున్నాను. డబ్బివ్వకపోతే నీ పొక్కా యిప్పించేస్తాను నిన్ను వంపేదిలేదు.

భద్రం: ఆనాడు హరిశ్చంద్ర మహారాజంతటివాడే— తన్ను తాను అమ్ముకున్నాడు. కాలం, ఖర్మం కలిసిరానప్పుడు ఏమైనా చెయ్యాలి.

రంగ: (అరుగుమీది నుంచి ఎగిరి గంతు వేసి కిందికిదూకి) అలాంటి పరువతక్కువ పని నేను చస్తే చెయ్యను. (రామస్వామిని సమీపించి) ఒరేయి రామస్వామి, డబ్బు యివ్వకపోతే పోయావు. నాకు రెండు రూపాయలకు జామీను వుండరా.

రంగ: (గద్దించి) ముందు నీ జేబూలు చూపిస్తావా— లేదా?

భద్రం: ఒరేయి, బాబ్బాబు, జామీను వుండరా రామ స్వామీ.

రామ: (కోపంతో) చాలు చాల్లేవయ్యా, నువ్వు బాగానే వుంటావు. మద్దిని రంగయ్య గాడూ నేనూ పిలకా పిలకా పట్టకోవాలి.

భద్రం: ఓరా! కాలమహిమ! రాసులకొద్దీ రూపా యలు కళ్లముందు చూచిన—యీ మాజీ జమీం దారు మిస్టర్ భద్రం—కేవలం రెండు రూపా యలకోసం- యీ వాడు పరువు పోగొట్టుకోవలసి వచ్చింది కదా!

రంగ: (కళ్లెర్రజేసి) జేబులు చూపిస్తావా మిల్లిరి సెయ్యమంటావా?

రంగయ్య కోపావేశంతో భద్రం మెడపట్టు కుంటాడు. సరిగా ఆ సమయంలో కుడివైపు నుంచి గ్లాసుతో కాఫీ తీసుకొని భూషణం వస్తాడు.)

భూష: (వస్తూనే బిగ్గరగా) ఆగు. (రంగయ్య భద్రాన్ని విడిచి వెనక్కి చూస్తాడు.) ఏమి టది? (చుట్టూ చూసి) శారదేది?

రామ: అయమ్మగారిమాటేనా బాబూ మీరడుగు తున్నాది?

భూష: అవును. కనుపించదేం?

రామ: ఆ బాబుగారొచ్చి తీసుకుపోయేరు.

భద్రం: అమ్మగారిని బాబుగారు తీసుకుపోయారు! వారెవా!

భూష: (ఆశ్చర్యంతో) ఎవరూ? చంద్రం వచ్చాడా?

రామ: ఆ అమ్మగారితో వచ్చినాయనే! ఆయన పేరు నాకు తెలీదండి.

భూష: సంతోషం. వాళ్లిద్దరూ కలిసిపోతే మనకు కావలిసిందేముంది! (ఒక్కసారి ఏదో గుర్తుకు వచ్చినట్లు) నా సూట్ కేసు నీకు యిచ్చారా?

రామ: నాకేమీ యివ్వలేదండి.

భూష: గదిలో విడిచిపెట్టి వెళ్లింకేమో!

[కలవరపాటుతో గదిలోకి వెళతాడు. తిరిగి రిక్తహస్తాలతో వస్తాడు.]

రంగ: అసల్నంగతేటో సెప్పవయ్యా నాకు.

భూష: యేం చెప్పను? నా సర్వస్వం అందులో వుంది.

రామ: వెళ్లిపోయేటప్పుడు అయ్యగారి చేతిలో తోలుపెట్టె వుండడం నేను చూశాను బాబూ!

భూష: (విచారంలో) అయితే యింకేముంది! నా సర్వస్వం పోయింది. ఐదువేల రూపాయలు!- ఒకటి రెండూ కాదు. అన్నిటికంటే ముఖ్య మైన ఫోటో, కొన్ని ఉత్తరాలు కూడా దాని లోనే వుండిపోయాయి.

భద్రం. ఐదురూపాయలు అప్పు యివ్వవయ్యా అని కాళ్లా వేళ్లాపడి బతిమాలితే— హాలాలక్ష్మణా అని గోలపెట్టావు. చూడు వాడెవడో మహానుభావుడు పెట్టెకు పెట్టే కొట్టేశాడు.

రంగ : (ఆశ్చర్యంతో) పెట్టె యెత్తుకుపోయాడా ? (కోపంతో బిగ్గరగా) యెవడాడు? నాకు చూపించు. పీకపిసికి యీ దిల్లో కిసిరేస్తాను.

భద్రం : (భూషణంతో) మరేం ఫరవాలేదు. మన రంగయ్య గాడితో చెప్పు. అంతా వాడే చూసుకుంటాడులే.

భూష : (విచారంతో అరుగుమీద కూలబడి) ఎంత మోసం.

భద్రం : ఆఁ! నా కిప్పుడు జ్ఞాపకం వస్తోంది. పెట్టె యెత్తుకు పోయినవాడు రైలు తప్పిన ప్రయాణీకుడేనా?

రంగ : ఇందాక నీ పక్కని కూర్చున్న వాడేనా?

భూష : అతనే.

రంగ : ఆడు నాకు గురుతున్నాడులే. (కోపంతో) వూళ్ళోనే వుంటే వున్నా ఆణ్ణి పట్టుకొని తలకాయ తీసేస్తాను. (ముందుకు అడుగు వేస్తాడు)

రాము : (రంగయ్యను ఆపుచేసి) వూళ్ళో యెక్కడున్నాడ్రా బాబూ? రైలు బండెక్కేసి యెళ్లిపోయాడు.

భద్రం : తార తారాపథంలోకి, చంద్రుడు చంద్రమండలంలోకి నిష్క్రమించారు. వహ్వా!

రంగ : (కోపంతో) యెంతి పన్నేశాడురా యెదవ, (రామప్పాయితో) నువ్వు చూడగానే నాతో యెందుకు సెప్పలేదురా? ఆడి తల అప్పుడే తీసేద్దును.

రాము : దొంగతనం చేశాడని యెవడికి తెల్సునురా బాబూ!

భద్రం : వాడు దర్జాగా—ఒక వయ్యారి భామను పక్కను పెటుకొని చక్కా పోయాడు.

రంగ : బూషణం బాబూ! మన సేతిలో యింకేం లేదు. అడ్డమైనోణ్ణీ నమ్మొద్దయ్యా అని నేను సెప్పనే సెప్పాను. నామాట యింటేనా?

భూష : డబ్బుకంటే విలువైన వస్తువులు దానిలో వున్నాయి. హరి భగవాన్! ఇప్పుడు నే నేం చెయ్యను!

[కలవరపాటుతో కుడివైపు వెళ్ళిపోతాడు. అతని వెనుక రామప్పాయి జాలిగా వెడతాడు.]

భద్రం : (నిష్క్రమిస్తున్న భూషణంతో) ముందు, మీది స్టేషనుకు ఫోను చెయ్యి. (క్షణం ఆలోచించి) ఒక సోదర మానవుడు కష్టపడుతూ వుంటే చూస్తూ వూరుకోవడం ఘోరం. నా చేతనైన సహాయం నేను చేసితీరాలి. (కుడివైపు చూస్తూ) అరె! అప్పుడే మెట్లుదిగి పోయాడు. ఏమయ్యోయ్! నేనూ వస్తున్నాను. ఆగు! ఆగు! (బిగ్గరగా పిలుస్తూ రెండు అడుగులు ముందుకు వేస్తాడు.)

రంగ : (అమాంతంగా భద్రం భుజంపట్టుకొని) ఒహో, యేవ మేస్తున్నావ్, యేషం! ముందు నా రెండు రూపాయలు అక్కడ పెట్టి కదులు.

భద్రం : (విసుగ్గా) లేదురా బాబూ అంటే వయత్రకుడి లాగ—పట్టుకొని వదలకుండా వున్నావ్!

రంగ : జేబూలు చూపించు.

భద్రం : (జేబులోనుంచి డబ్బులు తీసి) జేడార్థణా!కప్పు కాఫీ కోసం రా బాబూ యిది—నీ కో చిన్న ఉపాయం చెబుతాను. విను. నువ్వేం చెయ్యాలో. నా వెనుక నిలబడి మీసం మెలెయ్యి అంతే. నా పాతబాకీలన్నీ నిమిషాలమీద వసూలు చేసేస్తాను. నీ డబ్బులు నువ్వు పటుకుపోదువు గాని నా డబ్బులు నేను పట్టుకుపోతాను.

రంగ : రైట్! పద! ఇందులో ఏమైనా దగావుందో— నీ పని సఫా సేసేస్తాను.

భద్రం : ఏం మాట చెప్పావురా నా పామిరంగా! రా! రా! అలా దారికిరా!—ఒరేయి! రాత్రి అంటే ఇదిరా రాత్రి. ఇలాంటి రాత్రిని నువ్వు చస్తే మళ్ళీ చూడలేవు.

రంగ : డబ్బిచ్చేదాకా నిన్ను చస్తే వొదిలెయ్యను.

[ఇద్దరూ కుడివైపు నిష్క్రమిస్తారు— తెర.]

# సమానాంతర రేఖలు

శ్రీ ఆర్. యం. చిదంబరం

టెలిఫోన్ గణగణమంది—

ఓ సీరియస్ కేస్ చూశాక పది నిమిషాల్కితమే తిరిగి వచ్చాను. విసుగ్గా రిసీవరు అందుకున్నాను.

అవతలనుంచి కేశవరావు పరిచితకంఠం వినపడింది.

'హలో డాక్టరుగారూ! ప్రశాంతంగావున్న సముద్రంలో హఠాత్తుగా తుఫాను వీచినట్టు—నిశ్చల జలంలో మట్టిబెడ్డ విసిరినట్టు అయింది నాపరిస్థితి—'

ఆ మాటల్ని జీర్ణించుకోటానికి కాల వ్యవధి యిస్తున్నట్టు కొంతసేపు నిశ్శబ్దం—కేశవరావు తత్వమే అంతే. మొదట్నుంచీ అతనికి కవిత్వమంటే కొంత పిచ్చి వుంది. ఏది చెప్పవలసినా వుపమానాలు జతచేసి వున్న విషయాన్ని డొంక తిరుగుడుగా చెప్తాడు.

'సుందరం నిన్న సాయంత్రం వచ్చాడు. అతను వంటరిగా వస్తే బాగానే వుండేను. జ్వరంతో వచ్చి మమ్మల్ని వణికిస్తున్నాడు. మీకు శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించండి. వెంటనే బయలుదేరిరండి. మీకోసం ఎదురుచూస్తుంటాను.'

నవలల్లో మాదిరిగా, జీవితంలో సస్పెన్స్ వుంటేనే కాని రక్తికట్టదు. సుందరం ఎందుకు వచ్చాడు? అతని మనస్తత్వంలో ఎలాంటి మార్పులు వచ్చాయి? ఇలాంటి ప్రశ్నలు బుసలు కొడుతున్న నాగుల్లా తలెత్తాయి. వాటికి సమాధానం వెంటనే లభిస్తే పొంగుతున్న పాలమీద నీళ్ళు జల్లినట్టు ఉత్సాహం, ఆసక్తి నశించిపోతాయి. మెడిసిన్ ఛెస్టు సర్దుకుని అరుగుమీదకొచ్చాను. ఊహాగానంలో మునిగి వున్న డ్రైవరు కాలుస్తున్న బీడీ దూరంగా విసిరివేసి గబగబా వచ్చి డోర్ ఓపెన్ చేశాడు. సుజాత తలుపు వేసుకోటం— నేను బయలుదేరటం—ఒక్కసారే జరిగాయి. కారు దీపాల్లో కళకళలాడుతూన్న వీధులన్నీ దాటి చీకటిగుండా దూసుకుపోయి కేశవరావుగారి ఇంటిముందు ఆగింది.

తిన్నగా హాల్లోకి వెళ్ళాం. సుందరం ఇంకా వణుకుతూనే వున్నాడు. టెంపరేచర్ 103° వుంది. రుక్మిణి వేడినీళ్ళు తీసుకొచ్చింది. ఇంజక్షనిచ్చాను. ఎన్నో అనుమానాలూ—ప్రశ్నలూ సమయసందర్భాలకు తలవంచి ఆగిపోయాయి. తిన్నగా డ్రాయింగ్ రూంకి వచ్చి కూర్చున్నాను. గోడగడియారం చేస్తున్న చప్పుడు తప్పిస్తే గదంతా నిశ్శబ్దంగావుంది. కేశవరావు నాకేసి ఓమాటు తీక్షణంగా చూసి నవ్వాడు.

'నిన్న సాయంత్రం వచ్చాడు. తిన్నగా రాజమండ్రీనుంచి వస్తున్నాడట—మిమ్మల్ని నిన్ననే పిలుద్దామనుకున్నాను. కాని అతనే వద్దని వారించాడు. ఎందుకో మిమ్మల్ని చూట్టానికి భయపడుతున్నాడు—' ఎదురుగా వున్న గోడకేసి చూశాను. శ్రీ కృష్ణుడు విజయుడికి గీతారహస్యం బోధిస్తున్న పటం చిత్రింపబడి వుంది. అదేరీతిలో సుందరానికి హితబోధ చేశాను.

కామాక్షి గ్లాసునిండా చిక్కటి కాఫీ తీసుకొచ్చి నా ముందర వుంచింది. కళ్ళను నమ్మలేకపోయాను.

'ఆ!... కామాక్షి ఎప్పుడు వచ్చింది?'

'నెలరోజులు దాటుతుంది. మీకు మొదట్లో ఆ విషయం చెబుదామనుకున్నాను. కాని గడిచిన కాలపు సంఘటనలతో మీరు వృధాగా బాధపడతారని వూరుకున్నాను, మీరేమీ అనుకోకండి.'

అతని కంఠంలో క్షమాపణ ధ్వనించింది.

రుక్మిణి అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. ఆమెలో రేగుతున్న అశాంతిని నేను అర్థం చేసుకోగలను.

'సుందరం వున్న వుద్యోగానికి రాజీనామా యిచ్చి ట్రావెలింగ్ ఏజన్సీ తీసుకున్నాడట—వారానికోమాటు ఇంటిముఖం చూసేవాడట—కామాక్షికి విరక్తి పుట్టింది గాబోలు — ఇక్కడికి వస్తానంది. రుక్మిణి కూడా రమ్మని వుత్తరం రాయమంది—ఆమె యిక్కడకువచ్చాక అతనికి రెండుమూడు వుత్తరాలు రాశాను. అవన్నీ నాకే తిరిగివచ్చాయి. అతనిజాడ ఏమీ తెలియదు. ఏజన్సీ పనిమీద వూళ్ళమ్మటపడి తిరగటంవలన ఆరోగ్యం చెడిపోయిందన్నాడు—'

'ఉన్న వుద్యోగం ఎందుకు వదులుకున్నాడు?'

చేతిలో వెన్న వుంచుకుని నెయ్యికోసం వూరంతా తిరిగినట్టు సుందరాన్ని బాగా తెలిసివుండికూడా ఆ ప్రశ్న వేయటం తెలివితక్కువే—

'అదే సమాధానం రాని ప్రశ్న—అతనికీ, మేనేజరుకూ ఏవో మనస్పర్థలు వచ్చాయట—తప్పని సరైందట—'

'సరే!...తరువాత చూసుకుందాం. కామాక్షిని పంపండి. మందిస్తాను. రేపు వుదయానికి తగ్గుముఖం పడుతుంది.'

కామాక్షి వెనకాలసీట్లో కూర్చుంది. కారు బయలుదేరింది. చీకట్లోనుంచి వెలుగులోకి గాబోలు! ఆమెను ఎన్నో అడగాలనుకునే రమ్మన్నాను. కాని నాలుకదాకా వచ్చినమాటలు జన్మస్థానాన్ని వెదుక్కుంటూ తిరిగిపోయాయి. ఏదో అగ్నిజ్వాలముందు నిలబడినట్టు భయం.

పావుగంటలో ఇల్లు చేరుకున్నాం. డిస్పెన్సరీ తెరిచి మందు కలిపిచ్చాను.

'కామాక్షీ!...చాలా చిక్కిపోయావు సుమా! అసలు నువ్వివూరు వచ్చినట్టే తెలియదు. చూడ్డానికి వచ్చేదాన్ని...ఈమధ్య జబ్బుపడ్డావా ఏం?' అని కుశలప్రశ్నల రీతిలో సాగించింది సుజాత—ఆమెకేసి చూశాను, జ్యోత్స్నల్లో వెలుగుతగ్గింది. చందమామ పేలవంగా నవ్వాడు. ఎర్రగావున్న పువ్వులు మాధుర్యాన్ని కోల్పోయి వాడిపోతున్నాయి. ఇద్దర్నీ ఏకాంతంగా మాట్లాడుకోనిచ్చి మేడమీదికి వెళ్ళిపోయాను. వాళ్ళు ఏం మాట్లాడుకున్నదీ నాకు తెలియదు. పది నిమిషాలు గడిచాక కామాక్షి సన్నగా ఏడవటం వినిపించింది. ఏదో తప్పిదంచేసినట్టు బాధపడ్డాను—ఓదార్చుదామని నాలుగైదుసార్లు చివరి మెట్టువరకూ వచ్చి తిరిగి వెళ్ళిపోయాను.

'నాన్నగారూ!...కామాక్షి వెళుతుందిట—' అరిచింది సుజాత.

'కార్లో వెళ్ళు—రేపుదయం ఎలావున్నదీ ఫోన్ చెయ్యమను. అవసరమైతే వస్తాను' అన్నాను. ఆమె నమస్కరించి కదిలిపోయింది.

'అమ్మాయి! కామాక్షి ఎందుకేడుస్తోంది?'

'అంతా, తన సంసారపు గొడవలు చెప్పుకునే— ప్రతి మనిషీ కొన్ని కలలు కంటాడుట—అవి యథార్థం కాకపోతే ఏడుపే మిగులుతుంది ... అయినా నాన్నగారూ! ఈ విషయంలో మీ రెందుకు తల దూర్చారు? ఎవరి ప్రాప్తం వారిదని వూరుకోవలసింది.' తలవంచుకున్నాను. సుజాతకూడా నన్ను నిలదీసి అడిగింది.

స్త్రీలకూ, రహస్యాలకూ శత్రుత్వం వుంది. కామాక్షి తన వ్యథలు సుజాతతో చెప్పుకుందంటే ఆశ్చర్యంలేదు. కాని నేనే అడిగివుంటే సరైన జవాబు రాకపోయేదేమో!...అద్దంలో ముఖం కనిపించింది. కళ్ళల్లో రెండు నీటి చుక్కలు. అవును. అపనిందంతా నాతలమీద వేసుకున్నాను.

అయిదారు సంవత్సరాల క్రితం సుందరం బి. ఏ. సీనియర్ చదివేవాడు. ఇంటికి దగ్గరగా వుండటంవలన అతన్ని పరిశీలించే అవకాశం దొరికింది. భవిష్యత్తులోకి తొంగిచూసే శక్తి వుందేమో కాని మాత్రుహోంకు-ప్రైస్ రైటింగ్ చేస్కోటం మొదలుపెట్టాడు. కేవలం బి. ఏ. చదవటం చేతిలోకి కాయలాంటిదని ఉపమానాలలో వర్ణించి చెప్పేవాడు. అంతవరకూ బాగానే వుంది. కాని నెలకు పట్టుమని పదిరోజులైనా క్లాసుకు వెళ్ళేవాడుకాడు. కారణ మేమిటని ప్రశ్నిస్తే చిత్రమైన సమాధానాలు చెబుతాడు. ఓనాడు వంట్లో బాగాలేదంటాడు. మరోనాడు నిద్రనుంచి మేల్కొనేసరికే ఏడైందంటాడు. చివరకు, అతని జవాబులు విని విని, అలసిపోయి నేను చేసుకున్న నిర్ణయం యిది. అతను వాస్తవిక పరిస్థితుల్ని ఎదుర్కోలేక తప్పించుకోటానికి తన చుట్టూ ఇనుపకోటలు సృష్టించుకుని, ఏవేవో కలలుకంటూ ఊహాప్రపంచంలో-గాలిలో వేలాడుతున్న స్వర్గంలో విహరిస్తూ కాలం గడుపుతూ తన్నుతాను మోసం చేసుకుంటున్నాడని. తన దౌర్బల్యాన్ని సమర్థించుకోటానికి అతను కల్పించుకునే కారణాలు విచిత్రంగా వుంటాయి. పరీక్షలు దగ్గర కొస్తున్నా అతను ఏమీ చదివేవాడు కాదు. అర్ధరాత్రి సినిమాకొద్దు దగర నిలబడి ఆకాశంకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తూ ఖగోళశాస్త్రజ్ఞుడులా నిలబడేవాడు.

'ఏమయ్యా! ఏమిటిది! ఇలా బాధ్యత గుర్తించకుండా చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్నావు?' అనడిగాను.

'ఏం చెయ్యమంటారు! పక్కింట్లోవున్న ఆ విధవరాలు సంగతి మీకు బాగా తెలుసుగా! ఆమె వుదయం నాలుగు గంటలనుంచీ, రాత్రి పదకొండువరకూ అరుస్తూ సణుగుతూ, ఎవరెవర్నో తిట్టి పోస్తూ కాలం గడుపుతోంది. ఇంక చదువుమీద నాకెలా శ్రద్ధ కలుగుతుంది చెప్పండి!'

అదీ అతని సమాధానం-దాన్ని ఏ విధంగా ఖండించాలోకూడా తెలియదు. ఇది కేవలం 'ఎస్కేపిజం' అయితే ఎంతకాలం యిలా తప్పించుకు తిరగ్గలడని?...

అతని తెలివి తేటలు అడవి కాచిన వెన్నెలలా వృధాకావటం నన్నెంతో బాధించింది. ఏ మానవుడూ పుట్టుకలోనే నిశ్చితమైన మనస్తత్వం కలిగి వుండడని, అతని చుట్టూవున్న వాతావరణమే మంచిచెడ్డలు, గుణగణాలు నేర్పుతుందని అంగీకరించినప్పుడు, ఆమనస్తత్వాన్ని తగిన రీతిలో మార్చటంకూడా మన చేతిలో

వుందని అంగీకరించాలి. అడవిలో మదించి తిరుగుతున్న ఏనుగును పట్టి తీసుకొచ్చి సరైన మార్గంలో తరిఫీదు చేశాక మానవజాతికి ఎంతో వుపకారం చేస్తోంది. దొంగను, హంతకుడిని ప్రయాసకోర్చి సరిదిద్దటం గగన కుసుమం కాదు. అయితే ఈ మార్గానికి చాలా సమస్యల్ని ఎదుర్కొని ధైర్యంగా నిలబడవలసివుంది. ఇలాంటి ఆలోచనలే నన్ను చుట్టుముట్టాయి. సుందరాన్ని సరైన మార్గంలో వుంచేవారుంటే అతను బాగుపడతాడని నిర్ణయించుకున్నాను.

కామాక్షి తండ్రికి నామీద గౌరవంవుంది. చాలా విషయాల్లో అతను నా సలహా తీసుకునేవాడు. రుక్మిణి పెళ్లి అయిందనిపించేసరికి అతని కలప్రాణం తోకకొచ్చింది. రెండో కూతురు పెళ్లి జరిపించటం ఎలాగన్న దిగులు అతన్ని బాధించసాగింది.

కామాక్షి తెలివైంది. స్కూలు ఫైనలు వరకూ చదువుకుంది. ఎక్కడో ఆకాశంలో దాగివున్న రహస్యాల్ని శోధిస్తున్నట్టు తీక్షణమైన కళ్ళు. శిఖరం మీద నిలబడి ఆకాశాన్ని వెక్కిరిస్తున్నట్టు చిరునవ్వు-

నాముందు రెండు శక్తులు నిలబడివున్నాయి. ఒకటి సూర్యచంద్ర గోళాల్లో వుండిపోయిన రహస్యాల్ని సహితం శోధించగలిగింది. రెండోది అణుశక్తి తనలో వున్నా సద్వినియోగం చేసుకోలేక తాడు తెగిన గాలిపటంలా ఎగురుతున్నది. రెండింటినీ పరిశీలించాక, సుందరానికీ, కామాక్షికీ పెళ్ళిజరిగి తీరాలని నిశ్చయించుకున్నాను.

ఆ మర్నాడే సుందరం మావయ్యతో ఈ విషయం కదిపాను. ఆసమయానికి కేశవరావు అక్కడే వున్నాడు. కామాక్షి తండ్రి సుందరాన్ని గురించి దర్యాప్తుచేసి పెదవి విరిచాడు. అతనికి ఆస్తిలేదు— వుద్యోగంలేదు. స్థిరత్వంలేదు. గాలి ఏదెసగా వీస్తే పడవకూడా అదెసగా పరుగెడుతుంది. సుందరం మావయ్య కొంత కట్నం యివ్వనిదే పెళ్ళిజరగటానికి వీల్లేదన్నాడు. అది సమంజసమే అనిపించింది. సుందరం భర్తభారం వహిస్తుంటే అతని తల్లిదండ్రులు ఒకరితరువాత మరొకరు కన్నుమూశారు. అతన్ని ఆదరించి చదివించింది మావయ్యే - ప్రతిఫలం కోరటంలో తప్పేముంది? సుందరం ప్రకృతిని బాగా అర్థంచేసుకున్న వారెవరూ అతను ఈ యీ పరిస్థితుల్లో, ఇలా యిలా ప్రవర్తిస్తాడు అని సిద్ధాంతీకరించలేరు. పెళ్ళై విడిపోయాక మావయ్య ఋణంతీర్చుకుంటాడని నమ్మకమేమిటి?......చివరకు అందర్నీ ఒప్పించి శుభకార్యం పూర్తయిందనిపించేవరకూ నాకు నిద్రపట్టలేదు. బి. ఏ. పూర్తికాగానే సుందరానికి మంచి ఉద్యోగం దొరికింది. కామాక్షిని వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు. మానవజీవితాలమీద నేను సాగిస్తున్న ఈ ప్రయోగం ఎంతవరకూ విజయవంతమవుతుందో!

కాని—

నా సిద్ధాంతాలు కేవలం వూహామాత్రమైనవని కాలం నిరూపించసాగింది. ఎంతగానో గౌరవించి ప్రేమించిన సుజాతకూడ నన్ను నిలదీసి అడిగేసింది. ఏడాది గడిచాక నేను టౌనులో ప్రాక్టీసు పెట్టాను. అప్పుట్నించే కేశవరావు స్టేట్ బాంక్ లో పనిచేస్తున్నాడు. కామాక్షిని గురించిన వార్తలు అప్పుడప్పుడు చెవిన వేస్తూండేవాడు.

ఓనాడు ఆమె వ్రాసిన ఉత్తరం చదివి వినిపించాడు.

'ఈ మధ్య నేను జీవితానికి రెండు పక్కలు వున్నాయని అర్థంచేసుకున్నాను. ఒకమనిషి మరో మనిషిమీద ఆధారపడటం కాని—ఒకర్ని మోసి జరుపుకుని తన స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను వ్యాసబద్ధమైన వాంఛల్ని అణచుకుని బ్రతకటం గాని ఎంత తెలివితక్కువ! ఈ మధ్య మధ్యాహ్నం పూట లైఫ్ రైటింగ్ చేస్తున్నా!...

ఆ తరువాత అతనేం చదివింది నాకు తెలియదు.

నాలో నేనే అనుకున్నా: 'అయితే అతను మారలేదు.'

ఒక వ్యక్తి తన్ను తాను అపహాస్యం చేసుకున్నాడంటే, నిరాశావాద ధోరణిలో పడ్డాడంటే ఆ వ్యక్తిలో ఏదో లోపం వుందన్నమాట!

కిటికీలోంచి రివ్వున ఓ గాలి కెరటం, లోపలకు ప్రవేశించింది. టేబిలుమీదున్న కాగితాలు ఎగిరిపోయాయి. అవి ఎంతదూరం వెళ్లగలవని వెనక్కి తిరిగి చూశాను; సుజాత అవన్నీ తీసుకొచ్చి తిరిగి టేబిలు మీద వుంచింది.

నేను సైకాలజీ గురించి వ్రాస్తున్న పుస్తకం తాలూకు పేజీలు అవన్నీ, వివిధమనస్తత్వ శాస్త్రజ్ఞులు వ్రాసిన విషయాల్ని ఒకచోట చేర్చి, నేను గడించిన అనుభవాన్ని ఆధారంగా చేసుకుని కొన్ని క్రొత్త సంగతులు ప్రతిపాదించాలని నేను చేస్తున్న నిరంతరకృషి- సుందరం గుర్తుకురాగానే ఉద్రేకంలో ఆ పేజీలన్నిటినీ చించివేశాను. ఆరేళ్ళ కాలపరిమితిలో ఒక వ్యక్తిని అర్థంచేసుకోలేని నేను ఓ బ్రహ్మాండమైన పుస్తకంవ్రాసి లోకాన్ని మోసగించటానికి ప్రయత్నించటం! హాస్యాస్పదం— 'నాన్నగారూ' ఒంటిగంట కావస్తూంది. పడుకోండి.' అంది సుజాత.

మర్నాడు ఉదయం లేవగానే మొహమైనా కడుక్కోకుండా 'సుజాతా! ఏమైనా కాల్ వచ్చిందా?' అని అడిగాను.

కేశవరావుగారు ఫోన్ చేశారు. సుందరానికి జ్వరం నార్మలుకు వచ్చిందట—మీరు రానవసరంలేదన్నాడు.'

నాలుగైదురోజులు గడిచి పోయాయి. ప్రతి క్షణం ఓ యుగంలా—కొన్ని టన్నుల బరువును మోస్తున్నట్టు బాధపడుతూ గడిపాను. కేశవరావు వస్తాడనుకున్నాను—రాలేదు. కనీసం ఫోన్ చెయ్యనైనా లేదు, 'ఒకరి కర్మకు మరొకరు బాధ్యులు కారని విశ్వసించే అతను కూడా ఈవిషాద మంతా నేనే కలిగిస్తున్నానని అసహ్యించుకుంటున్నాడు. కామాక్షి జీవితం యిలా వికసించని పుష్పంలా తయారవుతుందని నాకు మాత్రం ముందుగా ఏం తెలుసు? ఆ సాయంత్రం ఇంటికి రాగానే సుజాత రెండు విషయాలు చెప్పింది.

'మధ్యాహ్నం మీకోసం ఎవరో స్నేహితుడు వచ్చాడు. మళ్ళీ సాయంత్రం వస్తానన్నాడు. అరగంట్రకితం తను వస్తున్నానని సుందరం ఫోన్ చేశాడు.'

రెండోవార్త కొంచెం ఆశ్చర్యాన్ని కలిగించింది.

మరో అరగంటకు ఆ స్నేహితుడు రానే వచ్చాడు—అతని పేరు కైలాసం—సుందరం, అతనూ ఒకేకంపెనీలో పనిచేసేవారు. మావయ్యకొడుక్కి పెళ్ళిట అందుకని వచ్చాడు.

స్నేహధర్మం పాటించి, ఓ మారు చూసి పోదామని వచ్చాడు. 'అన్నట్టు సుందరం మా కంపెనీలో ఉద్యోగానికి విడాకు లిచ్చి వెళ్ళిపోయాడు-ఆ సంగతి మీకు తెలుసా? అతను ప్రస్తుతం ఎక్కడ వున్నదీ కూడా తెలియదు.'

సుజాత రేడియో వింటున్నట్టు నటిస్తూ మా సంభాషణపైనే ధ్యానాన్ని కేంద్రీకరించింది.

'అతను యిక్కడే నిరుద్యోగిగా వున్నాడు. చూడు కైలాసం!...నువ్వు తెలివైనవాడివి. పరిస్థితుల్ని అర్థం చేసుకోటంలో నీకు సూక్ష్మబుద్ధివుంది.'

'పెద్ద పీఠికే వేస్తున్నారు!' అంటూ అడ్డం తిరిగాడు.

'సుందరం చిత్రమైన మనిషని నువ్వుకూడా గ్రహించి వుంటావు. అతన్ని గురించి నువ్వు చెపిన రిపోర్ట్ ఏమిటి?'

'డాక్టరుగారూ! ముసుగులో గుద్దులాట ఎందుకు? అంతా వివరిస్తాను.'

సుజాత వంక చూశాను. సగం పూర్తయిన సైకాలజీ పుస్తకాన్ని అక్కడక్కడా చదువుతోంది.

'అతనూ, నేను చాలా దగర స్నేహితులం. తన వ్యక్తిగత విషయాలు అనేకం నాతో చెప్పుకుని ఏడ్చేవాడు. కాని చిత్రం ఒక్కటే! ఒకనాడు చెప్పిన అభిప్రాయానికి, మర్నాటిదానికీ ఎక్కడా సంబంధం వుండేదు. తను చదువుకున్న అమ్మాయిని చేసుకోవాలనుకున్నాడని, మీరు ఆలోచించుకోనివ్వకుండా ఎవరెవరో మెడకు తగిలించారన్నాడు. పెళ్ళిచేసుకోటం పెద్ద పొరపాటంటాడు. దాని మూలంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నశించిపోతాయి. దానివకంటె హీనంగా బతుకుతున్నాడట.'

'అంటే ఎంతవరకూ చదువుకుని వుండాలని అతని వుద్దేశం' అడిగింది సుజాత—

'అది నాకు తెలియదు. మొత్తానికతనికి సంసార జీవితం కరక్కాయ నములుతున్నట్టే వుంది. చెప్పాలంటే భారతమంతకథ వుంది. మా కంపెనీ మేనేజరుగారమ్మాయి అప్పుడప్పుడు ఆఫీసుకు వస్తూండేది. అతన్తో మాట్లాడుతుండేది. మరొకరివంక కన్నెత్తి అయినా చూడదు. ఇదంతా గమనిస్తున్న ఆఫీసు సిబ్బంది పుకార్ల మీద పుకార్లు లేవదీసింది. కొందరు వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారన్నారు. సుందరంతో బాటు తెలివితేటలూ, అందచందాలు ఎవరైనా ఆకర్షిస్తాయని సిద్ధాంతీకరించారు. ఓ నాడు సుందరాన్ని పిలిచి మందలించి జాగ్రత్తగా మసలుకోమన్నాను. అంతవరకూ వస్తే ఆమెను చేసుకోటానికి సిద్ధమేనన్నాడు - ప్రస్తుతం వున్న పెళ్ళాన్ని తను కోరి చేసుకోలేదని, ఆమెకు విడాకు లివ్వటంలో ఎంతమాత్రం పొరపాటులేదని వాదించాడు. అంతపని చేస్తాడనే నా భయం. అతన్ని విశ్వసించలేం. ఉన్నట్టుండి మేనేజరుకూ అతనికీ ఓనాడు పెద్ద వాగ్వివాదం జరిగింది. మాటలు గౌరవ మర్యాదల్ని అధిగమించి దొర్లిపోయాయి. మరుక్షణం రాజీనామా కాగితం అతనిముందు విసిరేశాడు. మేనేజరుగదికి పక్కనే వున్న గుమాస్తా, దానికంతకూ కారణం అతని దుష్ప్రవర్తనేనని మేనేజరుగారమ్మాయి పేరు నాలుగైదుసార్లు దొర్లిందని అన్నాడు. దాంట్లో ఎంతవరకూ నిజం వుందో తెలియదు మరి—' సుజాత రేడియో కట్టేసి మా కెదురుగావున్న కుర్చీలో కూర్చుంది. 'తరువాత ఏదో ఏజన్సీ తీసుకున్నాడు. పది రోజులు పోయాక అదికూడా వదిలేశాడు. అంతే కొండండోయ్! సింహాచలం కొండలమీద పదిహేనురోజులు గడిపాడట—ఎందుకని అడిగాను—ఏకాంతంలో తియ్యదనం ఎలా

వుంటుందో రుచి చూడాలనుకున్నాడట—అందుకని, అందరికీ దూరంగా వుండాలని ఈ ప్రయోగాలు చేస్తున్నాడు.

'అక్కడైనా సుఖం దొరికిందా?'

'అదే లేదంటాడు. ఇంక సన్యాసం పుచ్చుకుని చూడాలని వుందట—ఏ, దగ్గర్నుంచి, జెడ్ వరకూ వున్న వుద్యోగాలు చూడటం పూర్తయింది. ఇంక మిగిలేదేముంది?'

'వట్టి అబద్ధాలకోరు' అంటూ పళ్ళు పటపట కొరికింది. కామాక్షి నిలిపిన కన్నీరు ఆమెలో ఇంకా ఇంకిపోలేదు. స్త్రీలకు సహజంగా వారి జాతిమీద సానుభూతి వుంటుంది.

'అమ్మాయి! అదే పొరపాటు! అతను అబద్ధాలు చెప్పలేడు. స్వలాభంకోసం నిజాన్ని కప్పిపుచ్చి చెప్పేదే అబద్ధం—అతని ఆలోచనలు అలాంటివి.'

'చాలు నాన్నగారూ! మీ నిర్వచనాలు పుస్తకాల్లో వ్రాసుకోండి; ప్రచురించండి; వేలకు వేలు కాపీలు అమ్మండి; అంతేకాని అమాయక జీవులమీద రుద్దకండి.'

సుజాత లాజిక్ చదవటం తప్పేమోననిపించింది.

సుందరాన్ని కాషాయ వస్త్రంలో, కమండలం పాదరక్షలతో సన్యాసిగా వూహించాను. తల గిర్రున తిరిగింది.

'నేను వస్తానండి. కొత్తవూరు కనుక వాళ్ళు ఆలస్యమైతే నా కోసం కంగారు పడతారు.' అంటూ అతను నమస్కరించి వెళ్ళిపోయాడు.

'అయితే నాన్నగారూ! అంతా విన్నారు కదా! ఏమంటారు?'

సమాధానం చెప్పాలనుకున్నాను. మాటలకంటె ఆలోచన లోతైనది. మనం తెలుసుకున్న విషయాలు ఇతరులకు చెప్పలేం—మనిషిని మనిషి పూర్తిగా అర్థం చేసుకోలేడు. వ్యాధిచిహ్నాన్ని బట్టి వ్యాధిని నిర్ణయించినట్టు, ప్రవర్తననుబట్టి మన స్తత్వాన్ని నిర్ణయించవలసి వుంటుంది. అలా నిర్ణయించినా దానికి స్థిరమైనరూపం వుండకపోవచ్చును. ఆత్మలో వున్న భావాల్ని తరచిచూడగల యంత్రం వుందే? ఒక కాలంలో దివ్యంగా ప్రకాశించిన భవనం తాలూకు స్తంభాలు—మిగిలిన అస్తిపంజరాలు—పురోగమనమో—తిరోగమనమో అర్థం కాదు. అంతా స్వప్నసమానం కాకపోతే ఏమిటీ వేదాంతం! నీటిచుక్కలు సముద్రంలో కలుసుకుంటాయి. కాని కలిసి ప్రయాణం చేస్తున్న విభిన్న హృదయాలు ఎక్కడ కలుసుకుంటాయి?

'సుజాతా! నీకు వేళాకోళంగా నే వుంటుంది — అయినా చెప్తాను. సుందరం జీవించటం మానుకుని జీవితాన్ని గురించి ఆలోచించటం మొదలుపెట్టాడు. అదే అతను చేసిన మొదటి పొరపాటు. పలువురితో కలిసి మెలిసి తిరుగుతూ వాళ్ళ అభిరుచుల్లో భాగం పంచుకుని అందులో వుండే తియ్యదనాన్ని ఆస్వాదించగలిగిన వ్యక్తి మందిలో మేకలా—వెయ్యి కరటాల్లో ఓ కరటంలా కాలం గడిపేస్తాడు. అతన్లో అసంతృప్తి — మాగవాంఛలు — చీకట్లో చేతులు అటూ యిటూ వూగించటం — వుండవు — సుందరం అందుకు విభిన్నమైనవాడు కాదు. కామాక్షి అతన్ని సరిదిద్దుతుందనుకున్నాను. కాని కామాక్షి కూడా అలాంటిదేమో నన్న భయం కలుగుతోంది. రెండు సమాంతర రేఖలు ఎక్కడా కలుసుకోవు.'

సుజాత నన్ను హేళనచేస్తూ పక్కున నవ్వింది.

'ఎందుకు కలుసుకోవు?...ఇన్ఫినిటీలో కలుసుకుంటాయని మీ శాస్త్రం ప్రతిపాదిస్తోందిగా !'

తలుపు కిర్రుమంది. సుందరం వచ్చి నమస్కరించాడు.

వ్రాస్తున్న పేజీలను ఓమూలవుంచి ఎదురుగా కూర్చున్నాను.

'ఏమోయ్! కులాసాగా వున్నావా? ఏమిటి సంగతి?'

అతను నాలుగైదు నిమిషాలు తల వంచుకుని కూర్చున్నాడు. అతనికి నేనంటే భయమని కోటరావు ముందే చెప్పాడు.

'డాక్టరుగారూ! మీరు నన్ను క్షమించాలి.' అంటూ ప్రారంభించి రెండేళ్ళ తన జీవితక్రమాన్నంతా మాటల ధోరణిలో వర్ణించాడు. అంతా వింటూ కూర్చున్నాను. చివరకు, తన తప్పేమీ లేదని అంతా పరిస్థితుల ప్రాబల్యమని తేల్చాడు. ఖూనీచేసి 'అలా చేయమని నా నొసట రాసివుంటే దాన్ని మార్చటం ఎవరితరం?' అన్నట్టుగావుంది.

అతనికి మళ్ళీ హితబోధ చేయనారంభించాను, మౌనంగా విన్నాడు 'డాక్టరుగారూ!...నా ప్రవర్తనకు సిగ్గుపడుతున్నా—గడిచినదంతా మర్చిపోండి—ఇకముందు బుద్ధిగా నడుచుకుంటాను. ఓ ఉద్యోగం చూపెట్టండి. అదే చాలు!' అంటూ వెక్కి వెక్కి ఏడవనారంభించాడు.

టెలిఫోన్ గణగణమంది.

అవతలనుండి నా మిత్రుడొకడు మాట్లాడాడు.

'మా కంపెనీలో టైపిస్టు కావాలి. మీరిదివరకు ఏదైనా ఖాళీలు వుంటే చెప్పమన్నారు కదా-అందుకని తెలియజేస్తున్నా—ఇప్పటికే డజనుమంది ఇంటర్వ్యూకి వచ్చారు. మీ తాలూకు ఎవరైనా వుంటే రేపు పన్నెండు గంటలలోగా రమ్మనండి. ఆ తరువాత నేనేం చెయ్యలేను.'

వెదుకుతున్న తీగ కాళ్లకు చుట్టుకున్నట్టయింది. ఆయన్ని అభినందించి రేపు ఉదయం ఓ టైపిస్టును పంపిస్తానన్నాను.

సుందరం సంగతులు తెలుసుకుని సంతోషించాడు. అడ్రసు వ్రాసుకున్నాడు. నా ఎదురుగా కూర్చుని అప్లికేషన్ వ్రాశాడు.

కృతజ్ఞత చెప్పి వెళ్ళిపోయాడు. సుందరం మారాడు.

కాని అతన్ని మార్చింది కామాక్షి కాదు.

ఆరాత్రి తృప్తిగా నిద్రపోయాను.

మర్నాడు మధ్యాహ్నం ఒంటిగంటకు కంపెనీ మేనేజరుకు ఫోన్ చేస్తే సుందరం అక్కడకు వెళ్లలేదని తేలింది.

కేశవరావుకు ఫోన్ చేశాను.

'సుందరం నిన్న సాయంత్రం ఇల్లువిడిచి వెళ్లాడు. మళ్ళీ తిరిగిరాలేదు. అతనువస్తాడని నమ్మకం నాకు లేదు. మీ అభిప్రాయం అడగటంకూడా నాకిష్టంలేదు. జరిగింది జరిగిపోయింది. పిల్లకుక్కను గంగలో ముంచితేమాత్రం గోరూపంవస్తుందా? పాపం, కామాక్షిగురించి మీరు బాధపడకండి. ఆమె తన బ్రతుకు తెరువు తను చూసుకుంటుంది. నమస్తే!'

'నీకూ నాకూ సంబంధం నాస్తి' అన్నట్టు సమాధానం!

—

అతనికోసం ఎక్కడని వెతకను? మళ్ళీ పలాయనం చిత్తగించి వుంటాడు. ఎప్పుడైనా వస్తాడు. కన్నీరు కారుస్తాడు. అమర్నాడే అదృశ్యమవుతాడు! ఛీ! ఇంతకంటె అతను బలవంతంగా చస్తేనే బాగుండుననిపించింది. ఈపాడు బోతుతత్వం మొదట్నుంచీ వేళ్ళు పాతుకపోయి అతన్ని ముంచివేసింది. ఇంక దాన్ని సరిదిద్దటం ఎవరితరమూ కాదు...గబగబావెళ్ళి సగం పూర్తయినపుస్తకం తాలూకు పేజీలన్నీ ఒక్కొక్కటే చిన్న చిన్న ముక్కలుగా చించివేశాను. చిత్తుకాగితాలబుట్ట నిండిపోయింది. వికటంగా ఓమారు నవ్వుకున్నాను. అవును—ఓటమి—సిద్ధాంతాల సమన్వయంలో ఓటమి; విక్టర్—బ్రౌన్—ప్రిన్సిపల్—వీళ్ళందరూ ఏంసాధించారో నాకు తెలియదు. కాని నేనుమాత్రం చీకటి కోణంలోకి విసిరి వేయబడ్డాను.

మహాసముద్రాన్ని సురక్షితంగా యీదేసి అవతలి గట్టు చేరుకోవాలని సంకల్పం. కబళించటానికి ఎగిరి పడుతున్న అలలు ఎదుర్కొకూడను. సుడి గుండాలు వుంటేకూడను. అనుమానం—అందరాని పండుకోసం ఆకాశపు అంచులు అందేవరకూ ఎగరటం కామాక్షిని సుందరం అసహ్యించుకోటానికి కారణాలుగా వూహించవచ్చు. ఒకవ్యక్తిని మరో వ్యక్తి ద్వేషించటానికి స్వల్ప విషయాలు చాలు. కామాక్షి అనుసరించిన నిశ్చల సంప్రదాయాలకూ, క్షణక్షణానికి రంగులు మారుస్తుంటున్న అతని ప్రవృత్తికీ పొత్తు కుదరదేమో—కామాక్షి భర్తను దైవంగా పూజిస్తే అతను ప్రేమదేవతగా స్వేచ్ఛ ప్రకటించమన్నాడేమో!

అయిదారు రోజులుగడిచాక ఓమిత్రుడికి వీడ్కోలివ్వటానికి స్టేషనుకు వెళ్ళాను. అక్కడ కైలాసం కనిపించాడు. రైలు కదులుతుంటే నా ముందునుంచే గబగబా ఓ సన్యాసి పరుగెత్తుకెళ్ళి కంపార్టుమెంటులో జొరబడ్డాడు. సుందరం! సుందరం అంటూ పరుగెడుతున్న రైలుతో వెర్రిగా అరుస్తూ పరుగెత్తాను. రైలుమాత్రం ముఖంచిట్లించి పెద్దగా అరచి పొగలో ముంచివేసి దూరంగా వెళ్ళిపోయింది.

అయితే ఇంక కామాక్షి ఆత్మహత్య చేసుకుంటుంది.

'కైలాసం! చూశావా! సుందరం సన్యాసం పుచ్చుకున్నాడు. ఆనాడు హాస్యానికన్నమాట నిజమైంది.'

'అబ్బే! అతను సుందరం కాదండి' అతనెవరో నేను జాగ్రత్తగా చూశాను. మీరు పొరబడ్డారు.'

'కాదు.....కాదు...నేను సరిగా చూశాను. నా కళ్ళు నన్ను మోసగించలేవు.' అరిచాను ఆవేశంతో. కామాక్షినిగురించి ఆలోచించలేకపోయాను.

'అబ్బే!... మీకు మతి భ్రమించివుండాలి. ...అయ్యో! ఏమిటిది!' అరిచాడు కైలాసం.

తల గిరగిరా తిరిగింది. కళ్లు చీకట్లు కమ్మాయి.

రైలు చక్రాలకింద.........అయ్యో!...... ఆ తరువాత ఏం జరిగింది నాకు తెలియదు.

# కలగూరగంప

## నాట్యసంగీత గ్రంథములు

శ్రీ పోతూకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

సంగీత విషయములపై భరత టీకను అభినవుడుదహరించినాడు. హర్ష వార్తిక మనేకస్థలముల ప్రస్తుతించిన వారిలో అభినవుడు, భోజుడు, శారదాతనయుడు గలరు. స్త్రీల అలంకారములను చర్చించు చోట శాక్యాచార్య రాహులకుని శ్లోక వార్తికము తీసికొని రాబడినది. ఈ శ్లోకవార్తికము భరతుని గ్రంథమునకు వివరణ. హేమచంద్రుడు కూడ రాహులకుని వ్యాఖ్యను స్మరించినాడు. తోటకము నాటకాంతర్భూతి మనిన ఖకుట్టుని మతముగా బహురూప మిశ్రుడనినాడు గాని. ఈవాదము హర్షునిదని శారదాతనయుడు. సుందరమిశ్రుని నాట్యప్రదీపమున మాతృగుప్తుడు భరతుని వ్యాఖ్యానించినట్లు కలదు.

కీర్తిధరుడు భరత వ్యాఖ్యాతలలో నొకడుగా కన్పించుచున్నను, ఇతడు నందికేశ్వరుని మతము నవలంబించెనని యున్నది.

> "యత్తత్కీర్తిధరేణ నందికేశ్వర మతానుగామి త్వేన దర్శితం తదస్మాభిః నదృష్టం, తత్ప్రత్యయాత్తు లిఖ్యతే"

అని ఇరువది ఎనిమిదవ అధ్యాయమున అభినవుడనినాడు. దీనినిబట్టి నందీశ్వరుని నాట్యశాస్త్రము అభినవునకు లభించలేదని, నందీశ్వర మతమునవలంబించినవాడు కీర్తిధరుడని చెప్పనగును.

ఉద్భటలొల్లటులు నాట్యశాస్త్ర వ్యాకర్తలని మనకు తెలిసినవిషయమే. ఉద్భటుని తర్వాత, లొల్లటునకు పూర్వము వచ్చిన శకలీగర్భుడు భరతుని నాల్గువృత్తులకు ఆత్మసంవిత్తియను ఐదవవృత్తిని చేర్చెనని అభినవుడనినాడు.

భట్టసుమనసుడు, భట్టవృద్ధి, భట్టయంత్రి, భట గోపాలులుకూడ అభినవ భారతిలో పేర్కొన బడినారు. సుభాషితావళిలో భట్టవృద్ధిరచించిన కొన్ని శ్లోకములు కన్పించుచున్నవి. భట్టయంత్రుని నృత్తలక్షణము అభినవభారతిలో (1.208) గలదు.

భరతుని మతమును తు, ద తప్పక అనుసరించిన వాడు దత్తిలుడు. దత్తిల గ్రంథమునకు ప్రయోగస్తబక మనువ్యాఖ్యగలదు. కోహలుడు నాట్యశాస్త్రములోని విషయములను పెంచి, ప్రస్తార తంత్రమును చెప్పినట్లుగా నాట్యశాస్త్రమునందే (28.18) గలదు. ఇతడు రచించిన అభినయశాస్త్రములోని తాళాధ్యాయమే నేడు లభించుచున్నది. కోహలుడు దత్తిలునకు చెప్పినట్లున్న దత్తిలకోహలీయము, మతంగునకు చెప్పిన కోహల రహస్యము నేడుకూడా కలవని వినికిడి. కోహలుడు తన ప్రధానగ్రంథమును శార్దూలునకు చెప్పినట్లు కల్లినాథుని సంగీత రత్నాకరవ్యాఖ్యలో కన్పించుచున్నది.

మతంగుని బృహద్దేశి ఆరు అధ్యాయముల వరకే లభించుచున్నది. దీనిలో శ్రుతులు, స్వరములు మాత్రమే వివరించబడినవి. మూర్ఛనలో పంద్రెండు స్వరములు భరతునిలో లేనివి ఇటగలవు. ఝుక్కాజీ జాతికి చెందిన హరివిలాస ప్రబంధ మితనిసృష్టి. దత్తిల, కోహలు లితని పుత్రులని ఒక సంప్రదాయమున్నది.

మార్గ, నాట్యములను వివరించు బ్రహ్మ భరతమను గ్రంథ మారు అధ్యాయములలో గలదని, ఇది అభినయ గ్రంథమని వినవచ్చుచున్నది. బ్రహ్మోక్తమగు నాట్యశాస్త్రమున ప్రవీణుడైన భట్టపుత్రుని ప్రస్తుతించుట కుట్టనీమతములో గానవగును. సదాశివ భరతమొకటి కలదు: నందికేశ్వరుని భరతార్ణవము నాలుగు వేల శ్లోకముల గ్రంథము. ప్రస్తుతము దొరకుచున్న గ్రంథములో ఐదవ అధ్యాయమునుండి పదునాల్గవ అధ్యాయమువరకు గలదు. అభినయాధ్యాయము

గుహేశ భరత లక్షణమని పిలువబడినది. దీని సంక్షిప్తముగావించిన గ్రంథము భరతార్థచంద్రిక. నందికేశ్వర సంహితయొకటిగలదని రఘునాథు డనినాడు. నందికేశ్వరుని మతము భరతునకన్న భిన్నమైనట్లు అభినవుడు, కల్లినాథుడు ఎంచినారు.

నాట్య, సంగీతశాస్త్ర ప్రవక్తలుగా మూధర గణేశ, షణ్ముఖ, వాయు, దుర్గలు గలరని మతంగుడు పల్కినాడు. విశ్వావసు, ఆంజనేయ, వ్యాసుల నిట్లే ప్రస్తుతించినవాడు శారదాతనయుడు. హరి, కమలాసన, బ్రహ్మ, చండి, షణ్ముఖ, భృంగి, సరస్వతి, కుబేర, బలి, విశ్వకర్మ, కలిక, అంగద, గుహ, సముద్ర, విక్రముల నిట్లే ఎంచినవాడు నారదుడు.

కామదేవుని నృత్యలక్షణము తాలలక్షణమున గలదు. సింహభూపుని సంగీతరత్నాకర వ్యాఖ్యలో దక్షప్రజాపతి కారిక కన్పించుచున్నది. ప్రశాంతి నాటకమున సాత్వతీ వృత్తిగలదని ద్రౌహిణు డనెనని శారదాతనయుడనినాడు. ధేనుకుని తాళాధ్యాయము కుట్టినీ మతమున స్మరింపబడినది. కంబళ, అశ్వతరులను నాగులు సరస్వతీ ప్రసాదమున నాదవిద్యను గ్రహించిరని దామోదరుని సంగీతదర్పణమున గలదు. ఇంద్రధ్వజోత్సవమున ప్రదర్శించిన నాటకములో భాండవాద్యమును స్వాతి వాయించెనని భరతు డనినాడు. దీనిపై వ్యాఖ్యానించుచు స్వాతి కనుగొనిన పుష్కరవాద్యమును అభినవుడు వివరించెను.

సంగీతాచార్యులలో కశ్యపుడు గలడని అభినవభారతిలో చెప్పచు, రసభావ వినియోగములకు అనుగుణమైన రాగములను తెలుపు కశ్యపపంక్తుల నిచ్చినాడు. కావ్యాదర్శ వ్యాఖ్యయగు హృదయంగమములో కశ్యపుడు, వరరుచి లక్షణశాస్త్రములను చెప్పిరనిగలదు. కశ్యపువిపంక్తులను, బృహత్కాశ్యపమును ఉదహరించినవాడు నాన్యదేవుడు.

నారదీయశిక్ష అను నారదుని సంగీతశాస్త్రమొకటి గలదు. భరతుడు (34.19) సామస్వరమున నారదుని భావముల నుదహరించెను. అభినవుడు (28, 18, 25) అనేక స్థలముల నారదుని గ్రంథమును ప్రస్తుతించెను. నారదశిక్షలో చెప్పబడిన గాంధారగ్రామము మానవస్వరమునకు అందని దగుటచే భరతుడు దీనిని వదలెనట! రాగనిరూపణము గ్రంథమున 140 రాగములను నారదుడు వివరించినాడు. పంచమ సారసంహిత మరియొక నారద గ్రంథము. మూడు అధ్యాయములలోనున్న దత్తిలనారద సంవాదమున రాగములు, శ్రుతులు, స్వరములు వివరింపబడినవి. నారదుని సంగీతమకరందమున నాలుగుఅధ్యాయములు సంగీతముమీద, మిగిలిన నాలుగుఅధ్యాయములు నాట్యమును గురించి గలవు.

ఆంజనేయ భరతము సంగీతగ్రంథము. దీని సంక్షేప స్వరూపముగా యాస్తికమతమున్నది. మతంగుని భావములు కొద్దిమార్పులతో ఇట కన్పించుచున్నవి.

మూడు అధ్యాయములతో నున్న సంగ్రహచూడామణి షణ్ముఖుని కృతియనినారు. ఇదట సంగీతముయొక్క పూర్వోత్తరగములు వివరింపబడినవి. అర్జునభరతము నాగార్జునుని కృతి. సంగీతశాస్త్రమునకు చెందినది. మతంగ, కల్లినాథులు రుద్రటుడను సంగీతశాస్త్రకర్తను స్మరించిరి. పుదుకోటలోని కుడిమియామలై కొండపైన చెక్కబడిన సంగీతగ్రంథము రుద్రాచార్యుని దందురు.

నాన్యదేవు డనబడు రాజనారాయణుడు తిర్హూత్ పాలకుడు. క్రీ. శ. 1160 లో వంగదేశీయుడగు విజయసేను డితనిని ఓడించెను. నేపాలు లోయలో కర్ణాటక వంశమును స్థాపించిన నాన్యదేవుడు భరతనాట్యశాస్త్ర

ముఁ జేసు భాష్యమును రచించెను. దీనినే భరతవార్తిక మని, సరస్వతీ హృదయభూషణమని, సరస్వతీ హృదయాలంకారమని అందురు. ఇది 17 అధ్యాయముల గ్రంథము.

శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము (క్రీ.శ.1170) జగదేకమల్ల చాళుక్యచక్రవర్తి (1138 1150) రచించిన సంగీతచూడామణి. భూలోకమల్ల సోమేశ్వరుని (1116-1127) మానసోల్లాసము మొదలైనవి సంగీతశాస్త్ర వివేచన కుపకరించు గ్రంథములు.

# తెనుగులో తలకట్టు అకారచిహ్నముగాదు

### ప. వేం. కృష్ణమాచార్యులు

స్వరసహాయము లేనిచో వ్యంజనములు సుఖముగా నుచ్చరింపబడవు. అందుకనియే వర్ణసమామ్నాయము నుచ్చరించునపుడు వ్యంజనములకు అకారోచ్చారణ మున్నది. ఈ పద్ధతి భారతీయ భాషావర్ణములందంతటను అగపడుచున్నది. ఈ అకార సహాకారము వ్యంజనోచ్చారణము నందె గనుక వ్యంజనాక్షరలిపిలో అకార చిహ్న మేదైన నుండవలయుననుట సరిగాదు.

ప్రస్తుతము తెలుగులిపిలో వ్యంజనములందు గల కొన్న తలకట్టు అకార చిహ్నమని కొందరు, నిండువనమునకని మఱికొందరు వర్ణించుచున్నారు. కాని తలకట్టును గూర్చి సమగ్రపరిశీలన జరిపినచో అది తిద్దర్థకమాత్రమే యగునుగాని అకార చిహ్నముగాదని తెలియకపోదు.

క్రీ॥ శ॥ 1000—1300 లకు మధ్య నేర్పడిన సంధికాలపు లిపియగు వెంగీ చాళుక్యలిపినుండి ప్రాత తెలుగులిపి దానినుండి నేటి తెలుగులిపి యేర్పడినవి. మొట్టమొదట అప్పవక్రములతో నున్న తెలుగులిపి శ్రీనాథుని నాటికి మంచి కుదురిక సంపాదించుకొని కవులచే కీర్తింపబడినది. ఎంత కుదురిక సంపాదించుకొనినను తలకట్టుగల వర్ణములు తలకట్టును పోగొట్టుకొనలేదు. తలకట్టు లేని జ, బ, ల, మున్నగు వర్ణములలో అకారధ్వని లేక పోయినదా? మఱియు కు, కూ, కృ, మున్నగువానిలో తలకట్టున్నంత మాత్రమున అకారధ్వని నంగీకరింతుమా?

ఇక గుణితపు పద్ధతిని పరిశీలించినచో తలకట్టు అకారము గాదని మరింత స్పష్టము కాగలదు. వ్యంజనాక్షరములకు సంక్షిప్త స్వరచిహ్నములు కలుపుటలో అందు అకారమును చేర్చునపుడు కాకు తలకట్టిస్తే క చెప్పుటలేదు. అట్లే జ, బ, ల లకును. తరువాత కాకు దీర్ఘమిస్తే కా, అని చెప్పుచుంటిమి. ఇప్పుడు ఈ దీర్ఘము నొకానొ స్వరచిహ్నమని చెప్పకపోయినను అర్థాత్తు అది వర్ణసమామ్నాయ పాఠములోని అకారస్వర సాధారముగానిదియే నిరుపాధికముగా దీర్ఘమని చెప్పుచుంటిమి. అట్లే జా, బా, లా అనియును, ఇక వ్యంజనాక్షరగుణితములో న, మ, య, ర, ల అను వర్ణములను ఒత్తక్షరములుగా వ్రాయునపుడు తద్భిన్నాక్షరములకు వలె తలకట్టును మాత్రము తీసివేయుటగాక ్న, ్మ, ్య, ్ర, ్ల అని సంపూర్ణ పరిణామము చేయుటకు కారణము తలకట్టేనని తేలుచున్నది. ఈమార్పు నందంపూడి శాసన లిపియందే కనబడుచున్నది. ఆ శాసనకాలపు లిపిలో, న, వ, వర్ణములకు తలకట్టు తీసివేసినచో వాని భేదము గుర్తించుట కష్టమని క్రీ. శ ౧ నాటి కాలంకాయన లిపి యందున్న ్న (న) కారమును గ్రహించి తలకట్టువంటి గీత తొలగించి ఒత్తు చేసినారు. అట్లే సం. శా. ము నందలి మకారమునకు తలకట్టు తీసివేసినచో వర్ణాంతర సాంకర్యము సంభవించునని యెంచి కాలంకాయన లిపి యందలి మకారమును ఒత్తుగా స్వీకరించిరి. ఆ రీతిగానే సం. శా. ము నందలి య, ఘ, వర్ణములకు సాంకర్యము సంభవించుటచే కాలంకాయన లిపియందలి యకారమును తీసికొనిరి. అది క్రమముగా తిక్కన సోమయాజి కాకతిగణపతిదేవుని శాసన సమయమున 'య' గా మారినది. ఆ విధముగానే సం. శా. లిపి యందలి ఠ, ర, లకు సాంకర్యమును గుర్తించి కాలంకాయన లిపి యందలి J (ర, వర్ణమునకు గీత తొలగించి క్రొత్తదిగా స్వీకరించిరి. ఇట్లే సం. శా. లిపి యందలి లకారమునకు వట్టువసునకు భేదము లేకుండుటచే నాగరి లిపి యందలి ల కారమునకు గీత తీసివేసి ఒత్తుగా వ్రాసిరి. అని తేలుచున్నది.

అయితే లాక్షణికులు అకారమును తలకట్టు అని వ్యవహరించిరిగదా యనవచ్చును. వర్ణసమామ్నాయములో తలకట్టు వర్ణములే ఎక్కువగా నుండుటచే బాలబోధకొఱకు గుణితములో ఆ తలకట్టునే అకార చిహ్నముగా ఛత్రిన్యాయముతో వ్యవహరించియుండవచ్చును. కావున తలకట్టునకు అకారమునకు జ్ఞాప్యజ్ఞాపకభావము మాత్రము కుదురుట లేదు.

మఱియు వ్యంజనాక్షరములందు అకారధ్వని ఏమాత్రము లేదని చూపుటకు వ్రాయు పొల్లు (ౕ) తలకట్టు పైభాగమందె వ్రాయవచ్చును. కాని అప్పటున ప్రధానమైన పొల్లును మాత్రము వ్రాసి లేఖనా సౌకర్యము కొఱకు తలకట్టును వ్రాయుట లేదని యూహింపవలెను. పైపెచ్చు తలకట్టు లేని వర్ణములకు కూడ యీపొల్లు గుర్తు వ్రాయుటపై వాదమునే బలపరుచుచున్నది.

# గ్రంథ విమర్శనము

## సుభాషిత త్రిశతి

అనువాదకుఁడు. రూపావతారం నారాయణ శర్మ. భారతి కుటీరము. హిందూపూరు, అనంతపురం జిల్లా. వెల: 75 నయాపైసలు.

సంస్కృతములో నీలకంఠ దీక్షితులు రచించిన 'సభారంజన' 'కలివిడంబన' 'వైరాగ్య' శతకములను లఘుకృతులకు 'సుభాషిత త్రిశతి' అను పేరఁ జేసిన అనువాదమిది. నీలకంఠ దీక్షితులు అప్పయ్య దీక్షితులకుఁ దమ్ముని మనుమఁడు. మధుర తిరుమల నాయకునకు గురువు, మంత్రియును. మహాభాష్యమునకు వ్యాఖ్య రచించిన మహావైయాకరణుఁడు నీలకంఠ దీక్షితులు. అయినను ఈయనకు కవిగానే యెక్కువ ప్రసిద్ధి. నీలకంఠ చంపువు, శివలీలార్ణవము, దీక్షితుల గొప్పకృతులు. పై లఘుకృతులు విశేషవ్యాప్తికలవి. వేంకటాధ్వరి రచించిన విశ్వగుణాదర్శము వంటికంటె దీక్షితుల లఘుకృతులయందే సునిశితమైన లోకవృత్తి పరిశీలనమును, సూత్రప్రాయమైన ఉక్తి విశేషమును, కవితా పరిపాకమును, గోచరించును, తెనుఁగు దేశములో దీక్షితుల లఘుకృతులకు కలయునంత వ్యాప్తి రాలేదు. శ్రీ శర్మగారి అనువాదము ప్రశస్తముగ నున్నది.

ఇచ్చువాని హస్త మెగువవైపున నుండు
వకొను వానిచేయి యడుగువైపు
ఎగువ చేతివారె లెక్కువవారైరి
దిగువ చేతివారు దీనులైరి.

ఇట్లు అనువాద క్లేశము లేమాత్రమును బయలుపడనీయని నైపుణ్యముతో రచన సాగినది. ఇందలి సుభాషితములకు దిఙ్మాత్రముగ;

పొందని కామసుఖమ్మును
పొందగ యౌవనం బదెట్లు పూనును జగతిన్
వందురు బ్రహ్మసుఖమ్మును
పొందగ నేయొక్క పుణ్యపురుషుఁడో! జగతిన్

వెలికివచ్చి పోవువలవాటు పడినట్టి
ప్రాణవృత్తియైన శ్వాస మకట
కులట రొల్లు కెలఁకమఁ గులపతి, వారీతి
చిత్తవృత్తిఁ గూడఁ దెలియదుమందు.

తాను పొగడఁదగిన జ్ఞానిచే స్తుతివంది
ఘనికుఁడొందఁడొం! తత్తరమ్ము
తనకు పేర్పుఁడైన మనుజుఁడే కొనిమ్ము
సేవఁజేయుఁడనకు సిగ్గుపడెఁడు.

సాహితీ విద్యకంటెను శాస్త్రవిద్య
చదువుటయె యర్హమని నీవు మదినిదలఁతె?
వేదమది గొప్పవల్లించరాదొ! శేష
శివభజన యంతకూ మేలు చేకురాదొ!

ఇందీ ప్రయోగవిశేషములు కనుపట్టుచున్నవి. 'మన వని' ('మనల వని' అనుటకు) 'వళలలు' (వళలాలు అనుటకు) 'ఒక్క చెవి' (ఒక్కని చెవికి) 'ఇచ్చిననూ యియ్యకున్న' 'అంతకూ మేలు' (అంతకంటె మేలనుటకు.) 'కమ్మగుండు' (కమ్మగ నుండు అనుటకు) ఇత్యాదులు.

## సుధాబిందువులు

కుంటిమద్ది శేషశర్మ. తెనుఁగు పండితుఁడు పెనుకొండ. అనంతపురం జిల్లా. వెల 0 8.0.

దీనిలో నూటపైగా ఆటవెలఁదులు శ్రీ శ్రీనివాస స్తోత్ర పరములుగా రచింపఁబడినవి.

సర్వధర్మములను సన్యసించితి; నీదు
చరణ కమలములను శరణమంటి;
కావవయ్య యన్య గతిహీను నారాయ
ణా! రమేశ! కేశవా! ముకుంద!

ఇట్టి ప్రపత్తినుండి యీ స్తుతికావ్యము పుట్టెనట. స్వీయ భావములతోఁబాటు పూర్వ వైష్ణవస్తుతి ప్రబంధములనుండి కూడఁ గొన్ని భావము లిందుఁ జేరినవి.

శేషశర్మపేరు; శ్రీనివాసాచార్య
పండితాగ్రగణ్యు పౌత్రుఁడేను
అడిదాను పూర్వులాడినవే: తప్పు
లున్న నావి: పరుల వొప్పులున్న.

ఇది కవియొక్క వినయమును మాత్రమే సూచించుచున్నది. రచన, పారాయణ యోగ్యముగ నున్నది.

'కావ్యము లఘువేకాని దాని వెనుక చోదకముగా నున్న నిర్వేదము చాల గొప్పది' అని శ్రీకాకర్తి పరిశీలించి చెప్పిన మాట యథార్థమనిపించుచున్నది.

## దివ్యస్మృతులు

కొండవీటి వెంకటకవి. కవిరాజ గ్రంథమాల. పొన్నూరు. వెల రూపాయిన్నర.

వేమన, వీరగురుఁడు, (వీరబ్రహ్మము) సిద్దప్ప, మస్తానయ్య, వెంకమాంబ, అలరాజా కృష్ణదేవ రాయలు, మూర్తికవి, చిన్నయసూరి, రామస్వామి చౌదరి, రామలింగారెడ్డి, వెంకట నరసయ్య, నాగార్జునుఁడు, వీరేశలింగము, అప్పారావు, తిరుపతి వెంకటేశ్వరులు, శ్రీరాములు—ఈ శీర్షికలతో—రచయిత వీరి యందు తనకుఁగల 'దివ్య' భావమును పద్యరచనారూపమున ప్రకటించెను. రచయిత భక్తికి ఆస్పదములగుటయే పై రెల్లరి యందుఁగల సామాన్యధర్మమని తోఁచుచున్నది. వేమన్న నుండి మస్తానయ్య వరకు, వేదాంతులు, వెంకమాంబ, వీరేశలింగము, అప్పారావులు సంస్కర్తలు. కృష్ణదేవరాయలనుండి వెంకట నరసయ్య వరకు, కవులు. అలరాజు, శ్రీరాములు, దేశభక్తులు. నాగార్జునుఁడు నాగార్జునుఁడే. ఇందలి పద్య శైలికి—

నీ రచనల్ గ్రహించిన మనీషులు పశ్చిమదేశవాసులే
తీరని యాశతో ననువదించిరి యాంగ్లమునందుభిన్నలౌ
వారలు వారివారి తెలిభాసను దేరిచి దిద్దినార లీ
తీరున శేకపింగ్రుని కృతిం బొనరించిరి యోగి వేమనా!

వేమన పద్యము లింగ్లీషులోని కనువదింపఁబడుటయే యితర కవులకన్న వేమన గొప్పకవి యనుటకు నిదర్శనమన్నమాట!

మ॥ అకటా! యెంతకు లేరు రూపమతులాహా! కృష్ణ
భూమీశు, ది
వ్యకవిత్వం బలసాని పెద్దన కృతింబం చిట్టినీలాపనిం
దకుఁ బాల్పెనె కృతఘ్నుతిందలిపి రిద్దావంగొ అం
లేమి! గొ
ప్పకు గొప్పైనది యల్లసానులు రచింపంజాలు
వారె నృపా!

ఆముక్తమాల్యదా కర్తృత్వమును పెద్దనయందు ఆరోపించిన వారి నుద్దేశించి రచయిత ఆక్రోశము కొంతవరకు వ్యాఖ్యేయమే. ఆరోపించినవారిది అరయమి. కృతఘ్నులగుటకు వారు రాయలకు సమకాలికులు కారు. 'ఆముక్తము' దాని పద్ధతిలో 'గొప్పకు గొప్ప' కావచ్చును. ఆంధ్ర కవితా పితామహుని గూర్చి 'అల్లసానులు' రచింపజాలువారె!' అను అవహేళనము ఔచిత్యపు హద్దుదాటి గ్రామ్యధోరణిలో పడినది. 'శ్రీరాములు' అను శీర్షిక పద్యములు బాగున్నవి.

—శివశర్మ.

### శివానుగ్రహము, పితృయజ్ఞము

కావ్యద్వయము : రచన : శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు : మునిరావు వీధి, కడప; అమూల్యం.

ఇందు మొదటిది శివస్తుతిపరమైన శతకము ; రెండవది (పితృయజ్ఞము) దశరథుని మరణవార్త విని విషాదమునందిన శ్రీ రామచంద్రునకు కులగురువు వసిష్ఠుడు ధర్మోపదేశముచేసి దుఃఖోపశమనము చేయుట కథావస్తువుగా గల కావ్యము. ఇది, రచయిత పరలోకగతుడైన తన తండ్రికి సమర్పించిన కావ్యాంజలి.

రచయిత సంస్కృతాంధ్ర సాహిత్యరీతుల నవలోడనచేసి ప్రౌఢవచో వైఖరిని సంతరించుకొన్నవాడు. కవితాసాధన రచయితకు సాక్షాత్ యోగసాధన.

'కవితాసాధన యోగసాధనముగా
కల్పించి సద్యోగసం
భవ మానందము పొందజెంచితి రస —
బ్రహ్మోవతారా! రసో
ద్భవ సాహిత్య సదబ్జయోని! పృథు శి
ష్ట బ్రహ్మ చిన్మూర్తీ! నా
కవితా యత్నము లర్థవంతములుగా
కల్పింప నీవే! శివా!

ఇదియొక సాధనాపథము
ఎందరో పూర్వ ఋషుల్ గమించి చ
న్నది; మహనీయు లా పురుషు
లందరు; తత్పద పంకజాతముల్
కదలిన గుర్తులంబడి ప్ర
క్రామగతిన్ పయనింతు నేను — నా
రిద యనుభూతి నన్ను న వ
రించు సనాతన భావమై శివా!'—

* * *

'ఈ వంశవస్థిన హేతు మహాస్థి ర
క్తంబులో నున్న ప్రాగల్భ్యశ్రీ మెరిగి
ఈ వంశపావిత్ర్య భావనావిధుల తే
జస్సు పెంచిన తపశ్శక్తిపొంది
ఈ వంశపాలనా హేలా సమారబ్ధ
శైవ సంకల్ప రక్షణమువడసి

ఈ శంకరపూర్వ మహీయాః కళాస్వరూ
ప మధుర కావ్యశిల్పములు తెలిపి
రౌద్రవసుమిత్ర పితృదేవలోకద త్రి
చాతురీ కమనీయ పారీతమునుచు
నాతనూవాహమైన ప్రాణానిలంబు
నాగశింబులలో శిపుమన్నది స్వరంబు'

'శివానుగ్రహము'గా రచింపబడిన ఈ కవితా మంగళగీతికలు రసలోలుపులైన పరమశివుని సైతము భక్తిపాశముల బంధింప సమర్థములై యున్నవి. ఇది దర్శన భాగ్యము నందిలోవు అవ్యప్త సాగకుని ఉత్కంఠయే అక్షర రమ్యాకృతినందినట్లున్నది :

'అదిగో దివ్యడెడమున్ శిరస్థితినునీ
వ్యాళసంగ సంభావనా
స్పదముల్ తుంగతరంగ సంఘటితశ
బ్దశ్రీలు సమోన్నహముల్
మృగునైవారి విధూనికా మణిమయా
మేయాచ్ఛ కాంచీక్వణా
భ్యుదయోత్తాపిత దివ్యశబ్దములు నీ
వున్ విద్యునత్లశివా!

భావనా వైచిత్రియందేమి, శబ్దవిన్యాసమునందేమి రచయిత సంపన్నుడు. సహృదయానందదాయకములైన ఈ రెండు రచనలును శ్లాఘనీయములై యున్నవి.

* * *

## పుష్పబాణ విలాసము

అనువాదకులు: శ్రీ భట్టారం మల్లికార్జునం, శ్రీ కోలకులూరి నారాయణరావు గార్లు. ప్రాప్తిస్థానం: శ్రీ భట్టారం మల్లికార్జునం, రత్నవిలాస్, రామమూర్తి నగర్, నెల్లూరు వెల రు 0-50-న॥ పై.

అర్కభట విరచితమై, కాళిదాసు కృతిగా చెలామణి అవుతున్న సంస్కృత రచనకు ఇది అనువాదం, ఇది శృంగార రస ప్రధానమైన 26 శ్లోకములు. ముక్తకముల రూపములోనున్న ఈ శ్లోకముల నన్నిటినీ సమన్వయపరచి, అనువాదకులు మాధవ విలాప రూపమైన ఒకకథను కల్పనచేయ ప్రయత్నించినారు. సంభాషణా రూపమున రచింపబడిన ఈ కల్పనలో మధ్య మధ్య తమ అనువాద పద్యములను చేర్చి కూర్చినారు.

'శేతే శీతకరో ఒమ్బుకే కువలయ
ద్వన్ద్వాద్విరిగ్భ్వతి.
స్వచ్ఛామౌక్తిక సంహతి, ర్ధవలిమా
హైమీం లతా మంచతి,
స్వర్ణాత్ పంకజకోశయోరభినవా
యాన్తి ప్రజాః కాన్తతాం
పీయోత్పాతి పరంపరా మమసఖే
యాత్రా స్పృహోన్ కృన్తతి.'

అన్న శ్లోకానికి వీరి అనువాదం ఇలా వున్నది :

'శశిమయూఖుడౌర ! సర
సీజమునన్ శయనించె, రాలె ము
క్తాతతి నుత్పలద్వయము;
కాంచనవల్లిక తెల్లబారె; వ
న్జాతపు మొగ్గజంట బడి
వాడెను క్రొంబువుదంపె; లిట్టియు
త్పాత పరంపరల్ తునిమి
వై చెను నాపయనంపు కోరికన్.

పై శ్లోకమున కేవల ఉపమాన శబ్దములు చెవుల బడినంతనే ఉపమేయములు తమంతటా స్ఫురించి విరోధాభాసమును వెలుగులోని కీడ్చుచున్నవి. అనువాదమున అట్లు స్ఫురించుటలేదు. అనువాదమున వాడబడిన ఉపమాన శబ్దములు బహుళ ప్రసిద్ధి లేనివగుటయే ఇందులకు కారణమై యుండవచ్చును. ఇట్టి శ్లోకముల అనువాదములో అనువాదకులు శబ్దములను ఎన్నిక చేయుటలో మరికొంచము శ్రద్ధ వహింపవలసినది. ఈ శ్లోకమునకు మరియొక ప్రాచీనకవి ఇట్లనువాదము చేసినారు :

"క్రొత్త వెత్తమ్మిపూవుపై కూర్కెడెందు
చందమామపయిన్ తమస్సమితి వెసలె
కనగి కల్వలజతవెలి గ్రక్కుచుండె
చాలమేలైన మంచిముత్యాల చాలు"—

ఈ అనువాదంలో కించిత్తు మూలాతిక్రమణం వున్నా (తమస్సమితి), మూలంలోని భావం మరొక మెట్టులోనికి వికసించింది. ఇది యేమైనా, కథాకల్పనపట్ల చూపిన శ్రద్ధ

రచయితలు మూలానువాదంలో చూపలేదని తోస్తుంది. పుష్పబాణ విలాసానికి ఇతర అనువాదాలున్నా, ఇందు నూతనంగా కథాకల్పన ఒకటి చేర్చబడి వున్నది గనుక సహృదయులు ఆదరింప దగివుంది.

*       *       *

## ఖండకృతి

ఖండకావ్య సంపుటి. రచన : శ్రీ జాస్తి వేంకట నరసయ్య; హైస్కూలు పండితులు, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా; వెల 0-12-0.

శ్రీ వేంకట నరసయ్యగారు ఆయా తరుణము లందు వ్రాసిన పద్యములను సంపుటిగా ప్రకటించినారు. ఇందు: పుస్తకము, కవి, చిత్రకారుడు, జనకుడు, శ్రీకృష్ణాష్టమి, మహాత్ముడు, బోసువీరుడు గ్రంథాలయోద్యమం, వెందలైన దాదాపు ముప్పదిఖండి కలలో పద్యము లున్నవి. ఇందుచాలవరకు ప్రచార స్వభావకలవి. కావ్యగుణము బహుస్వల్పము. పద్యములు పరిశీలనగా నడచిపోవును. ఉదాహరణకు.

'విశ్వమానవ మైత్రి విలసిల్లి భువిలో
సంగ్రామ విరమణ జరుగు వరకు
ఆహారమే లేక యాత్మహత్యకు బూను
మానవలోకమున్ మనుదు వఱకు
ఆధారమే లేని యావద లందిలుగూడ
విద్యా సమగ్రులై వ్రాయువరకు
హింసకాపట్యాది హేయ గుణావళి
మలిన కర్మమ్ములు మాన్పువఱకు
సంఘ సంస్కారమంతట జరుగువఱకు
లలితకళల వికాసంబు కలుగువఱకు
ధర్మరాజ్యమ్ము సర్వత్ర తనరువఱకు
వలదు కర్తవ్యకర్మముల్ వదలవలదు.

*       *       *

## కవిత

సంపాదకులు : శ్రీ జాస్తి వేంకటనరసయ్య; చిలకలూరిపేట. గుంటూరుజిల్లా వెల రు 0-8-0

కవిత, ఆంధ్రభావ, కవి, ఆంధ్ర పతాకము, తమ్ముడా, ఇత్యాది శీర్షికలలో విభజించి, ప్రాచీనాధునాతన కవులు (తమతోసహా) ఆయా సందర్భములలో వ్రాసిన పద్యాలనూ, పాటలను సంపుటీకరించారు. వీనిలో ప్రసిద్ధుల రచనలేగాక అప్రసిద్ధులవి కూడా వున్నాయి. కావ్యగుణముగల రచనలతోపాటు కావ్యగుణములేని రచనలు కూడా సేకరింపబడినాయి. ఈ సంపుటీకరణలో అనుసరింపబడిన విధానమేమో అవగతము కాదు.

* * *

## యాత్రామార్గదర్శి

### [దక్షిణ భారతము]

రచన: శ్రీ రాగం వేంకటేశ్వర్లు, ప్రకాశకులు శ్రీ సీతారామ నామ సంకీర్తన సంఘము, శ్రీరామనామక్షేత్రము, గుంటూరు, వెల రు. 4/-

ఇది ద్వితీయ ముద్రణము, ఈ గ్రంథమునందు 'దక్షిణ భారతమునందలి' ఆయా ప్రసిద్ధ క్షేత్రముల వివరములన్నీ స్థలపురాణములతో సహా వివరముగా వొసంగబడినవి. చిత్ర పటములతో సహా దాదాపు 500 పేజీలుగల బృహద్గ్రంథము. దక్షిణ దేశయాత్రలు చేయువారికి అత్యంతోపయోగమైనది. శ్రీరామ నామ క్షేత్రమందు వేంచేసియున్న శ్రీ కోదండరామప్రభువు త్రివర్ణచిత్రముతో గ్రంథము ముచ్చటగానున్నది.



## స్వీకారము

స్నేహా కావ్యము: రచన: శ్రీ వేదము వెంకటకృష్ణశర్మ; ప్రాప్తిస్థానము: ఉదయారంజనీ పబ్లిషర్సు, మాశీ మద్రాసు-7. వెల రు 2-75 న॥ పై.

కావ్యగంగ: (ఖండకావ్య సంపుటి) రచన: శ్రీ బెస్వాది శ్రీనివాసమూర్తి; ప్రచురణ: కిశోర కవితా సమితి, ముదిగల్లు, కళ్యాణదుర్గము తాలూకా. వెల రు 0-50 న॥ పై.

గీతా సంగ్రహము: సంగ్రహకర్త: శ్రీ కృత్తివెంటి నాగేశ్వరరావు; నెం. 6. శివకోవలవీధి, కోడంబాకం, మద్రాసు-26. వెల రు 0.4 0.

మాటలతో మంతివాలు: వ్యాససంపుటి; రచన: 'సూత్రశ్రీ' ప్రాప్తిస్థానం: విపంచికా ప్రచురణలు, శ్రీపతి ముద్రణాలయం, కాకినాడ. వెల రు 0.8-0.

వార్షికోత్సవము: లలితకళాసమితి (కోకరపల్లి) వార్షికోత్సవ సంపుటి. అమూల్యం.

హ్రీంకార శతకము: రచన: శ్రీ మాకల సత్యనారాయణశాస్త్రి, గద్వాలభవనం, నాంపల్లి, హైదరాబాదు. వెల రు 0-6-0

తులసీ గోపూజ: (తులసీపూజా విధానం, గోపూజావిధానం; సంపాదకులు: శ్రీ కుంగుర్తి వేంకట నరసయ్య, శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి; సాధన గ్రంథమండలి, తెనాలి; వెల 0-3-0.

హితము: (పద్యరచన): రచన: శ్రీ కలగోడ అశ్వత్థరావు; కలగోడు (పోస్టు); రాయదుర్గం తాలూకా అనంతపురంజిల్లా, వెల రు 0-4-0.

నవమాలిక: ఖండకావ్యసంపుటి; రచన: శ్రీ వేయుగంటి నరసింహాచార్యులు; ప్రకాశకులు: రాజశ్రీ కళాపీఠము, సికింద్రాబాదు; వెల రు 1-0-0.




**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**